# ధర్మచక్రము

విశ్వనాథ సత్యనారాయణ

పబ్లిషర్:

**వి. వరలక్ష్మి**

మారుతీనగర్, విజయవాడ - 2.

## అంకితము

శుక్ర బృహస్పతులు

వసిష్ఠ సుమంత్రులు

కృష్ణ విదురులు

రాక్షస చాణక్యులు

అక్కన్న మాదన్నలు

నెహ్రూ పటేలులు

పట్టాభి ప్రకాశములు

ఈ రీతి జంట జంటలుగాఁ దీర్చు

**భారత జాతీయ మంత్రిభావమునకు**

ఈ గ్రంథములోని

చారిత్రాత్మక విషయము లన్నియు

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు, M. A. B. L., గారి

Early History of South India

అను గ్రంథమునుండి గ్రహింపబడినవి.



# ధర్మచక్రము

## ప్రథమాధ్యాయము

అది కాళరాత్రి. విజయపురి మంతయు నిశ్శబ్దముగా నున్నది. నలువైపుల నున్న పర్వతములమీఁద నున్న మండప ములలో ప్రతీరభటులుకూడ మాఱుగన్ను పెట్టుచున్నారు. ఆకాశమునందు నల్లనిమబ్బులు జడలు విరియఁబోసికొని వెదు దిరిగిన వర్షాశ్రీవలె నయననక్షత్రకాంతి గోచరింపనిచ్చుట లేదు. నాల్గుకొండలను పొడిచి పట్టుకొన్నట్లు జలధరాంధ కారేందిర విజృంభించెను. ఆ కటికచీకటిలో నిది రాచనగరు, నిది విహారములు, ఇది నాగార్జునకొండ, ఇది కొండపైని రాచ

నగరు, ఇది పశ్చిమ ద్వారము, ఇచ్చట నెవరో మహారాణివంటి స్త్రీయొక్క రహస్యాజ్ఞ చేత విశ్రముండైన రక్షకభటుండు ద్వారము తెరచుట, యాపర్వతోపరిద్వారమునుండి స్నిగ్ధసోపానములవెంట నామహారాణి కృష్ణవేణ్ణలోనికి దిగుట యేమియుఁ గనిపించుటలేదు. ఆమె రేవునందు నూటిగ దిగక, దక్షిణాభిముఖముగాఁ జాల దూరముగఁ బోయెను. అసలే నిర్జనమైయున్న యాస్థల మచ్చట మఱియు నిర్జనముగా నయ్యెను. ఆనాఁడు రేవునందొక్కపడవయు లేదు. తూర్పువైపునుండి వచ్చు కృష్ణాతటిని యచ్చటఁ గొంతసేపు దక్షిణముగాఁ బ్రవహించి, మఱల మలుపు తిరిగి, పర్వతపశ్చిమభాగమువెంట నుత్తరాభిముఖముగాఁ బోయి విజయపురపర్వతములు దాటిన తరువాత వాయవ్యదిశగాఁ బ్రవహించుచున్నది. నాగార్జునకొండ చివరఁ గృష్ణాభవాని మలుపుతిరిగినచోట నా మహారాణి నిలచెను. ఆమె యొక్కర్తుకయే కాదు. వెంట నొక పరిచారికయు నుండెను. ఆ పరిచారిక చెకుముకిరాయి గీసి మిణుగురుపురుగు మెఱసినంతటిమాత్రపు వెలుఁగుకలిగించెను. ఒక్కనిమేషములోఁ గృష్ణానదిలోనుండి యట్టిమెఱుపే మఱియొకటి కలిగెను. వారచ్చటనే నిలుచుండిరి. ఓహో చమత్కారము! పరమమైన గాఢాంధకారములో వెలుఁగు రేకల జ్యోతిస్తారతమ్యము! పెఱసవ్వడి వినని యొక గంభీరఝంఝామధ్యమున నొక సన్నని సవ్వడి చారవ చేసికొని ప్రత్యేకముగా వినిపించుట మెలఁకువతో నీటిలో సడి కలుగకుండ నెమ్మదిగాఁ దీసిన తెడ్డ జాగ్రత్తయైన కదలికవలన తొలఁగిన నీటిపనల చిఱుసవ్వడి

వారి చెవులు గుఱుపట్టెను. ఒడ్డునకుఁ బడవవలెఁ జేరిన యొకనల్లని చీకటిముద్ద, యందునుండి యిద్దరు వ్యక్తులు దిగి యొడ్డునకు వచ్చుట, వచ్చిన యొక వ్యక్తి చేతిలో నొక పసికూన, నెత్రు కందుపెట్టిన సన్నని కేక, ఆ కేకసవ్వడిని గాలి తరగలమీఁద దొరలిపోకుండ నా వ్యక్తి క్రిమ్మకొన్న దుప్పటి- అదృష్టవశమున వాయువు కృష్ణ కెదురు పోవుచుండెను. ధ్వని యుత్తరాభిముఖముగాఁ బ్రసరించదు. ఎగువకును బోదు. ఆ పుట్టిన సన్నని ధ్వనితరంగ మచ్చటనే స్తంభించినట్లుండెను. రాణి చేయి చాపెను. ఆ వ్యక్తి శిశువును రాణిచేతిలో నిడుటకు జాగు చేసెను. రాణి తనచేతిలో నున్న బంగారునాణెముల సంచి చేతి కందీయఁబోయెను. ఆ వ్యక్తి యిట్లనెను. 'అమ్మా! ధనము కోసము కాదు. ఈ బిడ్డ నాబిడ్డ కాదు. నేను నాబిడ్డ యని చూచుకొనునంత ధైర్యము నాకులేదు. చంపునంత కటికతనములేదు. నాబిడ్డ నేమి చేసెదవో చెప్పుము. నా బిడ్డను మరల నన్నుఁ జూడనిత్తువా? నేను నేనుగాఁ జూడలేను. నేను జూచుటకు నీవే సాయపడవలెను" అని యేడ్వ నారంభించెను. ఆ రాణికిఁ బ్రతినిమేష మచట ముండ్లమీఁద నుండినట్లుండెను. మాటలు పెరిగిపోయినకొలఁది కాలము విశ్వసింపరానిది. ఆమె యుద్వేగ మెక్కువాయెను. అంతదూరము వచ్చి శిశువును వదలలేని యాతల్లి ప్రతిమాటను రాణి యంగీకారమే చూపెను. చివఱ కేడాది పోయిన తరువాత రహస్యగోపనమున భద్రము కలుగనిచో నా శిశువు తల్లి యా రాణి యంతఃపురమునకు వచ్చినచో, మొదటిసారి తన

శిశువును మఱలఁ జూడవచ్చు నని యంగీకరించి యనుజ్ఞా పత్రముగా రాణి తనచేతి బాజుబందు నా తల్లి చేతిలోఁ బెట్టెను. అప్పటికిని శిశువు రాణి చేతిలోనికి వచ్చినప్పుడు పది ల్లోకాంతపునగవులు, వంకపాత్రిళ్ళపై ముద్దులు. కాలము దూసిన కత్తితో నిలువఁబడిన రక్షకయోధునివలెఁ దీక్షమూర్తి యగు చుండెను. రాణి శిశువుతో వెనుకకు మఱలెను. బంగారు నాణె ముల సంచి తల్లి చేతిలో బెట్టనేలేదు. మఱలఁ దానే తెచ్చుకొను చుండెను. వెనుకకుఁ దిరిగిపోయి యీయవలెననుకొన్నది. కాని కాలపురుషుఁ డా సంవాదములలోని సత్తువను లాగివేసెను. పరి చారికను బొమ్మనెను. దాని చాచనిచేతిలో భయదేవత తాండ వించెను. ఇంతలో నదీతరంగములమీఁదఁ దొల్లిఁటికన్న నెక్కువ నిశ్చయముగాఁ బడవ పోవుచున్న సవ్వడి వినిపించెను. నావు పైఁడికోసము ప్రతీక్షయే చేయలేదు. వారికిఁ బైఁడిమీఁది యాస లేదు. శీలరక్షణమే ముఖ్యకర్తవ్యముగా నున్నది. అందులో భ్రూణహత్యాదోషము తొలఁగించినది. శిశువు చక్రవర్తి కావచ్చును. రాణికిమనస్సులో నామాతృదేవియందు గొంచెము కరుణ కలిగెను. తత్పూర్వము తల్లికి. బిడ్డకును తుది-చీటి యని చేసికొనిన నిశ్చయము కొంచెము సడలి, రహస్యగోపననీతి జీవి తాంతము భారపడవలసినదిగా తోఁచెను. ఇంతకు నిది మగ శిశువా? ఆడశిశువా? పరిచారిక తడవిచూచినది. ఇద్దఱును మగశిశు వని పోల్చుకొనిరి. వా రిద్దరిచేతులు కలియుటలో నది మగశిశు వన్న దొక మహానందము తమ నీతిపరిపాకము కదలిన కదలికలో వారి ముంజేతులమీఁదఁ దగిలిన గాలికిఁ గొంత వెచ్చదన మప్పుడు పుట్టెను. ఆతల్లి పదునాలుగేండ్ల బాలిక.

ఆ చిన్నిగుండెలో నంత మాతృత్వ మిట్లు భాసించెను? బంగారమునిూఁద మాశలేని యీ రహస్యసంతానానురాగ మెట్టి చిత్రము కలదో? ఆ తల్లికిని, యీ కొడుకునకుఁ గాకుండఁ జేయరాదు. ఈ శిశు వంతిపురము చేరువఱకు నేడ్వకుండ నుండునా? ఆ రాణియెదలోని యూహాపరంపర తీవ్రమై నిస్తబ్ధమయ్యెను. ఆమెపాదములుమాత్రమే నడచుచుండెను. ఆమె చరణాంబుజములక్రింద సన్నపిరాలు గ్రుచ్చుకొనుచుండెనో! అంతకుమున్న దిశాపూర్వభాగమంతయుఁ బడుచున్న తుప్పర చేతఁ దడిసిన నేలయు, రాలును జూప్పనేమో! ఆమె శరీరములోని నరముల కండరముల కదలికయు బహిఃపరిస్థితుల నని గ్రహించు నభిజ్ఞయుగాక యామె చైతన్యభావప్రపంచమున లేదు. ఆమె కొక్కటియే తెలియును. శిశువుతో ముగ్గురు కృతాభిషేకమైన మాతకీదేవి యంతిపురము జేరిరి. మాతకీదేవి కన్నులలో సర్వప్రాణములుగా నెమ్మనములో జీవితసర్వస్వముగాఁ గదలుచున్న చేతులతోఁ బొత్తిళ్ళగుడ్డ లెడలించి శిశువువంకఁ జూచెను. మగశిశువు. శిశువును దెచ్చిన రాణియైన వదినెగారి పాదాబ్జములమీఁద గృతాభిషేకమైన మాతకీదేవి మ్రొక్కరిల్లెను. అంతకుఁబూర్వ మెంత నిశ్శబ్దతయో తదారభ్య అంత సశబ్దత. ఇక్ష్వాకుప్రభువుల యంతిపురమునఁ బట్టమహిషి మాతకీదేవికిఁ బుత్త్రోదయ మైన దన్నమాట గుప్పు మనెను. శిశువును బోరుకాడింపఁ గాచఁబడిన పెళ్ళగంగాళముల క్రింద యగ్నిహోత్రజ్వాలలు పెల్లురేఁగి యంధకారములువిరియించెను. ఈ వార్త పలుచోట్లఁ బహువిధములుగా బ్రసరించెను.

మఱునాఁడు సూర్యోదయ మయ్యెను. కడచిన రాత్రి క్రమ్మిన మొయిళ్ళన్నియు నవి నిజమైన మొయిళ్లు కావు

కాబోలు, ఇక్ష్వాకు చక్రవర్తి శ్రీవాశిష్ఠీపుత్రశాంతిమూల
మహారాజునకుఁ బురుషసంతానము లేదన్న యాంధ్రసామ్రాజ్య
విషాదమేఘములు కానబడియును, ప్రొద్దునసే విచ్చిపోయెను.
ఈవార్త నలుదెసల నలుఁబడి విధములైన యూహలకుఁ జోటి
చ్చెను. ఆఱునెలలనుండి రాణి గర్భవతి యని వదంతి. గర్భవతి
యైన రాణిని జూచినవారు లేరు. చూచిన యొకరిద్దఱు కడ
చిన కొలఁదిదినములలో నవమాసపూర్ణగర్భిణిగా రాణిని
గుర్తుపట్టలేక పోయిరి. ఇది యేదో కైతవప్రక్రియ. ఈయూహ
విజయపురమునఁ జెవులు చెవులుగా నందందుఁ దోఁచినను రాజ
భీతిచేతను, మహారాజసోదరి శాంతిశ్రీదేవియందలి గౌరవాభి
మానములచేతను జనులమెదడులలో నొదిగి యొదిగి లేళ్లై
యయ్యెను. శిశూదయమైన నెలునాఁడు కాదుకదా, పదిదిన
ముల పురుడు వెళ్ళినపిదప శిశువు నెవ్వరును జూడనేలేదు.
చక్రవర్తికిఁగూడ పదునొకండవనాఁడే దర్శనము. చక్రవర్తితన
యగ్రసోదరియైన శాంతిశ్రీదేవిమాట దాఁటలేఁడు. రాజ్యము
మీఁద వాశిష్ఠీపుత్రుఁడు చక్రవర్తి. అంతఃపురములో శాంతిశ్రీ
చక్రవర్తిని. మాఠరీదేవి కృతాభిషేక పట్టపురాణి. అంతే.

మహాసేనాపతి మహాతలవరమహాస్కంధసేనానాయ
కుఁడు చక్రవర్తి యగ్రసోదరియైన శాంతిశ్రీదేవిభర్త. ఆయన
పూగిరాష్ట్రాధిపతి. ఆయన సౌధము శిథిలము కాని యొక్కచో
నొకటైన బౌద్ధవిహారము పక్క నున్నది. శాతవాహనులు
సనాతనధర్మాభిలాషులు కలవారైనను బౌద్ధమతమును బోషించు
చునే వచ్చిరి. విజయపురి పడమటి దిక్కున కృష్ణానది
పాదుకొనియున్న గిరికి నాగార్జునకొండ యని పేరు వచ్చుటకు
శాతవాహను లాచార్యనాగార్జునకు నచ్చట విహారము

నిర్మించి యిచ్చుటయే కారణము. కాని, శాతవాహనుల రాజ్యము శిథిలమై యిక్ష్వాకువంశస్థాపి: శాంతమూలుఁడు బౌద్ధమతమును దండించెను. శాంతమూలుని నాఁడు బౌద్ధభిక్షువు లణఁగఁద్రొక్కబడిరి. విహారములు శిథిలములాయెను. స్థూపములు ధ్వాపితములాయెను. శాంతిశ్రీ బౌద్ధమతాభిమానురాలు. కొందఱామెది బౌద్ధమతమనియే చెప్పుకొందురు. కాని యది పైకి పొక్కని విషయము. తత్సౌధసమీపమునం దున్న యా యొక్క విహారమే శాంతిమూలుని కోపాగ్ని కింధనము కానిది. ఆమె భర్తయైన మహాస్కంధుఁడు సుక్షత్రియుఁడు. చక్రవర్తివలెనే బ్రాహ్మణమతాభిమాని. ఆయింట నానాఁడు మహోత్సవము జరిగెను. మహాస్కంధుఁడు బ్రాహ్మణులకు గోదానములు చేసెను. పసిండినాణెము లొసంగెను. ముత్తయిదువులకుఁ జీరలు పంచిపెట్టెను. శాంతిశ్రీదేవి బౌద్ధభిక్షులకు తన విజయముతోఁ గ్రొత్తవారికి భద్రాకరణము చేయించెను. మఱికొందఱకు బూటబత్తెములిచ్చెను. ఒకరిద్దఱు శ్రమణులకు కావిశాటు లిచ్చెను. ఆ సేనాపతి సౌధమంతయు మహానందతరంగడోలాయమానముగ నుండెను. వీరికి నాఁటి కిద్దఱు పురుషసంతానము. పెద్దవానిపేరు విష్ణుశ్రీ. అతనికిఁ బదియేండ్లు. రెండవవాఁడు స్కందసాగరనాగుఁడు. అతని కేడేండ్లు. మఱల నిప్పటివఱకు సంతానములేదు. ఆ కొడుకు లిద్దఱును ఇక్ష్వాకు రాజవంశయోగ్యవారవాణశిరస్త్రాణభూషితులై సౌధముచుట్టునున్న మహోద్యానమున క్రీడాపర[illegible]లై దూసిన యాకుదూయక, త్రుంచినపూవు త్రుంచక [illegible] చేత లాలింపఁబడుచుండిరి.

చక్రవర్తికంటె, చిన్నది. శాంతిశ్రీ పెద్దది. చక్రవర్తి కప్పటికి నలుబదియేండ్ల వయస్సు. బ్రాహ్మశ్రీ యిరువదియేండ్ల బాలిక. శాంతిశ్రీదేవి చక్రవర్తికంటె రెండేండ్లు మాత్రమే పెద్ద. ఇక్ష్వాకులు చక్రవర్తులై యిప్పటికి నైదేండ్లు కాలేదు. తత్పూర్వము శాతవాహనులకు సామంతులై యుండిరి. శాతవాహన చక్రవర్తి యజ్ఞశ్రీని బాహుబ్రోలి పులమావి రాజ్యమాక్రమించినతరువాత శాతవాహనుల బలము తగ్గినదని తెలిసికొని యిక్ష్వాకు రాజైన శాంతిమూలుండు విజృంభించి తన ప్రతాపముచేత బలహీనుని దండించి చక్రవర్తి యాయెను. శాంతిమూలునకుం దశభావనుజుండియైన ప్రాగీయసంఘునితోను కలదు. మహాతలవరులతో సంబంధముకలదు. పశ్చిమదేశమున వనవాస నగరాధిపతులైన చుటువంశీయులతో సంబంధము కలదు. కదంబులతోం జుట్టరికములుకలవు. ఈ చుట్టరికముల బలముచేతను, తన ప్రతాప శౌర్యధైర్యముచేతను శాంతిమూలుండు నాలుగేండ్ల క్రిందటనే దక్షిణాపథసామ్రాజ్యాధిపతి యాయెను. శాంతిమూలుండు చక్రవర్తి నాకపూర్వమైనచో బ్రాహ్మశ్రీదేవి యీ వివాహ మంగీకృత మయ్యెడిదేమో!

ఈ బ్రాహ్మశ్రీ యింటగూడ మహోత్సవము చెలరేగెను. బ్రాహ్మణుల వేదఘోషము మధురమంగళబంధుర వివాహ విధివిధుల గీతిపరిపంజుల పూరాయెను. ఆ యింట దానముల విరివి కనుపింపలేదు. తోరణముల పచ్చన, తీర్చిన రంగవల్లుల ముగ్గులు, సభాస్థ కవిపండితుల కవితాగోష్ఠి యచ్చటి యుత్సవమేతాదృగాకారమును వహించెను. మహారాజసౌధముల సమీపదేశస్థమై, రాజసౌధముకంటె గమ్యతరమై, బంగారు బొమిడికములతోడి సౌధదేహళీద్వార శేఖరపరిదీపితమై, శ్రీపార్వ

తీరదేశము చూచుచుండెను నానావర్ణములుగల పాలరాళ్ళ శోభయంతయు విరజిమ్ము నొకమహాసౌధము కలదు. అదిమహా సేనాపతి మహాతలవర మహాదండనాయక స్కంధవిశాఖనాగ మహారాజుగారిది. ఈయన చక్రవర్తి యల్లుడు. చక్రవర్తి కుమార్తెపేరుకూడ శాంతిశ్రీయే. చక్రవర్తి సోదరియైన శాంతిశ్రీనుండి యామెను వేఱుగాఁ దెలిసికొనుటకు నడవిశాంతిశ్రీ యందురు. ఈ యడవి శాంతిశ్రీ యన్న పేరు చక్రవర్తిసోదరి శాంతిశ్రీదేవి కొంచెము పరిహాసముగాఁ జేయు ప్రసంగముల వలన వచ్చినది. అడవిశాంతిశ్రీ చక్రవర్తికిఁ జక్రవర్తి కాక మునుపు పుట్టిన బిడ్డ. ఆమెకుఁ బాతికయేండ్ల వయస్సు. ఆమె భర్తను ధనకరాష్ట్రాధిపతియందురు. ఈ ధనకరాష్ట్ర మెచ్చట నున్నదో యెవ్వరికినిఁ దెలియదు. మహాదండనాయకుని హితులు మాత్ర మిది ధాన్యకటక మందురు. వారియెదుట నందరును ముభావము వహించినను మొగము చాటైనంతనే యిట్లందురు. 'ఈ ధాన్యకటక మెచ్చటిది? శాతవాహనులదేనా? ఈయన యజ్ఞశ్రీకుమారుఁడు కాబోలు? అయినచో నాంధ్రసామ్రాజ్య చక్రవర్తియే' అని.

ఈ పరిహాసములకు వారిలో వారే యిట్టిసమాధానము చెప్పుకొందురు. అవును. ఆంధ్రసామ్రాజ్య చక్రవర్తియే. మన మహారాజునకుఁ బురుషసంతానము లేదు. సామ్రాజ్యమునకు దరువాతి యధికారి యీయనయే.'

స్కంధవిశాఖ నాగదండనాయకునకీ యూహ లేక పోలేదు. దండనాయకుడు బౌద్ధమత విరోధి. శాంతిమూలుడును పూర్వశాతవాహనులవలె బౌద్ధులనుకూడఁ బాలించెడివాడే. కాని విశాఖనాగుని బ్రాహ్మణ మతాభిమానము బౌద్ధులను

నిర్మూలించెను. ఈ కారణముచేత రాజసోదరి శాంతిశ్రీదేవికి దండనాయకునకు మనస్సులలోఁ బడదు. పైకి నీయన పోయి యెప్పుడైనను శాంతిశ్రీదేవి దర్శనముచేయుట కలదు. చక్రవర్తికిఁ దన యక్కగారియందలి గౌరవ ప్రేమలచేత విశాఖ నాగుఁ డేమియుఁ జేయలేదు.

ఆ యింట రాజునకుఁ బుత్రోత్పత్తియైన దన్న సంతోషము గోచరించలేదు. తల్లి గర్భవతియైనకాలమున పట్టమహిషి నడవి శాంతిశ్రీయు బోయి చూచుట కైన వీలుకాలేదు. అయినను నింట నుత్సవముమాత్రము జరుగుచునే యుండెను. ఉత్సవపు కళలేదు.

మహారాజసౌధమున వారాంగనల పాదమంజీర ఝళంఝళారవము, తద్వదనచిక్కణ దరహాసనిసితకాంతి సమ్మిశ్రిత తాంబూల నవారుణచ్ఛాయలు తదస్థాగ్ర పతాకాదిహస్త వినమితాంగుళీనఖకాంతికోరకపాటలచ్ఛాయలు, ముఖసాల కోడిమెలయందలి యానకదుందుభిభేరీకాపటహ వాద్యస్వనములు శబ్దమయి ప్రపంచమును జోలపాడి యూలకొట్టించెను.

# ద్వితీయాధ్యాయము

ఆ మఱునాఁడు నామకరణోత్సవము జరిగెను. పే రేమి పెట్టవలయు ననీ? చర్చలలో మాఠరీదేవి భారమంతయుఁ బెద్ద యాఁడుబిడ్డమీఁదఁ బెట్టెను. దండనాయకుఁడు తా నేదియో చెప్పెను. అడవిశాంతిశ్రీ భర్తృసహ మవలంబించెను. వేదాశీర్వాదానంతరముపఱకు నిశ్చయము కాలేదు. శాంతిశ్రీ తన దాక వచ్చువఱకు గుంభనగా నూరకుండెను. చివరకామెనే

యడిగిరి. ఆమె వీరపురుషదత్తుఁడని నామకరణము చేసెను. వెంటనే చక్రవర్తి మహారాజమాఠరీపుత్ర శ్రీ వీరపురుషదత్తుఁడని లిఖించిరి. చక్రవర్తి యంగీకరించినవెంటనే శాంతిశ్రీదేవి ముఖమండలమున శోకవికాసము కనుపించెను? కన్నులలో నొక మెఱుపు తీరినట్లున్నను. కన్నులలోని మెఱుపుతీరిక నెవరు చూచిరి? మాఠరీదేవి గుర్తించెను. తరువాత నేకాంతమున మాఠరీశాంతిదేవులు కలసికొన్నప్పుడు పట్టమహిషి యిట్లనెను. 'వదినే, ఎక్కువకష్టము లేకుండనే సాగినది.' శాంతిశ్రీ: పిల్లవాని మెడలో నున్న భూర్జపత్రముపై నాయకుఁడముచే వ్రాసియుండెను. అట్లు జరుగుటయే న్యాయము కదా! మాఠరి: దత్తశబ్దము సందేహము కలిగించు నను కొన్నాము. శాంతిశ్రీ: మా తాతగారిపేరు చివరకుకూడ దత్తశబ్ద ముండెడిది. మాఠరి: వలసినచో నది చెప్పవచ్చును.

తరువాతఁ జక్రవర్తి కార్తాంతికులఁబిలచి పిల్లవాని జాతకమును జూపించెను. వారు అతఁడు మహాచక్రవర్తి యగు ననియు నతని యేలుబడిలో నిక్ష్వాకు సామ్రాజ్యమార్తాండుఁడు నడిమింట నుండుననియుఁ జెప్పిరి. వారిజోస్యము కొన్నిస్థలముల యందు సందేహానివృత్తి కలిగించెను. ఎచ్చటనుండియో తెచ్చిన బిడ్డకుఁ జక్రవర్తి లక్షణములు పట్టునా? ఆ శిశువు తప్పక మాఠరీదేవిగర్భమే నై యుండవలెను. కార్తాంతికులు మఱియుఁ జెప్పిరి.

పుత్రుని జాతకము ననుసరించి తండ్రిజాతకము మూఁడు పూవు లాఱుకాయలుగా నుండును అని. వీరపురుషదత్తున కైదవయేఁడు వచ్చిననాఁటినుండి 'శాంతిమూలుని విజయపరంపరకుఁ బట్టుకొను కొమ్మ యుండ' దని చెప్పిన ప్రతివిషయము

ప్రజలయందు, సామంతులయందు ప్రతీకారభావమును దల
యెత్తించెను. శాస్త్రాంతికులు చెప్పినట్లునేని యతండు మాఠరీదేవి
పుత్రుండే. పిల్లవానికై దేండ్లువచ్చెను. అనాంటికి శాతవాహనసామ్రా
జ్యమునొక్క ముదల నలుగురు రాజులయందు సూర్యాయమాణ
మాయెను. వీరపురుషదత్తుని తేజస్సుచేతనేమి, పంచాబ్దముల
ప్రాయమునందే వికసించిన సాహసగరిమచేతనేమి యతండెవండో
క్షుద్రస్త్రీగర్భ మను సందేహమును పుట్టినవారల పటా
పంచలుచేసెను. అతనికై దశవర్షము రాగనే శాంతిమూలుండు
అగ్నిష్టోమయాగముచేసెను. వీరపురుషదత్తు నెనిమిదవయేట
నశ్వమేధయాగము చేసెను. అశ్వమేధయాగము చేయునప్పుడు
యయ్యువు వెంట వీరపురుషదత్తునే సంపించెను. కుమారునే
సేనానాయకునిగా నియమించెను. మేధీయాశ్వము అశ్మక
కోసల కళింగ దేశములయందు ననివార్యముగాం దిరిగెను. గర్ధ
బిలుల, ముండుల, తుషారుల, శకయవనుల యెత్తికోళ్ళు
వీరపురుషదత్తునిముందు నిలువలేదు. ఆభీరులు లొంగిపోయిరి.
శకమహాక్షత్రపులు తలలొగ్గిరి. ఆంధ్రభృత్యులు దాసోహ
మనిరి. యువరాజశ్రీ వీరపురుషదత్త విజయసంరంభ విజయ
పురీప్రతిగృహ విజయధ్వాన పరంపరలతో నిండిపోయెను.
శాంతిమూలచక్రవర్తికిం గుమారునియందలి యనురాగము
మిన్నుమన్నుపట్టదాయెను. వీరపురుషదత్తుండు మాఠరీపుత్రుండు.
ఈ శిశువు కొందరనుకొనినట్లు కృతకముగా నంతిపురికిం జేర్పం
బడినవాండైనచో నీ పరాక్రమ మెక్కడిది? ఈ భాగధేయ
మెక్కడిది? కలవింకకోటరమున గండభేరుండము పుట్టదు.
మాఠరీదేవి పుత్రప్రేమ నిరుపమానము. తల్లియందలి పుత్రుని
యనురాగ మన్యతో దుర్లభము. ప్రేమనుండి వచ్చిన ప్రేమ

కానిచో నింతటి శక్తియుండునా? ఒకప్పుడు చక్రవర్తి
కొడుకు నొంత యనుమానపడెను. ఆ సమయమున నాకస్మిక
ముగా కుమారుడు దగ్గరకు వచ్చి కౌఁగలించుకొనెను.
ఆహాహా, పరిష్వంగసుఖము! బహుజన్మపరంపరాదత్త దీప
సముద్భూతదీపికాజ్వాలాసన్నిహిత తేజఃపరమాణుసంయోగము
వలె నున్నది. ఆ మహానందానుభూతిలో సర్వసంశయములు
విచ్ఛిన్నము లాయెను. శాంతిమూలుఁడు ధర్మప్రభువు వీర
పురుషదత్తుఁడు జన్మించకపూర్వము మాతరీదేవికి మఱి సంతా
నము కలుగదని మఱల వివాహమాడు మని పలుమంది చెప్పిరి.
పుత్రసంతానము లేనిచో సామ్రాజ్యము స్కంధశాఖనాగుని
బాహుబలమున నభివృద్ధి పొందుననియు, తా నేకపత్నీవ్రతుఁడ
ననియు, ప్రకృతివర్గమును మన్నించెను. రాజనీతియందుఁ
బరాక్రమమునందు, తేజస్సునందు శాంతిమూలు డెంత
సమీపింపరానివాఁడో ధర్మమునను, బంధుప్రేమయందును
ఆర్ద్రమనస్కతయందు నంత సులభుడు. ఆయన చెవికి తన
కుమారునిగూర్చిన పదివదంతులు వినిపించకపోలేదు. వాని
నాయన ఆదరించనులేదు; ఆదరించకపోనులేదు. క్రమ
క్రమముగ నా మహాచక్రవర్తి మనోవీథినుండి యనుమానము
కాని యా యనుమానము తొలఁగిపోయెను. వీరపురుషదత్తుఁడు
ముమ్మూర్తుల తల్లినిబోలి, తండ్రిబోలి యుండెను. మాతరీదేవి
చక్కనినాసికయు, లలితకపోలములు, చక్రవర్తియొక్క విశాల
నేత్రములు దీర్ఘబాహువులు — వీరపురుషదత్తుని యందు తల్లి
దండ్రుల పోలికలు పట్టియిచ్చుచుండెను. వీరపురుషదత్తుఁ
డడుగు పెట్టినచోటు పండినపంట. అతడు త్రొక్కిననేల దిగ్వి
జయము. అతనికిఁ బదునారేండ్లు వచ్చునాఁటికి సర్వరాజ్య వ్యవ

హారము లతనికిఁ గరతలామలకము లయ్యెను. ఎక్కిన జీను దిగ
కుండ విజయగిరిపరితస్సర్వగిరిప్రాకారము పరిశీలించివచ్చెను.
అతని కంటికెంపుముందు నిలువగలవాఁడు లేడు. మహాదండ
నాయకుఁడు విశాఖస్కంధనాయకునకుకూడ భావమఱఁది
మాట కెదురాడలేఁడు. వీరపురుషదత్తుని తేజస్సుముందు తట్టు
కొని నిలువగలవారిద్దఱే కనుపించిరి. ఒకఁడు చక్రవర్తి. రెండవ
వ్యక్తి మేనత్త శాంతిశ్రీ. శాంతిశ్రీ మాత్రము తట్టుకొని నిల్చు
టయేకాదు. మేనయల్లుని నాజ్ఞమీఁద నడిపింపగల సుకుమార
ప్రౌఢ్యబలము కలిగినదికూడ నయ్యెను. ఏమో తన జన్మరహస్య
మంతయు నామెకే తెలిసినట్లు, ఆమెవలననే తాను చక్రవర్తి
కాబోవునట్లు ఇదమిత్థమని వచియింపరాని యొక కృతజ్ఞతా
భావముచేత నతని హృదయ మతనికి వశముగాక యుండెను.
వీరపురుషదత్తుఁడు పెఱిఁగినకొలఁది శాంతిశ్రీదేవి యాజ్ఞ రేఖ
యతని సర్వశీలమునందు రేఖామూర్తి దాల్చిన నాఁటనుండి
స్కంధవిశాఖనాగునిమెదలో నొకసంశయము పొడచూపెను.
విచారించినచో నా సంశయమునకుఁ దావులేదు. తన భావగా
రన్నచో వీరపురుషదత్తునకు మిక్కిలి గౌరవము, ప్రేమ
తమ్మునిచేత నడవిశాంతిశ్రీ చేయింపరానిది లేనట్లుండును.
మఱలఁ జూచినచో నతనిచేత నెవ్వరును నేదియుఁ జేయింపరాని
దిగానుండును. వీరపురుషదత్తునకుఁ బదునెనిమిదేండ్లు వచ్చినవి.
ఆ నాఁటి కతడు మధ్యాహ్నమార్తాండునివలె నుండెను. కాని
యతనికి వివాహము కాలేదు. వివాహమున కేమి? మేనత్త
కూతుండ్రే యిద్దఱున్నారు. కాని, పరమరహస్య విషయము.
రహస్యములయొక్క సూక్ష్మరజ్జువులు రహస్యములుగానే యుండి

స్థూలమైన యీ రహస్యము పలుమందినోట నానును. అది యెట్లు పొక్కెనో భగవంతునికే తెలియవలసిన విషయము.

ఈ పురుషదత్తుని మాతృదేవి పుత్రుడు కాఁడు. ఒకరాత్రి వేళ నాగార్జునకొండసమీపమున కొకానొక స్త్రీ యే కులముదో తెలియదు. ఆరాత్రి తాను కన్న శిశువును కృష్ణానదిమీఁద బడవపైనచ్చి రాజాంతఃపురమున విడిచిపోయినది యని యొకశాఖ. శాంతిశ్రీ తెచ్చిన దని యొకశాఖ. శాంతిశ్రీ భర్త మహాస్కంధుని తంత్ర మని మఱియొకశాఖ. చక్రవర్తియే దీని కారకు డని మఱియొకశాఖ. ఈ భేదము లెట్లున్నను ప్రధాన విషయమునందు భేదములేదు.

ఈవార్త పారంపరిగా దేశమునం దుండనే యుండెను. ఆ విశ్వాసములోని గాఢత్వము వీరపురుషదత్తుని మాతృశ్రీ శాంతిపుణ్యాలుల పోషకచేతగాని, ఆయనపరాక్రమాదిగుణముల చేతగాని, చక్రవర్తిలక్షణములచేతఁగాని కొంచమైన సడల లేదు. ఆయనకు సుక్షత్రియుల కుటుంబములవా రెవ్వరు పిల్ల నిచ్చుటకు నంగీకరించలేదు. అతని తల్లి యే కులముదో తెలియదు. అతఁ డే కులస్థుడో వివాద్యమైన యంశమైనది. ఇది యిట్లుండఁగా మహారాజసోదరి శాంతిశ్రీదేవికి పదునేనేండ్ల కూఁతురున్నది. స్కంధసాగరనాగుడు పుట్టినతరువాత పది యేండ్లకు శాంతిశ్రీదేవి మఱల గర్భవతియై యొకకూఁతురుగ గనెను. ఆమె పేరును శాంతిశ్రీయే. మఱియు బ్రాహ్మశ్రీ దేవికి యిద్దఱు కూఁతుండ్రు కలరు. పెద్దయామె పేరు బాపిశ్రీ. రెండవయామె పేరు షష్ఠిశ్రీ. శాంతిశ్రీ తనకూఁతురు మేనయల్లుని పెండ్లి చేసికొమ్మన్నది. ఆమె బౌద్ధమతస్థురాలు. ఆమెకు వర్ణవివక్ష లేదు. అక్కగారిబలవంతమువలన బ్రాహ్మశ్రీ

తన పెద్దకూఁతురు బాపిశ్రీని మేనయల్లున కిచ్చెను. ఆమె భర్తృ కంగీకారములేదు. కాని, యీ వివాహమున మొదటినుండి చక్రవర్తి యనురాగము లేని తన సంసారమునెడఁ జక్రవర్తికి నభిమానము కగునని యర్ధాంగీకారము సహించెను. వీర పురుషదత్తునకు నిద్దఱు మేనత్తకూతుండ్రయందును ప్రేమ కలదు. తండ్రివలె తానేకస్త్రీగతబుద్ధి కాఁడు. ఈయిద్దఱు మేనత్త కూతుండ్రయందును, దనకుఁ గల ప్రేమ విజయపురమందఱు నెఱుఁగుదురు. ఆ తండ్రికొడుకులకుఁ గాదనుటకు విరోధమొక పంగు తర్కము బయలుదేరెను.

చిన్ననాఁటినుండి వీరపురుషదత్తుఁడు శాంతిశ్రీకి గారాబు మేనల్లుఁడు. ఆమె తన మేనల్లుని చెవిలో బౌద్ధ మతమును విచ్చలును నూరిపోసెను. భదంతానందాచార్యులు బౌద్ధాచార్యుఁడు. అతఁడు బౌద్ధసూత్రనిర్ణయాది నానాశాస్త్ర పరిజ్ఞాత. ఆయనను కొందఱు సింహళీయుఁడని, మఱికొందఱు మాళవీయుఁడనియందురు. ఆయన యప్పుడప్పుడు విజయపురము వచ్చుటకలదు. వచ్చినపుడు శాంతిశ్రీదేవి యింట భిక్ష. అతఁడు మాధ్యమికుఁడు. ఆంధ్రదేశమునం దెచ్చటనైన మాధ్యమిక బౌద్ధమే ప్రబలియుండెను. ఈ మాధ్యమికబౌద్ధములోఁగూడ నాంధ్రుల సంప్రదాయము కలదు. ఈ సంప్రదాయము లన్నియుఁ దర్వాత తర్వాత విజృంభించెను. ఈ భదంతుఁడాంధ్ర దేశమునఁ దర్వాత చెలరేగిన మహాసాంఘికాంధకబౌద్ధమతము నకుఁ బునాదివేసిన యాచార్యుఁడు. శాంతిశ్రీ నాఁటికి నలువది యేండ్ల స్త్రీ; చక్రవర్తికి నలువదియేండ్లు. కొడుకునకుఁబట్టాభి షేకముచేసి చక్రవర్తి వానప్రస్థుండగునని యందందు వినఁబడు చుండెను.

వీరపురుషదత్తునిది బ్రాహ్మపట్టు. సుక్షత్రియుఁడైన మఱి యొక రాజకూఁతురు పెండ్లియాడవలె; తర్వాత తన మేనత్త కూఁతుండ్రను. కదంబులు సుక్షత్రియులు. ఆ రాజకూఁతును శాంతిమూలుఁడు తన కొడుకునకై యడిగెను. కదంబులు మానవ్యసగోత్రులు. ఇక్ష్వాకులు హారితసగోత్రులు. వారికి వీరికి నిచ్చిపుచ్చుకొనుట లున్నవి. కాని యీ సందర్భమున కదంబరాజు తనకూఁతును వీరపురుషదత్తున కిత్తునన లేదు. ఆమె పేరు భట్టిదేవి. కదంబులు బ్రాహ్మణ సంప్రదాయమునకు మునిఁగితేలినవారు. వారు మేము క్షత్రియులమే కాదు, బ్రాహ్మణుల మందురు. ఇక్ష్వాకులునట్లే యందురు. ఇక్ష్వాకుల ఋషులు అంగీరసాంబరీషయౌవనాశ్వులు. ఈ ఋషిత్రయము కల హారితసగోత్రులు బ్రాహ్మణులు కలరు; కాని యిక్ష్వాకులు క్షత్రియులే. శాతవాహనచక్రవర్తులు బ్రాహ్మణులగుటచేత శ్రీపార్వతీయులు కదంబులు మొదలైనవారు తాముకూడ బ్రాహ్మణులమని చెప్పుకొన్నచో గౌరవమని వారి యుద్దేశ్యము.

కదంబరాజదుహిత భట్టిదేవి విద్యావతి. బ్రాహ్మశ్రీ యంత యందకత్తె. ఆమెకును వీరపురుషదత్తుని చేసికొనుట కిష్టములేనట్లు తెలిసినది. దానితో వీరపురుషదత్తుని కోపాగ్ని ప్రబలినది. ధనుర్విద్యాపారంగతుఁడు, వ్యూహనిర్మాణనిపుణుఁడు, ఆజానుబాహుఁడు, గాఢోరస్కుఁడు, వృషస్కంధుడు, వీరపురుషదత్తుఁడు తండ్రికిఁగూడఁ జెప్పకుండ కదంబులపై దాడివెడలెను. కదంబుల సేనావాహిని వీరపురుషదత్త మహాపర్వతమునకుఁ దాఁకి వేయిపాయ లాయెను. కదంబులు సంధిచేసికొనిరి. వీరపురుషదత్తుఁడు భట్టిదేవితో విజయపురము వేంచేసెను. ప్రజాహృదయములయందు దానితో వీరపురుషదత్తునియెడనభిమానము

పెరిగెను. వీరపురుషదత్తుఁ డన్యాయము చేయలేడు. భట్టిదేవిని ప్రథమభార్యగా స్వీకరించెను. తాను చక్రవర్తియైనచో భట్టిదేవియే పట్టమహిషి యగును. ఆమెయందుఁ గలిగిన ప్రథమ పురుషసంతానమే భవిష్యదిక్ష్వాకుచక్రవర్తి కాగలఁడు.

భట్టిదేవికి భర్తయందు ప్రేమకలదో! ప్రథమ సమాగమమునాఁటిరాత్రి భార్యాభర్త లిరువురును గలిసిరి. ఆమె తన్ను భర్త యధిక్షేపించు ననుకొనెను. అధిక్షేపించినచో తాను గత్తి నూడఁబెకొని సిద్ధముగా నుండెను. ఆమెలోని రాచనెత్తురు బిందుబిందువున నుడుకుచుండెను. శరీర బలముచేత, సేనాబలముచేతఁ దెచ్చినాఁడు. హృదయము నెట్లు వశపఱచుకొనగలఁడు? కించిదగ్నిస్పర్శచేత మండుట కభిముఖముగానున్న యగ్నిద్రవ్యమువలె నామె క్రోధమూర్తియై నిలుచుండెను. సర్వాలంకారభూషితయై యప్పుడే పాలకడలినుండి వెలికివచ్చిన యచ్చరవలె నిలుచున్న యామెను జూచినంతనే వీరపురుషదత్తుని మనోభావ మంతయు విపరిణామ మందెను. సుకుమారచాటువాక్యతత్పరుఁడైన వీరపురుషదత్తుని ముందు భట్టిదేవి నిరాయుధురాలాయెను. ఆమె యుద్వేగ ప్రకృతి. ఉద్వేగ ప్రకృతులు మనోవీథులయం దొకదారి నడతురు. ఆమార్గమున వారు నిశితవ్యగ్రులై యుందురు. వారిని మఱియొక మార్గమున నెదుర్కొన్నచో వారు వెంటనే నిస్సహాయు లగుదురు. వారు మనసా సిద్ధపడివచ్చిన వాదమార్గాభిముఖ్యము, బ్రహ్మదేవునకును జేసేపాతాత్పర్యము కాదు. వేఱుమార్గమునందు వారి నెదుర్కొన్నచో వారు మఱల దాని కాయత్తపడుటకుఁ గాలము పట్టును. శత్రువు వేగరియైనచో దత్కాలమున వారిపై విజయము సాధింపవచ్చును. ఆనాఁడు వీరపురుషదత్తుఁడు భట్టిదేవి

మీఁద విజయ మట్లు సాధించెను. ఆమె తానేమి చేయుచున్నదో తాను మెఱుఁగదు. లాలనలు, చాటూక్తులు, బతిమాలుటలు, పరిహాసించుకొనుటలు, వేగారింపులు; హఠాచ్చుంబనములు ప్రార్థనాపరిదీనమధురోక్తులు - ఆమె భర్తను లొంగిపోయెను. మఱునాఁడుకాని యామె తన్నుదానెఱుఁగలేదు. ఎఱిగినతరువాత వీరపురుషదత్తునియందామె మమతలఁగరిగినరాలాయెను. వీరపురుష దత్తునకు తొలిరాత్రిమాత్రమే సుఖహేతువాయెను. ఆరాత్రిరో భట్టిదేవి గర్భవతి యయ్యెనని తరువాత రెండు నెలలకుఁ దెలిసెను. భట్టిదేవికి సీమంతోత్సవము మహావైభవముతో జరిగెను. వీరపురుషదత్తునకుమాత్రము సౌఖ్యములేదు. అతనిని కనుపుకన్నతల్లియందలి గౌరవవిశేషముచేత నతని కాముకత యతనికోపాదుల నడుపులోఁబెట్టెను. అతఁడు స్త్రీదాసుఁడు. ఈ భార్యాభర్తల నడుమనున్న యీసంబంధము వారిద్దరికిమాత్రమే తెలియును. సీమంతోత్సవమునాఁడు యువరాజు మేనత్త శాంతిశ్రీ యింటికిపోయెను. మేనత్త యింటిలో లేదు. మేనత్త కూఁతురు శాంతిశ్రీయుండెను. రాజవంశములుకనుక సన్నిహితబంధువులైనను స్త్రీ పురుషుల కలయిక యంత స్వైరము కాదు. కాని శాంతిశ్రీ వీరపురుషదత్తుల సమాగమమునకు మహాస్కంధుడు గాని శాంతిశ్రీదేవిగాని యెప్పుడు తమ కూఁతు నొద్దికలలో పెట్టలేదు. శాంతిశ్రీ 'బావా' యనుచు నెదురువచ్చెను. అతని ముఖమున విషాదరేఖ తోఁచెను. శాంతిశ్రీ సహజయువతీహృదయ సౌకుమార్యముతో బావను పరామర్శించెను, లాలించెను. ఉపచరించెను. అతని విందురాచగుండె మేనత్తకూఁతురి హస్తస్పర్శచేత, మోహనాపాంగరేఖాసమ్మార్జనముచేత లాలనామృదూక్తులచేత నప్పటిబిగువు సడలి శాంతిశ్రీ స్పృహ

గాంసభాగమున వాలి దుఃఖించెను. ఆ వాలికలో సమోదరపరి
ష్వంగము జరిగెను. ఆ పరిష్వంగమునం దాదరభావము క్రమ
ముగా నొత్తిగిల్లి శృంగారభావమే తలచూపెను. అనియే విధి
విధించిన సుముహూర్తమైనట్లు వారిరువురు భార్యాభర్తలైరి.
శాంతిశ్రీ తరువాత కణ్వనివలె నా వివాహ మంగీకరించెను.
మహాస్కంధుఁడు సంతోషించెను. వారముదినములలో వివాహ
మతివైభవముతో జరిగెను. కాని విజయపురమెల్ల వివిరొక
విడ్డూరముగాఁ జెప్పుకొనిరి. ప్రథమబాల్య సీమంతోత్సవము
మొన్ననా! ఈ వివాహము నేఁడా? పరిచారికాముఖములు
వివృతములై సహాస్య మొందంబు నాము వేసెను. అహాహో! వీర
పురుషవర్తుని జీవితము! ప్రజాహృదయక్షేత్రముల పునఃపున
రారూఢసంశయాంకురములు అతని పరాక్రమాతిశయము
చేత, గుణప్రాశస్త్యముచేత పునఃపునర్నికృత్త శేఖరములు. బల
వంతముగాఁ దెచ్చిన సుక్షత్రియాణి సందిగ్ధజన్ముఁడైనయితనితో
సంసారము చేయునా? యని యందందు వినిపింపఁ జొచ్చెను.
శాంతిశ్రీతోడి సంసారమొక నెలపాటు ప్రీతివిశేషప్రత్యగ్రముగా
నుండెను. కాని భట్టిదేవి సౌందర్యమునకు శాంతిశ్రీ సౌంద
ర్యమునకుఁ బోలికయెక్కడ? పోలిక తెచ్చుకొన్నను, పెచ్చుతూఁగి
నను బాపిశ్రీ. బాపిశ్రీకి తనపెదతల్లి కూతునదృష్టము లోభకారి
యయ్యెను. యువరాజు తమ యింటి కెప్పుడో చెమరుగాఁగాఁ
రాఁడు. బావకుఁ దనయందు [illegible] ప్రేమకల్గదు. తనకుఁగూడఁ
గలదని బావకుఁ దెలియునో తెలియదో! పరమోన్నతుఁడైన
తన తండ్రి బావకుఁ దన్నిచ్చునో యిచ్చునో? పిల్లమీఁదఁబిల్ల
నిచ్చుటయన్న దోష మిక్ష్వాకులకే పోయినది. చక్రవర్తుల విష
యములో నీ పట్టింపు లేదు. చక్రవర్తి [illegible]ఁడైనను

యువరాజపదవాదశాస్త్రముగాఁ బరిణమించెను. విస్పష్టబౌద్ధపక్షపాతబుద్ధియైన బావతోడఁ దనకుసంబంధము తనతండ్రి యంగీకరించునని తోఁచదు. తాను సాహసించి పెదతల్లిగారియింటికిఁ బోయి బావ నొకటి రెండుసార్లు కలసికొనవలెను. ఇదివఱకుఁ బోవుచుండెనుగదా ? వచ్చుచుండెనుగదా ? అప్పుడు తల్లిదండ్రులు కోపపడిరా? మనస్సులోని యనుమానమువలనఁ దాను పెదతల్లియింటికిఁ బోయినచో నెందుకుఁబోయితివని తల్లిదండ్రులు కోపింతురని యామెకు భయమయ్యెను. ఇది యిట్లుండెను.

భట్టదేవి భర్త రెండవవివాహము చేసికొనెనన్న నాఁటినుండి భర్తృవిషయముఁ బట్టించుకోనితన మెక్కువయాయెను. ఆమెకు నామెలోఁ బదివికారములు. ఈర్ష్య, కోపము, నిరాదరణ, పోనిమ్మనుట, యిదియు నొక మేలేయనుట, ఆమె తనకన్న నందకత్తెయా యనుకొనుట, తన కీ విషయమునఁ బ్రసక్తియేమి యున్నదనుకొనుట !

# తృతీయాధ్యాయము

కలియుగము ప్రవేశించిన తరువాత (16274) పదునాఱువేల రెండువందల డెబ్బదినాలవ సంవత్సరము శాలివాహన శకము (275) రెండువందల డెబ్బదియైదవ సంవత్సరము. వీరపురుషదత్తుని కిరువది రెండవ సంవత్సరము. శాంతిమూల చక్రవర్తి మహావ్యాధిగ్రస్తుఁ డయ్యెను. ఆయన జీవితమంతయు యుద్ధములతో సరిపోయెను. మహాతలారిపు లొకవంక, కదంబులొకవంక. బంధువులతోఁగూడ యుద్ధములుచేయవలసివచ్చెను. చక్రవర్తిత్వపదము సంపాదించుటయనఁగా నట్టిది.

ఆ చక్రవర్తి యెక్కినగుఱ్ఱము దిగకుండ నెన్నివందల యోజనములు స్వారీచేసెనో! దినదిన ఉషోరేఖలు జాజిపువ్వు కేసరముల వెలుఁగు లందము చిందావేళ లేచి చేసిన నిత్యవ్యాయామము, సేనాముఖములయందుఁ బ్రదర్శింపవలసివచ్చిన ప్రయోగింపవలసివచ్చిన శరీరబలము, ఇవి యన్నియు యౌవనవేళ బలపరాక్రమము లెంత విజృంభించినను, నరముల పటుత్వము తప్పినవార్ధకమున నరములు మఱింత సడలుటకే యుపయోగించును. నిద్రాహారములు లేక తాను నిర్మించిన మహాసామ్రాజ్యము నలుమూలల లేశలేశము అల్పాల్పములైన సర్వవిషయములుఁ దానొక్కఁడే చూచుకొనుటచేత, నా మహారాజఱువది యేఁడ్లకే విశ్లథాంగుఁడాయెను. పంటిబిగువుమీఁద మఱిపది యేండ్లునిలచెడివాఁడేమో! కానికుమారునియందున్న ప్రత్యయము చక్రవర్తి మనస్సునకుఁ దీరిక కలిగించెను. మనస్సునఁ గలిగిన యా ముడివిప్పు శరీరమునకు వ్యాపించి చక్రవర్తిలో మనోబలముచేత నిలువద్రొక్కికొను శరీరపటుత్వభావముకూడఁ దగ్గెను. చక్రవర్తి సామంతులను, కుమారుని బిలిపించి కుమారునితో నిట్లు చెప్పెను.

"నాయనా! శాతవాహనుల సామ్రాజ్యము నేను వారికి సామంతుడనై యుండియు దొంగిలించితిని. నేను కృతఘ్నుఁడనేమో! నే నా పని జేయకపోయినచో, నా సమకాలికులలో మఱియొకఁడు చేయఁగలవాఁడు లేఁడు. నేనువారియందలికృతజ్ఞత చేత సామ్రాజ్యనిర్మాణము చేయలేదనుము. ఈయాంధ్రదేశము ఖండఖండములై పోయెడిది. నోరు తెఱచి కూర్చున్న పులివలె శాత్రవులు ప్రతినిమేషలంఘనతాత్పర్యబుద్ధులై యున్నారు. మనము శ్రీపార్వతీయులము. ధాన్యకటక ప్రాంతసామంతులు

ఆంధ్రభృత్యులు, ఎవరో రొకరు సామ్రాజ్యపునఃప్రతిష్ఠచేయ
నిచోఁ దెలుఁగుగడ్డ శకయవనాదుల యలజడికి నుపవడికలిగించె
డిది. ఆ పని నేను జేసితిని. చంద్రకళాజూటుఁ డపని నాచేఁ
జేయించెను. లౌకికము వేఱు, పారలౌకికము వేఱు. లౌకికముగా
నేను జేసిన పని మంచిది. స్వదేశము శకయవనాదుల దాడు
లకుఁ జూఱవదలలేదు. స్వస్థానవేషభాషామతములు నిలబెట్టుట
స్వర్గసుఖముకన్న గొప్పది. లక్ష కృత్రిమసిద్ధాంతములకన్న
గొప్పది. జీవుఁడు, జీవలక్షణము, సంసారము, బ్రతుకు ఈమహా
విషయముల సమాధానవిచారణచ్చేతఁగాని స్వస్థానమర్యాద
తెలియదు. నీవు నేను సర్వవిద్యలు నేర్పించితివి. శ్రుతిస్మృతుల
లోని సర్వార్థములు నీకుఁ జెప్పించితివి. లోకములో నెవ్వరికిని
శాస్త్రసిద్ధాంతవిషయముల నెక్కువ భేదముండదు. సమన్వయ
పఱచుటలోనే కష్టము. లోకమంతయు నాచరణభిన్నము. నేను
పారలౌకికముగాఁ జూచినచో శాతవాహనచక్రవర్తులయందు
కృతజ్ఞుఁడను. వారిది సనాతనధర్మము. కడచిన మూఁడుయుగ
ములనాఁటి ధర్మము భరతశంతనుపాండురాజపరీక్షిజ్జనపాలుర
ధర్మము. వారిది చంద్రవంశము. మనది సూర్యవంశము. సూర్య
వంశరాజులు త్రేతాయుగమునందు, చంద్రవంశరాజులు ద్వాప
రమునందు చక్రవర్తులై భరతఖండము పాలించిరి. ఇక్ష్వాకుఁడు
త్రేతాయుగపుచక్రవర్తి. సూర్యభగవానుని మనుమఁడు.
మనువుయొక్క కుమారుఁడు. ఆయన శతపుత్రకుఁడు. ఆవంద
మందిలో నలుబది యెనమండుగురు దక్షిణాపథమునకు వచ్చి
రాజ్యములుస్థాపించిరి. ఆనలుబది యెనమండ్రలో మనది యొక
శాఖ. తక్కిన శాఖ లనంతకాలాంతర్హితము లయ్యెను. కలి
యుగము క్షత్రియులకు రాజ్యలాభకారి కాదు. ఏ కృతయుగ

రేఖ నిత్యమహాకాలలిప్త సహస్రపరివర్తనములలో నీ నాఁడు మనలెనో ఐక్ష్వాకులకు మనకు సామ్రాజ్య నిర్మాణము చేకూరెను. నాతండ్రితాతలు, నేను శాతవాహనులకు సామంతులము. నేను నాతండ్రితో చిన్ననాఁడనుచుండెడివాఁడను. "మనము క్షత్రియులము. ధారణి క్షత్రియులది. శాతవాహనులు బ్రాహ్మణులు. వారిక్రింద మనము సామంతులుగా నుండుటయేమి?' అని. మానాయన యిట్లనుచుండెడివాడు. 'తండ్రీ! అట్లుకాదయ్యా! ఈ యుగము క్షత్రియులదికాదు. శాతవాహనులక్రింద మనము సామంతులముగానే యుండవలెను. ఉండి శాతవాహనులబుద్ధి పెడత్రోవ పట్టకుండ జూడవలెను. బ్రాహ్మణులు కాలమూర్తులు. క్షత్రియులు ధర్మమూర్తులు. కాలముచేత బ్రాహ్మణులాస్తికులగుదురు; నాస్తికులగుదురు.

'స నాస్తికానాం వచనం బ్రవీమ్యహం
న నాస్తికోఽహం నచ నాస్తి కించన
సమీక్ష్య కాలం పున రాస్తికోఽభవం
భవేయ కాలే పున రేవ నాస్తికః'

ఇది జాబాలి శ్రీరామచంద్రునితోఁ జెప్పిన మాట. బ్రాహ్మణుఁడు కాలవాహినివెంట నాస్తికుఁడు నగును. అందుచేత మేము శాతవాహనులమీఁద నదుపుగా నున్నాము. నీవు వేదధర్మము నుజ్జగింపకుము. వేదధర్మము సనాతనము. ఆ ధర్మమితరధర్మములచేత భిన్నకాలములయందు నిరాదరింపఁబడినను మఱల మఱలఁ దానే ప్రతిష్ఠిత మగును. రాజు ధర్మస్వరూపుఁ డయినచోఁ జంద్రశేఖరునికరుణ సంపూర్ణముగా గడించుకొన్నచో నతని హృదయమునుండి ధర్మము

సంపూర్ణముగా విశ్లథము కాదు. ధర్మము ధర్మ మని వేయి నోళ్ళ విందుము. భిన్నకాలములందు భిన్నవిషయములు ధర్మశబ్దవాచ్యము లగును. వేదధర్మమే ధర్మము. అన్య మౌపచారికము. ధర్మశబ్దము వేదములోఁ బుట్టినది. దానియర్థము వేదములోనే యున్నది. వేదమతమునుండి పుట్టిన యన్యమతములు వేదమునందలి బహుశబ్దజాలమువలె నీ శబ్దమును బరిగ్రహింపవచ్చును. కాని యోగరూఢులచేత వేదధర్మమే వేదధర్మము. త్రేతాయుగపు రాజులలో నిక్ష్వాకువంశములోఁ గొందరు వైష్ణవులు, కొందరు శాక్తేయులు, కొందరు శైవులు. రఘువంశము శైవసంబంధము. శ్రీరామచంద్రుఁడు నారాయణావతారమే కాని శివభక్తుఁడు. మనది యాపరంపర. మనము చంద్రశేఖర సదార్చకులము. నేఁ డాంధ్రసామ్రాజ్యమంతయు శివభక్తితో నిండి వెలయుచున్నది. నీవు శాంతిమూలుని కడుపునఁ బుట్టినచో నీసనాతనధర్మమును బరిత్యజింపకుము. పరమేశ్వరుఁడైన గంగాజటాజూటుని పాదాంబుజార్చన పరిత్యజింపకుము' అని చెప్పెను. తక్కిన సామంతులతో, దండనాయకులతో, మంత్రులతోఁ జెప్పవలసినవన్నియుఁ జెప్పి తన మేనఁ బ్రాణము లుండగనే కుమారునకు బట్టాభిషేకము చేయవలయు నని చెప్పెను.

అది కార్తిక మాసము. శరత్కాలము సమాసన్నమాయెను. బుద్ధదేవుని పటాంచలమువలె తెల్లని మొగిలొకటిఁ డాగ్నేయ దిశాకాశమున లంబమాన హంసీగరుత్సదృశమై సీతై రావణకర్ణ శూర్పచాలన వైఖరి, బోధివృక్షమ్ము పారుటాకువలెఁ దళతళలాడెను. కృష్ణాతటిని యొడ్డున కొంచెము మెఱుపు విరిగి రాళ్ళమీఁద పేరుకొనినట్టి యెఱ్ఱని రొండుమట్టి

పూర్వసంస్పర్శ వదలలేని పలుచని కావినీళ్ళను జూచి యొడ్డున వికసించిన కాశపుష్పము పకాలున నవ్వెను. కుమారస్వామి యీకాశవనమునఁ బుట్టెనఁట. కృత్తికాతల్లులఁట. చక్రవర్తులార్యులని చెప్పుటకేమో! ఎనని కాలమున వాఁడు మొన్న గాఁడు. కాలమున్నంతవరకుఁ జక్రవర్తిత్వమునకు సప్తమత్వము పట్టించనీలు లేకపోయినను, వానికిఁ దానా సప్తముఁడ నని యెవరనుకొనరాదు? వాని మోచేతినీళ్ళుతాగిన యేకవి కల్పన చేయరాదు? తొలినాటి యాంధ్రశాతవాహనులకే లేని యీ సప్తమత్వ మిక్ష్వాకులకుఁ బట్టునా యన్నట్లు కాశపుష్పము పరిహాసించెనో! నివ్వెఱపోయి చూచెనో!

విజయపురికిఁ బశ్చిమదిశయందు నాగార్జునకొండ యుండెను. ఉత్తరదిశయందు వేఱొక పర్వతము పశ్చిమమును వ్యాపించియుండెను. దానిపశ్చిమపుచివర కృష్ణానదిలోనికిఁ జొచ్చికొన్నది. ఈ రెండుపర్వతముల నడుమఁ గృష్ణానదికి దారితీయు లోయ యున్నది. ఆ లోయయందు దుర్గకుడ్యము నిర్మించఁబడి రక్షకభటులచేత రక్షింపఁబడి యున్నది. ఆకుడ్యము శత్రుసైన్యము నరికట్టుట కుపయోగించునే కాని గోడపైనుండి వచ్చు వాయుతరంగముల కేమి యడ్డుపెట్టును? రాజహితులైన లౌకికుల హృదయములందు నిగూఢములై యున్న మనోభావములను దా నెట్లడగించును? ఈ మనోభావములు, ఈ వాయుతరంగములు రావలయునన్నచో నీ లోయయొద్ద నున్న గోడదూకి రావలయు నేమి? రాజమార్గముననే వచ్చును. ఆ వచ్చెడి భావములకు సింహద్వారమే తెఱువఁబడి స్వాగతము లర్పింపఁబడును. నిజమునకు నవి క్రొత్తగా రావలయునా? అది పఱికే విజయపురమున నున్నవి. అవియే విస్తరించిన జాలును.

శ్రీ వీరపురుషదత్తుని పట్టాభిషేకము జరిగెను. పట్టాభిషేకసమయమున విజయపురప్రదేశమే కాక నాలుగు పర్వతముల నడుమ నున్న సర్వభూభాగము సితచ్ఛత్రములతో, జాంబూనదమకుటములతో, సర్వసామంతరాజపరిచారికల నిండు బెడఁదలమీఁది తొలఁగిన రౌప్యమ్యాగపు పమ్మెదలతో, వారి దండలయందు వైశాశీరయికలకుఁ జేతియంచులుగాఁ గుట్టబడ్డ ముత్యాలరత్నాంశుకాంతులకు సూర్యకిరణజాలము పెట్టిన చక్కిలిగింతలతోఁ బ్రకాశించెను. ఆజానేయముల ముంగాళ్లఁ గట్టిన మువ్వలమ్రోఁత, భద్రగజమ్ములపైని బిగించిన రత్నకంబళములక్రింద వ్రేలాడుచున్న గంటలరవళి, వెండిబెత్తముల వారి బెత్తముల పైభాగమందు వ్రేలాడుచున్న బంగరు గంటల సవ్వడి, వారాంగనామధురకూజితములతో సయ్యాటలాడి వియ్యములు పొందెను. త్రికూటాధిపతి యాభీరరాజు వచ్చెను. కదంబధాత్రీశుఁడు ధర్మమహారాజాధిరాజు వచ్చెను. ఉజ్జయినీపతి శకమహాక్షాత్రపుడు విచ్చేసెను. తన మేనయత్త భర్త పూగీయరాష్ట్రాధిపతి మహాస్కంధవర్మ. తాను బోయి సామంతులు గుడారములు వేసినచోట వేఱొక గుడారము వేసికొని యుండెను. తన బావమఱఁది మహాదండనాయకుఁడైన స్కంధవిశాఖనాగుఁడుఁ గూడ సాటి సామంతులలో వేఱొక శిబిరము నన్ని మర్యాదామాధుర్యము వెల్లడించెను. పట్టాభిషేక మతికోలాహలముగా జరిగెను. సర్వపుణ్యనదీనీరములఁ గలశములతోఁ దెచ్చి యగ్న్యాహితులైన బ్రాహ్మణులు వీరపురుషదత్తునకు మహాభిషేకము గావించిరి. ఈమహోత్సవములో శాంతిమూలుఁడు కనిపింపలేదు. ఆయన వ్యాధిగ్రస్తుఁడై యంతఃపురాంతరమం దుండెను. పట్టాభిషేకహోమములు తత్సంబం

స్వస్తికర్మలు సర్వము ముగిసిన తరువాత నొక విచిత్రము జరిగెను. భదంతాచార్యానందుని వెంటఁబెట్టుకొని శాంతిశ్రీదేవి పట్టాభిషేక మండపమునకు వచ్చెను. అందరు మొగ మొగములు చూచుకొనిరి. ఇక్ష్వాకుల కర్మకాండలో నంతవఱకు బౌద్ధాచార్యులు వచ్చినదిలేదు. శాంతిమూల చక్రవర్తి వ్యాధిగ్రస్తుడై పడియుండెను. అతని కంటి కెంపుచేత బౌద్ధాచార్యుని తెల్లని దుస్తులు రక్తమయమై యుండెడివేమో! వీరపురుషదత్తుఁడు శాంతిశ్రీ యెంతచెప్పిన నంత. స్కంధవిశాఖనాగుని కంటికొనల క్రేవలు తెట్టెలుకట్టెను. వీరపురుషదత్తుని లోచనాంతరములనుండి బాష్పకదంబములు బయలుదేరి యా తెట్టెలు విరిసిపోయెను. భదంతుఁడు నుత్తమహంసయానుఁడై సింహాసనము కడకువచ్చి "భగవాన్ దేవ మనుష సత హిత సుఖముగ దేశిక సజితకామక్రోధభయహారిన తరిస మోహాదోస సదాపిత మాగ బల దప మానస సమన కరస దాసబల బహాబలస అథంగ మాగ ధమచక పవతకస చకలఖన సుకుమార సుజాత చరణాస తరుణ దినసకరపభాస సగద శశి సోమ దనికనస సవలోక చితమ హితస బుద్ధస నమోనమో" అని చేయియెత్తి యాశీర్వదించెను. సభలోఁ గాదనుటకు వౌ ననుటకు వీలులేకపోయెను. సామంతులెల్లరు తలలువాల్చుకొనిరి. మహాతలాత్రపు డొక్కఁడే నవ్వెను. మహాతలాత్రపుఁ డిక్ష్వాకులకు సామంతుఁడుగాఁడు.

అంత నప్పటికే సర్వపట్టాభిషేకకర్మయుఁ బూర్తియగుట చేత నెవరిదారిని వారు పోయిరి. మంచముమీఁద పడియున్న శాంతిమూలుని కీవార్త చెప్పిరి. ఆయన నివ్వెఱపోయిచూచెను. వృద్ధచక్రవర్తి సోదరియైన శాంతిశ్రీకిఁ గబురంపించెను. ఆమెయు నాఁటిరేయి వచ్చెను. శాంతిశ్రీదేవి చక్రవర్తి పజ్జఁ గూర్చొని

"చక్రవర్తి నన్నెందుకో కబురంపెను" అని రెండు మూఁడు సార్లనెను. ఆలోచనాక్షీణమనస్కుఁడై యనిమిషలోచనుఁడైన చక్రవర్తి నోటినుండి సమాధానము రాలేదు. అట్లు రెండు గడియలసేపు కూర్చున్నతరువాత చక్రవర్తి యిట్లనెను. "వీర పురుషదత్తుఁడు నిజముగా నా కుమారుఁడేనా!" అని. శాంతిశ్రీ అర్ధఘటికాకాలము నిరుత్తరయాయెను. చక్రవర్తి మఱల నిట్లనెను. "నాకుఁ జెల్లనాఁడు. ఇంతమోసము వచ్చినతరువాత చేయునదేమియును లేదు. నిజము చెప్పినచో శాంతమనస్కుఁడనై చనిపోదును." శాంతిశ్రీదేవి చక్రవర్తి పాదములమీఁద వ్రాలి దుఃఖించెను. ఇద్దఱును వృద్ధులు. ఇద్దఱును ఏకగర్భవాసులు. ఇద్దఱును మతిప్రతిభాసమానులు. ఒకవేళ శాంతిశ్రీదేవియే పురుషుఁడై జన్మించినచో చక్రవర్తి యాయను కాని తాను గాఁడు. "శాంతిశ్రీదేవి యిట్లనెను. 'అతఁడు నీకుమారుఁడుకాఁడు' చక్రవర్తి గొంతులో నిలచిన యంబూకృతము మ్రింగుడు పడలేదు. మఱల నర్ధఘటికాకాలము గడచెను. ఆ గదిలోని వాయువు ప్రతిలిప్తకు గష్టముమీఁద రెక్కలమీఁద నాడించుకొని తేలించుచుండెను. చక్రవర్తి మఱల నిట్లనెను. "అతఁ డెవ్వరో తెలియునా?" శాంతిశ్రీ: "తెలియదు. బ్రాహ్మణ బాలుఁడని యనుమానము. ఆతని కిప్పటి కిఱువదిరెండు వత్సరములు వచ్చినవి. అతనితల్లి యతఁడు పుట్టినతరువాత కొన్ని గడియలకే వాని నా కిచ్చెను. మఱుసంవత్సరము వచ్చి పిల్లవానిని జూచిపోయెద ననెను. ఆమె కంతఃపురప్రవేశయోగ్య చిహ్నముగా నాబాజుబందిచ్చితిని. ఆమె యేటేట వత్తునన్నది. ఇప్పటి కొక్కసారియైన రాలేదు."

చక్రవర్తి దీర్ఘాలోచనాపరుఁ డయ్యెను. కొంతసేపటికి ‘శాంతీ! నీవు సాధ్వుసుతస్థురాలవు. నా తండ్రికడుపున నెట్లు పుట్టితివో తెలియదు. నేను శాతవాహనుల యాత్మకు ద్రోహము చేసితిని. నీవు వారికి నీరమునకు గూడఁ జేయుచున్నావు. బుద్ధుని దైత్యప్రతారకుఁడు’ అని పలికి కొంతసేపాగి యిట్లనెను. ‘శాంతీ! నా కొక్క వాగ్దానము నిమ్ము. ఈ రహస్యము నీవెప్పుడును దత్తునకు తెలియనీకుము.’ శాంతిశ్రీ యన్నగారి హస్తములు తన హస్తములను జోడించి ‘నేను తెలియనీయను. నన్ను మించి తెలిసినచో నే నేమి చేయుదును’ అనెను. చక్రవర్తి పెద్ద నిట్టూర్పుపుచ్చి యిట్లనెను. ‘మాఠరీ! మాఠరీ! శ్రీరామచంద్రునకు సీతాదేవి యెట్లో నీవు నాకట్లయితివి. ధర్మరాజు శాపము వృథా యయిపోయెను. స్త్రీలకు రహస్యగోపనశక్తి లేకుండ నతఁడు శపించెను. ఆ శాపమునందు బలమే లేదు. మాఠరియా? ఆ యమాయకురాలా? ఈ రహస్యము ప్రారంభమునుండి తుదిదాక రక్షించెనా? అహో అవిశ్వసనీయము!’ ఆమాటతోఁ జక్రవర్తి తుదినిశ్వాసము వదలెను. శాంతిశ్రీ చలించిపోయెను. పరిచారికలు వచ్చిరి. పరిచారకులు మూగిరి. వృద్ధురాలైన మాఠరీదేవి తొందరలో జారిపోయిన బంగారుపటందియగాఁ బరువెత్తివచ్చెను. భర్తృవదనారవిందము చూచినంతనే సర్వము విస్పష్టమాయెను. ఆమె దుఃఖపుబరువు వోర్చుకొనలేక వ్రాలుచున్న ముసలి కనురెప్పలక్రిందినుండి యాఁడుబిడ్డవంకఁ జూచెను. శాంతిశ్రీ కలువది మూఁడేండ్లు. ఆమె జన్మలో దైన్య మనుభవించి యెఱుఁగదు. పేదగుండెపడి యెఱుఁగదు. ఆ పట్టపుహిమపి చూపుకో శాంతిశ్రీ నీరసించి పోయెను? ‘వదినే! క్షమింపుము. ఈరహస్యము అన్నగుండెపై బరువుగా కూర్చుండెను. నే నా

బహువ్ర తోలగింపఁ బ్రయత్నించితిని. నా ప్రయత్న మన్యథా కృతియయ్యెను. మాతృదేవికన్నులలో నీరు కురుపలు కుం పలు కట్టెను. 'చక్రవర్తిని' నేసి యొక్క విషయమున మోసము చేసితిని. ఇదియొక్క విషయమా ? జీవితసారభూతమైన విష యము. జీవితపరమార్థవిషయమున చక్రవర్తిని నేను గికురించి తిని. నే నాయన సేవకురాలను. ఆయనయందు నేను చేసిన సేవయందు ప్రత్యణుప్రకారము నిర్మాయికతయే నింపితిని. అహో సౌభాగ్యము— నాచేసిన సర్వతపస్సు! తపస్స్వదేశము సంపూ ర్ణకత్వమే వ్యాపించినది. అది దేవతాస్వరూపము ఫలము తెలియక చేసిన సాహసమువలె నా బ్రతుకు ఫలమంతయు 'అసినాసి విచికిత్సాహేతు' నాయెను అని పొంగివచ్చిన దుఃఖ తరంగములలో మాతృదేవి చక్రవర్తి కళేబరముమీఁద పడి పోయెను. శాంతిశ్రీ పిలిచినఁ బలుకలేదు. తాఁకఁగా నామె రొమ్ములు మంచుగడ్డపోయెను. మాతకీ, శాంతిమూలుల రెండు శరీరము శోకపాశముగా నుండెను.

వీరపురుష పత్రునకు నిన్న పట్టాభిషేక కర్మ, నేడు పితృ మాతృ కర్మ. బాదసన్యాసి యాశీర్వాదముతోఁ బట్టాభిషేక వైదికకర్మ చెడిపోయినది. క్రొత్త చక్రవర్తికి వెంటనే బెడిసి కొట్టిన దని పరిమారి యనిరి. పట్టాభిషేకమునకు వచ్చిన సర్వ రాజ బంధువర్గము కర్మ పన్నెండుదినము లుండిరి. సోమపీథి, అశ్వమేధి శాంతిమూలచక్రవర్తి యంత్యకర్మ యొక మహా క్రతువువలె సాగెను. క్షేత్రజ్ఞులను సమకూర్చి సర్వదేవ తాహ్వానముచేసి కర్మయందు ప్రత్యూహము లేకుండ ఆహుతి స్ఖలితములు రాకుండ శ్రౌతకర్మనిరతులైన బ్రాహ్మణులు నిర్విఘ్నముగా కొనసాగించిరి. సహస్రగోదానములు, అగ్ర

హారదానములు, బహువిధదానములతో విజయపురము ప్రీతి గృహీతృప్రశంసారావబంధురాకాశ మాయెను.

పదునాఱవ దినమున రాజపురుష దత్తుండు తనతల్లి యొక్క తనయందలి వాత్సల్యమును స్మరించుకొనుచుఁ దనలో తానే పైకి వినబడునట్లు 'అమ్మా' యనుకొనెను. ఆ సమయమున శాంతిశ్రీదేవి మఱియొక స్త్రీతో నతఁ డున్న ప్రదేశమునకు వచ్చెను. ఆవచ్చిన స్త్రీకి నలుఁబది యేండ్ల లోపు వయస్సు. ఆమె చేతిలో నొక బంగారపు రాజుబాదు ఉండెను. దానివంక శాంతిశ్రీ చూచుచుండెను.

# చతుర్థాధ్యాయము

ఆవచ్చిన స్త్రీని జూచినంతనే చక్రవర్తి నివ్వెఱపోయెను. మాతరీదేవి బ్రతికివచ్చెనా? మాతరీదేవి యిరువదియేండ్లు చిన్నదయ్యెనా? అతని మొగమెల్ల కన్నులే యయ్యెను. శాంతిశ్రీదేవి మొగమంతయు నాశ్చర్యమయముగా నుండెను. వచ్చిన స్త్రీ చక్రవర్తి యెదుట నిలుచుండెను. చక్రవర్తి యెదుట స్త్రీ గాని పురుషుఁడు గాని నడుపవలసిన సముదాచారమామె నడుపలేదు. నేలనారిలి ఫాలము చక్రవర్తి పాదము లంటఁ బ్రణామ మాచరించలేదు. ఆమె యాకారము చూచినచో బౌద్ధశ్రమణివలె నుండెను. కాని శిరస్సునకు భద్రాకర్షణము జరుగలేదు. ధరించినదుస్తులు బౌద్ధులు తాల్చు చీరాదు లెలిదుప్పటిముసుఁగు. మొగమునఁ గుంకుమ లేదు. కనుల గాటుకలేదు. గళముదాక నిడిన ముసుగుచేత మెడయందు మంగళసూత్రాదు లున్నవో లేవో తెలియ లేదు. విధవరాలా?

సభ నర్తకియా? ఆస్త్రీ చక్రవర్తి వెంట మొట్టమొదటఁ బరీక్షించి
చూచెను. తరువాత నఖశిఖాపర్యంతము దృష్టిసారించెను.
అంతలో నామె కన్నులలో నొక మాతృప్రేమ వెల్లివిరిసెను.
ఆమె యేమో చేతులుచాచి తన్నుఁ గౌఁగిలించుకొనుటకు వచ్చి
నట్లుండెను. ముప్పుటు నొక పదినిమేషముల పాటు ఆస్త్రీ
నిశ్శబ్దులై యుండిరి. ఇంతలో నా వచ్చిన స్త్రీ వెనుకకు గిఱ్ఱున
తిరిగి వాయువేగమున నచటినుండి నిష్క్రమించెను.
ఆమె వెడలిపోయిన నిమేషమునకు శాంతిశ్రీ వీరపురుషదత్తు
లకుఁ దమ మెదళ్ళు తిరుగుట తెలియలేదు. ఇద్దఱికిని స్మృతి
కలిగినంతనే యామెను పోయి కలసికొనుటకు నిద్దఱును బయలు
దేఱిరి. ఆమె యెచ్చటను గనుపించలేదు. లేడివలెఁ బరుగెత్తినదని,
బాణమువలె దూసికొని చన్నదని, యిదిగో యిప్పుడే యిచ్చట
నుండి కదలినదని ప్రతిద్వారస్థభటుడు చెప్పుటయే కాని
యామెజాడ కనరాలేదు. చివరకుఁ దిరిగి యిద్దఱును మొదటి
గదిలోనికి వచ్చిరి. చక్రవర్తి 'ఆమె యెవరు?' శాంతిశ్రీ:
'నేనామె నిదివఱకుఁ జూడలేదు' వీర: ఆమెను నావద్దకేల తెచ్చి
తిరి? శాంతి: 'నీవు పుట్టినప్పుడు నేనామెను గలసికొంటిని.
ఆమె రాజాంతఃపురప్రవేశము నాశించినది. నే నామెయందు
జాలికొలదినా కంకణం దామెచేతికిచ్చి యిదిగుర్తుగాఁజూపించి
నచోఁ బ్రవేశము కలిగింతు నని చెప్పితిని. అదియొక అర
రాత్రము. నాకామె యొక మహోపకారముచేసెను. అప్పటి
కిప్పుడు వచ్చెను. నాతో మాటాడలేదు. ఏదో మంత్రముచేత
నాకృష్టమైన భుజగివలె నే నిచ్చట కామెను దెచ్చితిని. ఇందు
జరిగినది నీకుఁ దెలియును. వీర: ఆమె కంతఃపురప్రవేశ
మెందుకు? ఆమె ముమ్మూర్తుల మాయమ్మను బోలియున్నది.

శాం: మారసీదేవికి మఱి యుద్ధము చెల్లెందున్నారట. ఒక
యామె వనవాసాంధ్రభృత్యులరాణి. వేఱొకయామె యొక
పాలియగానిభార్య. అతఁడు తన భార్యను గొనికొని కాశికి పోయి
నాఁడని వదంతి. వీర: ఆమె యీయామె యేమో? అయినచోఁ
దనపినతల్లి తనను దాచుట యేల? శాం: అయినచో నామె
మఱల తప్పక వచ్చును.

వచ్చును. వచ్చు నన్న చక్రవర్తి మదిలో మారసీ
దేవి దుఃఖ మొత్తిగిల్లెను. అతని మన స్సేమో సుకు
మారపథముల సంచరించెను. భట్టిదేవి, శాంతిశ్రీ,
బాపిశ్రీ— అతని మనస్సు వీరి ముగ్గురు చుట్టుఁ దిరిగెను.
భట్టిదేవి పట్టాభిషేకసమయమున సింహాసనముపైఁ దన
పజ్జఁగూర్చుండెను. హోమకాలమున గర్భిణి యని యాజ్ఞికులు
పరిహరించిరి. సింహాసనగతయైనప్పుడు తన సే నామె మే
నొరసికొన్నవి. తానో పులకితాంగుఁ డయ్యెను. ఆమె చలించి
నట్లులేదు. తన తేజస్సు గర్భమున ధరించియున్నది. తనయం
దంత విరాగమెందుకు? తన బాహుబలముచేత భట్టిదేవి నేల
సాధించెను? సాధించియు, సాధించనట్లే యున్నది. తన చేసిన
యెల్ల పనులు చేసినట్లే కాదేమి? మఱి యే మూర్ధాభిషిక్తుఁడైన
రాజన్యుఁడైనను తాను దాఁ దన కూఁతు నిచ్చినచో భట్టిదేవి
మనస్సిప్పటికిఁ దిరుగునేమో? తనకు శాంతిశ్రీయందుఁ బ్రేమ
కలదా? శాంతిశ్రీకిఁ దనయందు ప్రేమకలదా? ఆమెకుఁ దన
యందు జాలికలదు. ఆమె జాలి ప్రకటించిన సమయమునఁ దా
నామెను వశపఱచుకొనెను. ఆమెయు జాలిబరువునకు లొంగి
పోయెను. గెలిచి తెచ్చిన కాంతకే ప్రేమలేదు, జాలితో విలిచి
తెచ్చిన కాంతకుఁ బ్రేమయా? బాపిశ్రీ భట్టిదేవియంత యంద

కత్తె. భట్టిదేవి సౌందర్య మప్సరసస్సమానము. ఆమె మొగము చూచినచో మహారాణి యనిపించును. శాంతిశ్రీ యందకత్తెయే. కృష్ణావదికి సుందరకమ్మను నేమి పోలిక? శాంతిశ్రీని తన కిచ్చుటకు తన చిన్నన్నాన యంగీకరించునా? తండ్రియైనం జెప్పకుండబోయి భట్టిదేవిని సాధించుకొని వచ్చెను. ఆ తండ్రి యంగీకారము లేని తాను జేసిన ప్రతిజ్ఞాకార్యమును విపరీతఫలదాయి యగునా?

ఆ మఱునాఁడు పట్టాభిషేకమునకు వచ్చి పితృకర్మాంతమునకును విజయపురియందే యున్న సర్వసామంతులు వెడలి పోయిరి. ఉజ్జయినిమహారాజైన మహాక్షాత్రపుఁడు పోవుచుం బోవుచు వీరపురుషదత్తున కొక వార్త కబురుచేసెను. తన కూఁతురైన రుద్రధారాభట్టారికను వీరపురుషదత్తునకు భార్యగా నిత్తు నని వార్త పంపెను. వీరపురుషదత్తునకు భుజములు మూడయ్యెను. మహాక్షాత్రపులు శకయవనులుకారు. మంచి క్షత్రియులు. క్షాత్రపులు బలపరాక్రమశాలురు. దక్షిణాపథమున క్షాత్రపుల పరాక్రమము పరిగణనీయమైనది. క్షాత్రపుని పేరు శత్రువులకు సింహస్వప్నము. శాతవాహనులు, ఇక్ష్వాకులు లేనిచో దక్షిణాపథమంతయు క్షాత్రపుల కే నాఁడో కరగత మయ్యెడిది. ఆ క్షాత్రపుఁడు తనకుం గన్యనిత్తు ననెనా? ఈ వార్తను బట్టపురాణియైన భట్టిదేవితోఁ జెప్పవలెనని రాజు కబురుచేసెను. ఉజ్జయినిరాజు వృద్ధులైన యొక ప్రతీహారిని భట్టిదేవివద్దకుఁ బంపెను. భట్టిదేవి విని శూన్యదృక్కులతో నిట్లనెను. "ఈ చక్రవర్తుల యంతఃపురమునఁ బట్టపురాణులకు పలుకుబడి లేదు. పూగీయరాష్ట్రాధిపతి రాణిగారైన శాంతిశ్రీ దేవియాజ్ఞ సర్వేక్ష్వాకువంశము శిరసావహించును. ఆమెతోఁ

జెప్పుమనెను. ఈమాట చక్రవర్తికి వినిపించెను. అందులో బహుముఖములుగాఁ దాడితములై వ్యంగ్యభూతములైనయాక్షేపణలలో నొక్కటితక్కఁ దక్కినవన్నియుఁ జక్రవర్తికి దెలిసెను. ఆ యొక్కటికూడ శాంతిశ్రీదేవికిఁ దెలిసెను. శాంతిశ్రీదేవి యంగీకరించెను. అది భట్టిదేవి యంగీకారమని ఉజ్జయినీపతి యనుకొనెను. తరువాతఁ బదిదినములకు రుద్రధారాభట్టారిక కానుకలతో సేనతోఁ బరివారములతో నిక్ష్వాకులయంతఃపుర ప్రవేశముచేసెను. రుద్రధారాభట్టారికతోఁ బోయి పట్టపురాణి దర్శనముచేసి రమ్మని చక్రవర్తి చెప్పెను. ఆమె యట్లేచేసెను. ఆమె యేమియు ననలేదు. ఆదరించి కానుక లిచ్చి పంపించెను. చక్రవర్తి రుద్రధారతో ననెను. "రాణి యేమన్నది? నన్ను గుఱించి యేమియు ననలేదా" అని. రుద్రధార కేమి తెలియును? మిమ్ముగుఱించి యచట కేమి యున్నదనెను. మనిసి నెత్తురు త్రావిన పులికి దప్పిక తీరనట్లు చక్రవర్తికి కామదాహము తీరలేదు. భట్టిదేవి విరహము పదిమంది భార్యలతోఁ దీరు నని యతనియుద్దేశ్యము. మఱియుఁ జక్రవర్తి బాపిశ్రీని పెండ్లియాడినఁగాని భట్టిదేవికిఁ దనయం దనురాగము పుట్టదనుకొనెను. ఒకదానికి నొకదానికి నేమి సంబంధము? రుద్రధారగాని, శాంతిశ్రీగాని భట్టిదేవియంత యందకత్తెలు కారు. బాపిశ్రీ యంత యందకత్తె. తాను బాపిశ్రీని వివాహమాడినచో భట్టిదేవికిఁ దెలియును. ఏమని? తనవలె సుక్షత్రియయైన రుద్రధారకు రుద్రధారకలదు. తనవలె మహాసౌందర్యవతియైన బాపిశ్రీకి బాపిశ్రీ కలదు. చక్రవర్తి కేమి లోటు? తనకే లోటని తనకుఁ దెలియును. ఇది చక్రవర్తి వాదన. ఏమి వాదన? సేనావ్యూహములు పన్ను బుద్ధికౌశల్యము. అంత చిక్కుతనములోఁ మంత్రి

సంపాదించిన మహాసామ్రాజ్యము నంతయుఁ బాలించుటలో రాజనీతి వైశారద్యముచేతఁ దండ్రిని మించినాఁ డనిపించుకొన్న బుద్ధివైశారద్యముఁ దన్నుఁ జూచినంతనే పరసేనావ్యూహము బ్రద్దలగునట్టి తేజోదుర్నిరీక్ష్యత-వీనితో యీ వాదనలోని లేఁత దనము పొసగునా? స్త్రీప్రేమ యనునది వేఱే సామ్రాజ్యము. అప్పటి చక్రవర్తిత్వము ఈ చక్రవర్తిత్వము వంటిది కాదు.

ఒకనాఁడు చక్రవర్తి తన చిన్నమేనత్త గారింటికి వత్తు నని కబురంపించెను. వారియిల్లంతయుఁ బచ్చని తోరణాలతోఁ దెల్లని ముగ్గులతో గునగున నడచు పరిచారికల గుంపుతో మంగళారాత్రికలతో ద్వారద్వార నిశితాక్షులగు ప్రతీహారులతో వెండిబెత్తాలవారితోఁ గలకల లాడెను. చక్రవర్తి పోయి ముందరి సావడిలో జరీపనులు చేసిన పట్టుపరపులమీద పట్టు దిండ్లపై నొరగి కూర్చుండెను. సభ యంతయు నైపోయిన తరువాత భోజనవేళ మేనత్త యిట్లనెను. 'ఇన్నాళ్ళకు మా యింటికి వచ్చితివి. మేము నీకేమి యీయగలము? 'ఈయ దలచుకొన్నచో నిచ్చునదే లేదా' యని చక్రవర్తి యనెను. మేనత్తభర్త 'యీసర్వము మీదే' మే మిచ్చునదేమి? మీరు తీసికొనునదేమి? మీకేది కావలసిన నది తీసికొని పోవచ్చు' ననెను. చక్రవర్తి నెమ్మదిగా నవ్వుచు 'అయినను నీయగాఁ బుచ్చుకొనుటలో నొకరమ్యత లేదా' యనెను. ఆ మందహాసములో నతనియర్థము భార్యాభర్తలకుఁ దెలిసెను. మేనత్త భర్త "మీ యిష్టము, లగ్న మెప్పుడు పెట్టించు మన్న నప్పుడు పెట్టింతు" ననెను. చక్రవర్తి: మీరు క్షత్రియులు. నే నౌదునో కానో? నాకుఁ బిల్ల నిత్తురా యనెను. బ్రాహ్మశ్రీ నొచ్చుకొని 'అదియేమయ్యా! నీయంత

క్షత్రియులము మే మౌదుమో కామో! శాంతిమూల చక్రవర్తి స్వర్గమునుండి నేలకు దొరలిపడుమాట యన్నా' వనెను. వీర పురుషదత్తుని యెదలోపలి యెదలోఁ గదలీకదలని కదలిక యుపశమించెను. చక్రవర్తినోట నీ యనుమానము మొదటిసారి బహిర్గత మగుట యిదియే. రేజాము ప్రొద్దువేళ మొగ్గ లుబ్బి చల్లని మృదుతుషారములకు బలసి యాకాశసమైన కాంతికి విడిలి ప్రొద్దునవిచ్చిన పూలతోడి మల్లెపొదవలె, సంపనవనారామవీధి కాందోళిత మందవాయు సంచాలితాగురు కస్తూరికాది పరిమళ లహరీపరీవాహ సబ్రహ్మచారి చేలాంచలాభిరామ మృదుమనోహరాకారాప్సర స్త్రీరమువలె బాపిశ్రీ చక్రవర్తికిఁ గైవసమయ్యెను. తత్ప్రథమ సమాగమము చక్రవర్తికి భట్టిదేవీ ప్రసాదన ప్రథమసోపానమువలె సుకుమార పాదవిన్యాస మంజులమయ్యెను. ఆనాటిరాత్రి బహుకాలమునకుఁ దన కోర్కె తీరిన బాపిశ్రీ దేవాలయ విమానపుగూటిలో నత్తుకొన్న పారావతివలె భర్తయెద కత్తుకొని 'నేను నీకుఁ గౌమారినైన భార్య' ననెను. చక్రవర్తి 'నీవు పండితుని కూఁతురవు' అని తెలియకుండనే యోగ్య ప్రతివచనము చేసెను. మఱునాఁడొక పండితుని యడిగెను. అతఁడు దాని యర్థమును జెప్పెను. చక్రవర్తికి నొకధైర్యము తోఁచెను. తాను జేసిన పని, అనినమాట, తనకుఁ దెలియకుండనే యొక బోసగింపులో నమరియుండు నని.

ఒకనాఁడు చక్రవర్తి పట్టమహిషి యింటికి వెళ్ళెను. ఆమె యర్ఘ్యపాద్యమ్ము లిచ్చి సుఖాసీనునిఁ జేసెను. కాని దూరమున నిలుచుండి చక్రవర్తితో నతని బాల్యవర్గములోని యొకవ్యక్తికి మాటాడుచున్నట్లు మాటాడుచుండెను. చక్రవర్తి యిట్లనెను. 'నీవు నా తేజస్సును గర్భమున

ధరించితివి. నాకు ఉజ్జయినీ క్షాత్రపుడు తన కూతు నిచ్చెను. బాపిశ్రీ నీ యంతటి సౌందర్యవతి. ఆమెయే నన్ను వరించెను. మా పెద్దమేనత్తగారు బౌద్ధమతస్థురాలు. ఆమెకు నే నెవ్వరనైనను బట్టఁపులేదు. శ్రాహ్మిహ్నశ్రీదేవికిఁ బట్టింపే. ఆమెయుఁ దనకూతును నాకిచ్చెను. నేను క్షత్రియుఁడనుగానా? నిన్ను బలవంతముగాఁ దెచ్చితినని కోపమా? రాక్షస వివాహ ములు స్మృతు లొప్పుకొన్నవే. శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవి నెత్తుకొనిపోయెను. నీకు నాయందేల ప్రేమలేదు? నేను సుక్షత్రియుఁడను కాననియా? లోకమునందలి ప్రవాదమునే నమ్మెదవు గాని నన్ను నమ్మవా? నా చిత్రపటమును నా తల్లిదండ్రుల చిత్రపటమును దగ్గరనుంచి చూడుము. నేను వారి కడుపునఁ బుట్టనిచో నంత దగ్గరపోలిక లుండునా?" యనెను. భట్టిదేవి: "అయ్యో! ఇదియేమి! తమరు క్షత్రియులు కారని యిందెవరనిరి? నేను మిమ్ము ప్రేమించుటలేదని యెవరు చెప్పిరి? భార్య భర్తను ప్రేమించక యేమిచేయును? మీరే వివాహములపై వివాహములుగాఁ జేసికొనుచున్నారు. నేను వలదంటినా? ఈ రాజ్యములోఁ బట్టమహిషుల కధికార మే మున్నది? అత్తగారు మాశకీదేవి యేమి యధికారము చెల్లించినది? నే నేమి చెల్లించవలయును? మీర నెడు మాటలు నాకర్థము కాలేదు. అంతే. చక్రవర్తి తనదారిని దాను వెడలిపోయెను. ఆయన యుద్దేశ్యము భట్టిదేవి తనవద్దకువచ్చి తనపైఁ జేయివైచి తన్నుఁ గౌఁగిలించుకొని మద్రధారాదులవలె నటించునని. ఆమె యట్లు చేయలేదు. చక్రవర్తికిఁ బట్టమహిషిమీఁదఁ గొంచెము కోపము వచ్చెను. ఆయనకే యాశ్చర్యమయ్యెను. ఆమెమీఁదఁ దనకుఁ గోపము వచ్చినదనగా నన్యాతః తనకు స్త్రీవిషయమున సంతోషము కలిగిన

దన్నమాట. ఆ స్త్రీ యెవరు? బాపిశ్రీయా? రుద్రధారయా? శాంతిశ్రీ ప్రసక్తిలేదు. శాంతిశ్రీ తనొక్కవిధముగాఁ బ్రేమించుచుండెను. ఆ ప్రేమకు పట్టువిడుపులు లేవు. కాలాకాలములు లేవు. ఎత్తులు లేవు. పల్లములు లేవు. అది యుపచార మెక్కువ కలిగినప్రేమ. బౌద్ధయువతితోడి సంపర్కమువలె నుండెను. కాని శాంతిశ్రీ పజ్జ నున్నప్పుడు చక్రవర్తి హృదయము ప్రశాంతముగా నుండును. ఆమె బుద్ధదేవుని దయ, శాంతి, మొదలైనవానినిగూర్చి ప్రసంగించును. వైదిక దేవతలు కామక్రోధాదిదోషపూరితులని, బుద్ధదేవుఁడు శాంతదోషుఁడని, బుద్ధదేవు నాశ్రయించినచో మనస్సు నిశ్చలమై శాంతమగునని తన మనస్సు శాంతముగా నుండుట కదియే కారణ మని యామె యనును. ఆమె మాటలు నిజమువలెఁ గన్పించును. బాపిశ్రీ సౌందర్యవాహినిలో నెన్నిమునుఁకలిడినను తనివి తీరకుండ నుండెను. భట్టిదేవితోడి పట్టిసంగమే హృదయమునకుఁ బరితృప్తి కలిగించుచుండెను. భట్టిదేవి మొగము చూచినంతసేపు తాను జక్రవర్తి ననిపించు చుండెను. బాపిశ్రీవద్ద దాను గాముకునివలె నుండెను. రుద్రధార యింటఁ జక్రవర్తికొక విచిత్రానుభూతి కలుగును. విచిత్రములైన భావములు రేకెత్తును. తాను క్షత్రియుఁడు కాఁడు. ఆక్షత్రియ తన్ను పొందినదేమా యని. అటనుండి వెలికివచ్చి తా నేల క్షత్రియుఁడను గాదనుకొనును. రాజకార్యములనుండి విడివడి యంతఃపురమున నున్న వేళలలోఁ జక్రవర్తికి మనశ్శాంతిలేదు.

ఒకనాఁడు బాపిశ్రీ చెల్లెలు షష్ఠిశ్రీ యక్కగారిని జూచుటకు వచ్చెను. ఆమె పదునాలుగేండ్ల బాలిక. ఆమెను జిదిమి దీపము పెట్టవచ్చును. కొంచెము పొట్టిది. గిలకవలె

నుండెను. కాశీనత్తె మునవలెనుండెను. చిన్ని మొగము. అందులోఁ జిన్ని నాసలు. చక్కని కన్నులు. తమ్ములపాకు తీగకు చిటారు కొమ్మ నున్న లేయాకులలో నొకచివర చిన్నియాకువలె నుండెను.

ఆమె కట్టినచీర, తొడిగినరైక, యామె యొడలిపైకి వచ్చిన చిరుజవ్వనమును జిన్ని పళ్ళెరములో పెట్టియిచ్చినట్లుండెను. ఆమె బాపిశ్రీ సౌధపురోభాగమున నిలచి తోఁటలో నొక పువ్వుకోయుచుండెను. చక్రవర్తి వచ్చినంతనే చూచి యామె కొక చిన్నారిసిగ్గయ్యెను. చక్రవర్తి యాజానుబాహువు. ఆఱడుగుల యెత్తుమనిషి. షష్ఠిశ్రీ నాలుగడుగుల లోపెత్తు. వింధ్యపర్వతమువద్ద చిన్నిలతకూన నిలుచున్నట్లుండెను. చక్రవర్తి యామెను జేతులలోని కెత్తుకొని లోనికిఁ దీసికొని పోయెను. ఆమె గిలగిలలాడెను. చక్రవర్తి చేతులలో నున్న యామెను ముద్దిడుకొనెను. ఆమె 'మాయమ్మతోఁ జెప్పెద' ననెను. చక్రవర్తి నవ్వెను. ఇంతలో బాపిశ్రీ వచ్చెను. చక్రవర్తి యిట్లనెను. 'చూచితివా నీ చెల్లెలు. నేను దానిని ముద్దిడుకొనరాదంట. దాని యప్పగారి చెక్కిలికి దాని చెక్కిలికి నంత భేదమున్నదా?' యని. చక్రవర్తి కాముకత బాపిశ్రీ యెఱుఁగును. చక్రవర్తి విషయమున నిప్పటికే నలుగురు భార్యలుకల యతని విషయమున నీర్ష్యపొంది యేమిలాభము? బాపిశ్రీ నవ్వుకొని యొకనవ్వు నవ్వెను. చక్రవర్తి షష్ఠిశ్రీ నొకచోటఁ గూర్చుండఁ బెట్టెను. ఆమె కుదించుకొని పయ్యెదకొంగొడలెల్లఁ గ్రమ్ముకొనునట్లు లాగికొని మొగము గంటుపెట్టుకొని యొక చిన్నిపవడమువలెఁ గూర్చుండెను. చక్రవర్తి యామె చెక్కిలి గీటబోయెను. ఆమె 'ఇదిగో నా జోలికి వచ్చితివా!' యనెను.

అతఁ డిదివఱ కెన్నఁ డెఱుఁగని బ్రహ్మానంద మనుభవించెను. నలుగురు భార్యలనుండి యొక్క గద్దింపుమాట లేదు. తన్ను లెక్కసేయకపోవుట లేదు. ఈ పసిపిల్లకుఁ దాను మేనమామకొడుకువలెఁ గన్పించుచున్నాఁడు గాఁబోలు. చక్రవర్తి యిట్లనెను. 'నే నెవరను?' షష్ఠి: 'నీవా, యెవర వేమి?' చక్రి: 'నే నెవరినో మీయక్కనడుగుము. షష్ఠి: అడుగనక్కఱలేదు. నాకుఁ దెలియును. చక్రి: తెలిసినచోఁ జెప్పుము. షష్ఠి: నీ పేరు వీరపురుషదత్తుఁడు.' బాపిశ్రీ నోటిమీఁద, జేయిపెట్టుకొని భయపడుచుఁ జెల్లెలి నదలింపఁబోయెను. చక్రవర్తి విఱుగఁబడి నవ్వి 'నేను నీ కేమగుదునో చెప్పు' మనెను. ఆమె 'నీవు నా కేమియుఁ గా' వనెను. చక్ర: నే ననినచో నీకు లెక్కలేదా? షష్ఠి: లేదు. చక్రి: (నవ్వుచు) ని న్నేమి జేసెదనో చూడుము. షష్ఠి: ఏమిచేసెదవో చేసికో. నీ వసలు న న్నెఱుఁగవు." చక్రివర్తి మఱల నామెను జుంబింపఁబోయెను. ఆమె కూర్చున్న చోటినుండి యెగిరిదూఁకి యింక నేను మీయింటికి రానని బిరబిర నడచిపోయెను. చక్రవర్తి పోవుచున్న యామెను కొంగు పట్టుక లాగి వదలిపెట్టి నిలఁబడి యొకటే నవ్వుట.

కాని బాపిశ్రీకి మనసులోఁ జాల భయము వేసెను. ఆనాటి మధ్యాహ్నము చక్రవర్తి రాజకార్యములు చూడఁ బోయెను. బాపిశ్రీ తన పుట్టినింటికిఁ బోయి జరిగిన సంగతి యంతయుఁ దల్లితోఁ జెప్పెను. ఇట్లనెను. 'దీని కిది తగదు. చక్రవర్తిని దోఁటక్కూరలోఁ బురుగును దీసివేసినట్లు తీసివేసెను. ఆయనకుఁ గోపమువచ్చెనని నాకు భయము వేసెను. మఱిదలు కదా యని సరాగమాడినచో నేమి దీనిమాటలు, దీనిచేతలు? షష్ఠి: నీకు మగఁడైనచో నాకు మగఁడా? మాటమాటకు

మొద్దిడవచ్చునేమి? కొంగుపట్టుక లాగునేమి? నన్నుఁ దన్నెవ రెత్తికొమ్మన్నారు? నే నవెడిదే నిజ" మనెను. తల్లి నెటు చెప్పుటకును తెలియక యూరకుండెను. ఆ నాడు రాత్రి చక్రవర్తి బ్రాహ్మస్త్రీ యింటికి వచ్చెను. షష్ఠిస్త్రీ చక్రవర్తికిఁ గనిపించలేదు. అతఁడు మేనత్తతో షష్ఠి యెచ్చట నున్న దని యడిగెను. ఆమె "నిమీఁదఁ గోపమువచ్చినది. ఆ గదిలోఁ బోయి లోన గడియవేసికొని పరుండినది" దని చెప్పెను. చక్రవర్తి పోయి తలుపు తట్టెను. ఎంత తట్టినను నామె తలుపు తీయలేదు. చివరకుఁ దల్లి కోపపడఁగాఁ దలుపు తీసెను. చక్రి: 'షష్ఠీ' ఎందుకే యింతకోపము? నేను బావనుగానా? నే నెవరో చెప్పు' మనెను. ఆమె నీవు పరపురుషదత్తుఁడ వనెను. బ్రాహ్మస్త్రీ: 'ఛీ నోరుమూయుము. బావ యనలేవా?' యనెను.

షష్ఠి: నాజోలికి రానిచో బావ యందును. చక్రవర్తి: నీవు నన్ను బావ యనవలయు. నేను నీజోలికి వచ్చెడిదే నిజము. షష్ఠి: వచ్చినచో లెంపకాయలు తిందు' వనెను. చక్రి: 'ఏదీ కొట్టు'మని మీఁదికిఁ బోవుటయు, బ్రాహ్మస్త్రీ యచ్చట నుంచి నవ్వుచు నేదో పనిమీఁదఁబోవుటయు నొక్కసారి జరిగెను. చక్రవర్తి యామె చేతులు పట్టుకొని పెనఁగులాడుచున్న యామెను బొమ్మమీఁది కెత్తికొని బలవచ్చుంబన, బలవత్పయోధరసంస్ఫాలన, బలవజ్జఘనపరిమార్జన, బలవచ్చిరోజాకర్షణలు చేసెను. ఆమె యెట్టుము వదలించుకొని పోఁజూచెను. చక్రవర్తి యామెను బట్టుకొని 'ఓసిషష్ఠీ! క్షమింపుము, క్షమింపుము. నాకు నలుగురు భార్యలున్నారు. నేను నీకు బావనైనను జక్రవర్తినికదా? నాయందు నీ కింతకోప మేల? నీవింకెవరినైన ప్రేమించితివా? ప్రేమించినచో నేను జేసినది దోషము.

ప్రేమించనిచో నీకు భయములేదు. నిన్నుగూడ నేను బెండ్లా డెదను. నాభార్యలు నలువురిలో నెవ్వరు నాయెదుట మాటా డెడువారు లేరు. నన్నుఁ దిరస్కరించువారు లేరు. నే నత్యాచా రము చేసినచోఁ జివరకు దుఃఖపడుటఁగూడ వారికి భయ ముగా నున్నది. నీవు నన్నుఁ జక్రవర్తివలెఁ జూచితివిచో, నీ నాఁడు నన్ను రక్కిగీరినట్లే, నన్ను దగ్గరకు రానీయనట్లే, రాని యక పోనిచ్చుటలో గొంత రానిచ్చుట యున్నట్లే, నీవు నిత్యము ప్రవర్తింపవలెను. అట్లయినచో నిన్నుఁ బెండ్లాడెదను. అంద ఱును జక్రవర్తి చక్రవర్తి. ఏమి చక్రవర్తి? ఈ రాజవంశ ములోఁ బుట్టుటయే తప్పు. నేను రాజవంశములోఁ బుట్టలేదని చెప్పెడివా రెవరైన నున్నచో నెంతసంతోషింతును? ఈబిరుదుకు బరువు మోయలేకున్నాను. కొంద ఱవునందురు. కొందరు కాదందురు. కాదని గట్టిగాఁ జెప్పరాదా? సుఖపడుదును.'

షష్ఠి చక్రవర్తివంక నివ్వెఱపోయి చూచుచుండెను. ఆమె పాఱిపోలేదు. చక్రవర్తి మఱల నవ్వి యామెను కొంగు పట్టి లాగెను. ఆమె 'ఇదిగో లెంపకాయ' యని చక్రవర్తి చెంప మీఁద ఫెడీలున వేసి నవ్వుచు గడివదలి వెడలిపోయెను.

## పంచమాధ్యాయము

మహాదేవి వాశిష్ఠీభట్టిదేవి యొక శుభలగ్నమున కుమారుని గనెను. విజయపురమెల్ల గడపగడపను నూపియలు, నలుగుపిండ్లు, సీకాయపొడుములు, నారికేళములు, శర్కరా ఖండములు, చీరలు, రవికెలు పంచిపెట్టఁబడెను. పురుడు వెళ్ళిన

మఱునాఁడు చక్రవర్తి శాంతిశ్రీ ప్రోద్బలముచేతఁ గొడుకును బోయి చూచెను. చూచెడునటువు గల విముఖత చూచిన తరువాత లేదు. భట్టిదేవి కొడుకును జేతులలోఁ బెట్టి చక్రవర్తికిఁ జూపించెను. తత్పూర్వము చక్రవర్తి పట్టమహిషిని జూడఁబోయినచో నామెవద్ద నుండెడి యాంతరంగిక పరిచారికలు నిత్యము కనుపడుచుండెడివారు. ఆనాడు భట్టిదేవి యాజ్ఞవలన నొక్క పరిచారికయు లేదు. చక్రవర్తి పట్టమహిషీ సౌధప్రకోష్ఠభవనమునఁ దా నేకాకియై మహాదేవికోసము ప్రతీక్షించుచుండెను. తాను చక్రవర్తియై భర్తయై చొచ్చుకొని పోలేడో? పోలేదు. అంతఁ గొంతసేపటికి మహాదేవి శిశువును పొత్తిళ్ళలోఁదానే స్వయముగాఁ దూని కౌతుకములైన మందహాసకదంబములతో బాలింతరాలితనములోని మనోహరత్వ మెల్ల నింపారు నాటుకరేఖలు పులకరించిన కనుదమ్ముల క్రింద నుండి యుట్టిపడఁగా వచ్చి చక్రవర్తి పజ్జ నిలుచుండెను. ఆ నిలుచుండుటలో మహాదేవి శరీరాంచలములు చక్రవర్తియొడలి యంచులకుఁ దాఁకెను. చక్రవర్తి కోపమంతయు నిమేషములో నీరాయెను. బిగువంతయు సడలిపోయెను. మహాదేవి కన్నులందుఁ జూడవలయు ననుకొన్న చక్రవర్తికన్నులు శిశువునందే వ్రాలెను; మహాదేవి శిశువును జక్రవర్తి చేతులలోఁ బెట్టెను. ఆయన తన చేతులు తనకుఁ దెలియకుండఁగనే చాచెను. రాణి యిట్లనెను. 'పెదతల్లి శాంతిశ్రీదేవి వచ్చెను. పిల్లవాఁ డచ్చముగాఁ దను పోలికయఁట. కన్నులు, నాసిక, చేతులపొడుగు—అన్నియు మీవె. పాదాంగుష్ఠముకన్న రెండవ వ్రేలు పొడుగు. బాపిశ్రీ చెప్పెను. అచ్చముగా మీ పాదమే నఁట.' ఈ ధోరణిలో మాటాడెను. అంత పసితనమందే సరిగా

సవయవములు రూపుకట్టకముందే పసివానియందుఁ దనపోలిక తెలుపుచుకొని కనిపించెను. అచట హంసతూలికా తల్పమునఁ దనకుఁ దెలియకుండఁ దాను గూర్చున్న చక్రవర్తి పెదవులకడకు శిశుప్రయోక్త స్వల్పకపోలము మహారాణిచేత సన్నిహిత పఱుపఁబడెను. చక్రవర్తి తా నెఱుఁగకయే తన పెదవు లామోదము చేసికొనెను. చక్రవర్తి మనోభావము శిశువునం దల్లంత సేపుండి తల్లికడకుఁ బోయెను. అంత సచ్చిదానందను స్పృశింప వచ్చునా, రాదా? ఇంతటి సౌముఖ్యము చిరస్థాయి యైనదా? తాత్కాలికమా? కొంతసేపటికి నేదో రాజకీయ కార్య బలవంత మెట్టి యచటినుండి చాలదూరము పోయినవఱకుఁ జక్రవర్తికి మైమఱపుతొలఁగ లేదు. శిశువు పుట్టిన యిరువదియొకటవదినమున హిరణ్యకోటిదానములు, గోశతసహస్రదానములు, హలశతసహస్రదానములు చేయఁబడెను. హలదానములు చేయుట శాతవాహనుల నాఁడు, ఇక్ష్వాకులనాఁడు పరిపాటియైన విషయము. కర్షకులందఱకు హలములు, శకటములు, బలీవర్దములు, ధాత్రిమున్నటకుఁ బండించుటకు దానములు చేయఁబడుచుండెను. ఆ మఱునాఁడు బాలకునకు నామకరణోత్సవము చేయఁబడెను. శిశువు పేరు మహారాజవాశిష్ఠీ పుత్త్రశ్రీ బాహుబల శాంతిమూలుఁడు. అచ్చముగా తాతగారి పేరే పెట్టిరి. తాతగారి పేరు మనుమనికిఁ బెట్టుటయు మేనత్తకూతుండ్రను బెండ్లియాడుటయు తెలుఁగు నాట వీరపురుషదత్తుఁ డేర్పఱచిన సాంప్రదాయములు. ఈపదు నేడు వేల సంవత్సరములు వీరపురుషుఁ డేర్పఱచిన యాచారములు తెలుఁగుజాతిమీఁద ముద్రగానిలచియుండెను. తాతగారి నుండి పేరుకొంచెము వేఱగుటకు బాహుబలశబ్దముకల్పుటయే యుండెను. వృద్ధచక్రవర్తి శాంతిమూలుని తల్లి పేరు వాశిష్ఠిదేవి.

ఇతని తల్లిపేరు వాశిష్ఠీ భట్టిదేవి. అందు వాశిష్ఠీశబ్దమునకే ప్రాధాన్యము వచ్చెను. ఆ నాడు పీటలమీదఁ గూర్చున్న ప్రకారము చక్రవర్తి మహారాణి నానుకొని కూర్చుండెను. మహారాణి తొలఁగలేదు. ప్రేమానుబంధమునకు వారి యిద్దరి యన్యోన్య మేమి తెలియును? అది యంతఃపురవార్త. అంతఃపురీ జనులు మాత్రము వారి యిద్దరి యానాటి ప్రసంగము, కలుపుగోలుతనము, పట్టమహిషి లజ్జాభినయము, చక్రవర్తి చొఱున యన్నియుఁ జూచి యచ్చెరు వొందిరి. మహాప్రణయాంభోరాశులైన దంపతుల లీల వారిద్దరియందుఁ దాండవించెను. అది మొదలు పిల్లవానికై దేండ్లు వచ్చువఱకు భార్యాభర్తలిరువురుఁ బరమ ప్రేమరాశులవలెఁ జూపఱులకుఁ గనుపించిరి. చక్రవర్తి మాత్రము మహారాణి యంతఃపురమునకు రాత్రులందు పోవుట నెవ్వరును నెన్నఁడు జూడలేదు. సంఘములయం దుత్సవములయందు మహారాణియుఁ జక్రవర్తియుఁ గలసికొన్నచో వా రిరువురి సమాగమము క్రొత్త వారికి నేత్రపర్వము. ప్రాతహారి కబ్బురపాటు. చక్రవర్తి పుత్రప్రదర్శనార్థము పలుమారు మహారాణి యంతఃపురమునకుఁ బోవుచుండును. చక్రవర్తి రాజకార్యవ్యగ్రుఁడై నప్పుడుకూడ పట్టమహిషి పసియువరాజును బరిచారికల చేతికిచ్చి తండ్రివద్దకుఁ బంపించు చుండును. పుత్రదర్శన మైనంతనే చక్రవర్తి తానేపని చేయుచున్నను, నది మానివేసి కొడుకు నెత్తికొని మహారాణి యంతిపురమునకుఁ బోవుచుండును. ఈ సంఘటన చిత్రముగా నుండెను.

ఒకనాఁడు రుద్రధారాదేవి చక్రవర్తిని సాహసించి యడిగెను. 'ప్రభూ! నీవొకనాఁడును బట్టమహిషి యింటికిఁ బోవు.

ఏ నిశాభాగమునందును నీవు పట్టమహిషి యింటికిఁ బోయినట్లు పరిచారికలు నాకు చెప్పరు. వన శ్యామెయింటికిఁ బోవుదువు. ఇది మహారాయనకు నాశ్చర్యముగా నున్నది.' చక్రవర్తి నేదైన సాహసించి యడుగవలసినచో సుద్రధారాభట్టారిక గమొక్కతెయే. ఆమెకుఁ జక్రవర్తియం దంత చనవు సమకూరుట కొక్క హేతువుండెను. నీలపురుషదత్తుఁడు చక్రవర్తియైన వెంటనే మహామాత్రుఁడు మరణించెను. మహామాత్రుని తర్వాత నతనిసోదరుఁడు సంఘదాముఁ డుజ్జయిపతి యయ్యెను. రుద్రసేనునకు సంఘదాముఁడు దామసేనుఁడు నిద్దరు తమ్ములు. రుద్రసింహును సంఘదాముఁడు పెంచెను. అతఁడిప్పుడు రాజు. నీలపురుషదత్తునకు బహురాజ్య వ్యవహారములయందుఁ బిన మామగారైన సంఘదాము డండగా నుండెను. అసలు మామ గారు రుద్రసేనుఁడు వివాహమైనతర్వాత నెక్కువకాలము నిలచినది లేదు.

ఈ ప్రశ్నకు మహారాజు విషణ్ణుఁడై తన మన సెట్లు వెల్ల బఱచెను. ఓసి సుదాసి! నీవైనను బట్టమహిషి నైతివి కావు. ఆమెముందు నేను నిస్సహాయుఁడను. ఎన్నిసారు లామె యంతి పురికిఁ బోవలెననుకొన్నను బోకుండ నుండలేకున్నాను. ఆమెను నాయందు ప్రేమ యున్నదందువా, లేదందువా! మన బాహు బలుని నీవు చూచుచున్నావు. వాఁడు వేయిపోలికల నేనే. నాముద్ర యామెమనస్సునం దెట్లత్తుకొన్నది? నమ్ముము నమ్మక పొమ్ము. నేనామె నెఱిగినది మా ప్రథమసమాగమమున నాటి రాత్రియే. అదియే తుదిసమాగమము. నేనామె యెదుట నిలుచుండి మాటాడుదును. నా బింక మంతయు సడలిపోవును. ఆమె కొడుకును బరిచారికల చేతి కిచ్చి పంపించుచు. నన్నంతి

పురికి రమ్మని యది యాజ్ఞ. తత్పూర్వము నేను నిశ్చయించు కొన్నను, నా నిశ్చయ మంతలో విశ్లథమై పోవును. ఆమె యెదుట నిలుచున్నప్పుడు ఆమె నాతోఁ బరిమితముగా మాటాడును. నే నామెను స్పృశింపనుగూడ స్పృశింపను. ఆమె నిలుచుటలో నామె చూచుటలో నేదో యొక దూరపు రేఖ యుండును. ఆ దూరపు రేఖ నన్ను సాహసింపనీయదు. ఏమిచేయుమందువు? పిల్లవాడు కలిగిన కొత్త దినములలో నామెకు నాకుఁ మఱలఁ బొసఁగ ననుకొంటిని. అది నిరాశాదాయిని యయ్యెను.

ఇదివరకుఁ బొగసుసడియున్న యీయనిప్పు నాటితో మఱల జ్వాలాముఖమయ్యెను. ఆ ప్రసంగము లేకున్నచో నెట్లుండెడిదో? సుద్రధారాదేవి యని కదిపెను. అది మండెను. ఈ మంట యొందభిముఖముగాఁ బోవునో! దాని యాభిముఖ్యము చివరకిట్లు పొడచూపెను. చక్రవర్తి యామెను నాఁడు బ్రాహ్మిశ్రీయింటికిఁ బోయెను. వచ్చిన యల్లుని నామె సరిగా యాదరించలేదు. చక్రవర్తికిఁ గారణము తెలియలేదు. చక్రవర్తి యామె నడిగెను. 'ఏమమ్మా! నామీద నంతకోపము'? ఆమె 'మైదేండ్లకాలముల నాయింటికి వచ్చితివి' యనెను. అంతలో షష్ఠిశ్రీ యచటికి వచ్చెను. ఆమె చిక్కి శల్యమైయుండెను. తొలినాటి నవనవలేదు. తొలినాటి నవనవలేదు. ఆమె చక్రవర్తిని చూచుమనే కంటనిండ నీళ్ళు నింపి తొలఁగిపోఁబోయెను. చక్రవర్తి యామెను గుర్తుపట్టలేదు. మదికి స్ఫురించినంతనే షష్ఠీ యని పిలిచెను. నాగేటి చాలువెంటఁబడి పోవు కోడెత్రాచు గిరుక్కున తిరిగినట్లు తిరిగి షష్ఠి, చురుబాకుతోఁ బొడిచినట్లు చూచి షష్ఠి, మఱలఁ దిరిగి రెండడుగులు వేసి షష్ఠి, మఱల లేచి వెనుదిరిగి యిట్లనెను. "ఓరి కితవుడ! ఎంతమంది కన్యాత్వ

ములు పాడు చేసితివి ? ఎంతమంది గుండెకాయలు పట్టి
నాశనము చేసితివి. పోరుగూడు కాదే. ఓహో, ఏమి చక్రవర్తి!
సింహళేశ మఱల మా యింటి కేల వచ్చితివి ? మొదటిసారి
నీ మొగము చూచిన పాప నైదేండ్లను నన్నుఁ బీడించెను.
చాలు చాలు నీ ముఖదర్శన మనెను. చక్రవర్తి నివ్వెఱ
పోయెను. సర్వమును స్మృతి పథమునఁ దగిలెను. తన దోష
మంజనపర్వతమునలెఁ బెరిగిపోయెను. నడచుచున్న పాదతల
ములతోఁ దా నామె వెంటఁబోయెను. ఆమె తత్సౌధపార్శ్వము
నందలి యుద్యానవనటీరమునఁ బోయి యచ్చటి యొక సెజ్జ
మీదఁ బన్నుండి మొగమును జేతులలో పెట్టుకొని దుఃఖించు
చుండెను. చక్రవర్తి పోయి యామె పాదములమీఁద వ్రాలెను.
'షష్ఠీ షష్ఠీ! ఈ దోషమంతయు నాదికాదు. కొంత నీ తలి
దండ్రులది. నేను క్రొత్తగా రాజ్యమునకు వచ్చినంతనే మఱల
నా సామంతులను నదుపులోనికిఁ దీసికొని రావలసి వచ్చినది.
బందుగులయ్యుఁ గదంబులు పెచ్చు పెరిగిరి. నీవు వినియే
యుందువు. ఈ నైదేండ్లలో నేను రాజధానియందున్నది సగా
నికి సగము. వచ్చుచుంటిని, పోవుచుంటిని. నా సుఖము
నాతండ్రి బ్రతికియున్నప్పుడు మాత్రమే. ఆయన సామ్రాజ్య
మును నిర్మించుట కెంత కష్టపడెనో నేను దానిని నిలబెట్టు
కొనుట కంత కష్టపడుచుంటిని. ఇప్పటికిఁ బ్రత్యర్థి సమూహ
మునకు వీరపురుషదత్తుని పరాక్రమము విదితమయ్యెను. నేను
నా తండ్రి సామ్రాజ్యమును నిలువ దొక్కుకొంటిని. నా
మనస్సు తీరిక యిచ్చినంతనే నీ వద్దకు వచ్చితిని. నిన్ను మఱచి
పోలేదు. కాని నాటి పరిస్థితి నిన్ను నాకుఁ బూర్తిగా నర్థము
కానియలేదు. నీ వెవరినో పరుని ప్రేమించితి వనుకొంటిని.

నీవు చెప్పలేదు, నాకుఁ దెలియలేదు. ఇది చెప్పెడి విషయము
కాదు. నేనే తెలిసికొనవలసినది. నేను మందమతిని. కృతఘ్నుఁ
డను మాత్రము కాదు. నీవు నన్ను క్షమించితి ననుము. అన
కున్నచో వాడిన పుష్పమాలికములవలె నున్న నీ యీ పాద
ములు వదలను. ఈనాఁడు నా కపోలములకు నీ హస్తస్పర్శ జరి
గెను. ఈనాఁడు నా మూర్ధమునకు నీపాదస్పర్శ జరుగనిమ్ము."

ఆ మఱునాఁడు షష్ఠీశ్రీకిని, చక్రవర్తికిని వివాహము
జరిగెను. ఆ వివాహమున నాడంబర మేమియు లేదు. ఉత్సవ
మంతయు షష్ఠీశ్రీవలెఁ జక్రవర్తి నాడుకొని కూర్చుండెను.
ఆ యుత్సవము చూచుటకు బంధుగు లెల్లను వచ్చిరి. ఎల్లరు
రాజులు వచ్చిరి. పట్టమహిషియు వచ్చెను. పట్టమహిషికి
షష్ఠీశ్రీవార్త యంతయుఁ దెలిసెను. ఆమె మౌనము వహించెను.
షష్ఠీశ్రీ చక్రవర్తితోఁ గలియుటకు నామె యారోగ్యము సరిగా
లేదు. కాని యామెకుఁ జక్రవర్తి నిజసౌధమందు నివాస
మేర్పఱచెను. పట్టమహిషి షష్ఠీశ్రీకిఁ దోడబుట్టిన దానివలె నుప
చరించెను. చక్రవర్తియుఁ బట్టమహిషియు, షష్ఠీశ్రీయు, యువ
రాజును, షష్ఠీశ్రీ కారోగ్యము ప్రాప్తించునంతవఱకైన కొన్ని నెలలు
చక్రవర్తి నిజసౌధనివాసము చేసిరి. ఆమె కారోగ్యము సమ
కూరిన తర్వాత చక్రవర్తి వివాహమహోత్సవము జరుగునాటికిఁ బట్ట
మహిషి మఱల గర్భవతి యని చెప్పుకొనసాగిరి. తరువాతఁ బట్ట
మహిషి తన సౌధమునకు దాను పోయెను. కొంచెము మూఁడు
నెలలు చక్రవర్తి షష్ఠీశ్రీతోనే యుండెను. క్రమ క్రమముగా
షష్ఠిశ్రీవలపు చక్రవర్తికి సన్నగిలసాగెను. ఈ సన్నగిల్లుట యధి
పులు నూతన ప్రియులగుట కాదు. ఏ వసంతవిలాసము చక్ర
వర్తి షష్ఠీశ్రీ వలన నభ్యర్థించెనో, యావిలాసము షష్ఠియందు

గొంటినదెను. పైగా షష్ఠికూడ గర్భవతి యయ్యె ననుట తెలి
సెను. షష్ఠి చక్రవర్తిని 'బావా' యని పిలువదు. చమత్కార
మునకైనం బే రుచ్చరించదు. భర్త వచ్చినంతనే లేచి నిలుచుం
డును. తక్కిన భార్యలే నయము. 'మీరు' అని మధ్యమ
పురుషప్రయోగమైనం జెయ్యరు. ఈమె యెప్పుడును ప్రథమ
పురుషమే! చక్రవర్తి పలుమాఱు షష్ఠిని బ్రతిమాలి యడిగెను.
'నేను నిన్నుం జేసికొన్న దిందుకా? నేను నిన్నొకనియమమును
మీఁదంగదా చేసికొన్నది. ఆ నియమము నీవు పాటించుటలేదు'
అని. అయినను గట్టిగా షష్ఠి తెల్లమొగము వేసి చూచును. ఒక
సారి చక్రవర్తి బలవంతపెట్టి 'బావా' యని పిలిపించు
కొనెను. ఆమె యట్లు పిలిచి దుఃఖింప నారంభించెను. చక్ర
వర్తి కర్థము కాలేదు. ఇందులోని రహస్య మేమో తనకుం
దెలియదు. ఈపొడుపుకథ విప్పి చెప్పగలవారు కనుపించలేదు.
ఈ పొడుపుకథ నెవరికి వేయవలెను? చక్రవర్తి హృదయ
శాంతివఱకు భట్టిదేవివద్దకుం బోయెను. ఆ భట్టిదేవి నిన్నటి
వఱకుం దన కనుకూలురాలు. ఈ రెండు నెలలలో మఱలం
దొల్లింటిభట్టిదేవి యయ్యెను. ఆమె దూరముగా నిలుచుండి
మాటాడును. ఆమెయందు భార్యాత్వము పోయి పట్టమహిషీ
త్వము ప్రాప్తించెను. చంద్రభాగతోం జెప్పుటకు వీలులేదు. ఆమె
యందు తౌత్రిపుల యహంకారము కలదు. ఏ కొంచెమో
సపత్నీమాత్సర్యము కలదు. షష్ఠిని పెండ్లిచేసికొనుటయే
యామె కిష్టములేనట్లు కనిపించెను. షష్ఠిసరిసంగము సావిత్రి
దగ్గర తెచ్చుటకు వీలులేదు. ఆమె చక్రవర్తిపైం దనకుగల కోప
మంతయు షష్ఠిమీఁద పెట్టి యేవో యేవో యనును. మిగిలినది
శాంతిశ్రీ. ఆమె యింటికిం బోయియే మూఁడేండ్లయినది. ఒక

నాఁడు చక్రవర్తి యామె యింటికిఁ బోయెను. పోవుచు శాంతికి
దనమీఁదఁ గోపము వచ్చియుండు ననుకొనెను. చక్రవర్తిని
జూచినంతనే శాంతిశ్రీ తానువచ్చి పరిచర్యచేసెను.ఆమెకుఁజక్ర
వర్తినిజూచి నాలుగేండ్లయినట్లేలేదుకాబోలు! చక్రవర్తి యీామె
కూడఁ దనకొకభార్యయా యనుకొనెను. శాంతి వీరపురుష
దత్తునితో 'షష్ఠి సుఖమా? షష్ఠి నీమనస్సున నున్న సర్వ చాం
చల్యమునకు వినోదము సమకూర్చుచున్నదా?' యని యడిగెను.
చక్రవర్తి మనస్సులో నప్పుడున్న విచారము శాంతిశ్రీ ప్రశ్న
లోని యర్థము గ్రహింపనీయలేదు. ఆయన యిట్లనెను. "నాకు
షష్ఠి యొక సమస్యగా నున్నది. ఈ సమస్యకు సమాధాన
మును జెప్పువా రెవ్వరును గనిపించలేదు. నీవే చెప్పగల
దానవు. పెద్దతగారి వివేక మంతయు నీయందే కలదు.
ఏ వీ పొడుపుకథ విప్పెద వని నీవద్దకు వచ్చితిని" అని
మైదేండ్ల కథయుఁ బూసగ్రుచ్చినట్లామెకు నివేదించెను. శాంతి
యాలోచించి యిట్లనెను. 'అది యప్పుడు పసిపిల్ల. దానికి నీవు
మేనమామకొడుకువేగాని, చక్రవర్తి యగుటలోని యర్థ మది
గ్రహించలేదు. దాని యప్పగార లిద్దఱును బెండ్లియాడిన నీవు
వివేకములేని దానిమనసులో, నిరూపింపబడరాని దానియావన
భావములో భావమై, మధురమోహనమూర్తి వైతివి. ఆ
మధురమోహనమూర్తిత్వ స్వభావము దానికిఁ దెలియదు.
అది విచారించి యేర్పఱచుకొన్న మూర్తికాదు. అక్కగారల
యందుఁ దనకుగల ప్రేమలోనుండి యావిర్భవించిన యొక పసి
భావము. దానిని నీవు బలవచ్చుంబనాదులచేత విస్ఫుటము
చేసి యావిస్ఫుటత్వమునందు నీముద్రను సమకూర్చుకొన్నావు.
అప్పటికి దానికి నీయందు వట్టి ప్రేమోభావము అర్థవికసితమై

యవిస్పష్టమైన యౌవనప్రేరకమైన యొక మధురభావము. అప్పుడు నీవు దానిని వెంటనే స్వీకరించినచో, స్వీకరించి యాభావమును బొదిగి బెసికిపోకుండ బరిపోషించినచో నీ కోర్కె తీరెడిది. నీకు షష్ఠిమీద నిజమైన ప్రేమలేదు. దాని విలాసముమీద, బాల్యచేష్టలమీద, వానివలనఁ గలుగు మనోవికాసమునకు నీవు లుబ్ధుడ వయితివి. మఱల నైదేండ్లు దాని వంకనే చూడలేదు. తేనెపట్టు కదిపి వదలిపెట్టినచోఁ దేంట్లు చెల్లాచెదరైనను మధుస్యందము జరుగుచునే యుండును. నీ వామెకు సులభుడవు కాకపోయితివి. నీవు సులభుడవు కాకపోవుటలో నామె నీయం దధికగుణాపాదన చేసెను. క్రమక్రమముగా దానిమదిలో నీవు మనోహరుఁడ వైతివి. నాథుఁడ వైతివి, చక్రవర్తివైతివి. అసులభుఁడవైతివి. దైవమ వైతివి. ఈ పరిణామదశలలోఁ బూర్వపూర్వదశలయం దామెను స్వీకరించినను, నామె కొంత వెనుదిరిగి నీకడకు వచ్చెడిది. నీవు దైవమ వైనంతనే యామె భక్తురాలైనది. ఆమెయందు శృంగారరసమే చచ్చిపోయినది. స్త్రీభావమిశ్రితమై దాసభావముతో మాత్రమే మిగిలిన భక్తురాలితనము స్థిరపడిననాఁటి యామెను నీవు పెండ్లాడితివి' యనెను. చక్రవర్తి పర్యాలోచించెను. 'శాంతి నీ వింతటి వివేకవతివి. ఇంత యాలోచన నీ వెట్లు చేయగలుగదు' వనెను. శాంతి: ఎవరి మనస్సునకు నిల్కడ లేదో వా రాలోచన చేయలేరు. ఎవరిమనస్సునందు వాంఛ గగ్గోలు పెట్టునో వారి కాలోచన కుదరదు. ఎవరి హృదయము భిన్నాశలు కలవరపెట్టి యుద్వేగపఱచునో వారు సూటిగా

నాలోచింపలేదు. చక్ర: నీకేవేమియు లేవందువా? శాంతి: లేవు. చక్ర: ఎందుచేత? శాంతి: అది రహస్యము. చక్ర: నాతోఁగూడఁ జెప్పరాని రహస్యమా? శాంతి: నీవు నాకు భర్తవు. చక్రవర్తివి. భర్తకంటె జక్రవర్తికంటె నధికుడైన వానిరహస్యము భర్తకుఁ జక్రవర్తికిఁ జెప్పరాదు. చక్ర: నీకు నాకన్న నధికుఁ డుండెనన్నమాట. ఇది నాకుఁ గోపము రాదగిన మాటకాదా? శాంతి: కోపము పరిహరింపఁదగినమాట. చక్ర: కోపము తెప్పించుమాట కోపము నెట్లు పరిహరింపఁజేయును? శాంతి: ఆ మాట చిన్నమాటలో నున్నది. నేను జెప్పునది మాటకాదు. అది అనుభవవిశేషము. ఆ యనుభవమునందుఁ గోపము మొదలైన సర్వదోషములును నిష్కా-సితములగును. చక్ర: అయినచో నా కదియేదో చెప్పుము. శాంతి: నిజముగా నీ కా యనుభవము కావలసినచో నేను నీ కా యనుభవము దెలుపను. తెలుపఁదగినవారు వేఱే యున్నారు. చక్ర: వా రెవరో చెప్పుము. నేను వారివద్దకే పోయి వేడెదను. శాంతి: వారివద్దకుఁ బోవునపుడు నేను జక్రవర్తి ననుకొని, నేను క్షత్రియుడ ననుకొని, నేను వర్ణాశ్రమధర్మపరిపాలకుఁడ ననుకొని పోరాదు. నీయందున్న సర్వమైన అహంత్వము చంపుకొని పోవలెను. చక్ర: ఎవరా మహాపురుషుఁడు? శాంతి: అతఁ డెవరైననేమి? మహర్షి నీకొఱ కెట్లు పరితపించెనో, నీ వట్లే యతనికొఱకుఁ బరితపించినచో మహర్షికి నీవు ప్రాప్తించినట్లే నీకతఁడు ప్రాప్తించును. చక్ర: ఓసీ శాంతి! నా యెడందను తపన హెచ్చించుచుంటివి. అతఁడెవఁడో చెప్పుము. నేను నిజానకు మహర్షిశ్రీ విర

హానిగాను. పుత్రకాంతాప్రియుఁడనుగాను. భాక్తిశ్రీ కాముకుఁడను గాను. నిన్ను భాగ్యశాలిని యనుకొనువాఁడను గాను. నేను నిజానకు భట్టిదేవి విరహిణిని. నా యీ విరహమునకు నవధిలేదు. భట్టిదేవి నన్నుఁ దృణీకరించెను. తృణీకరించుచున్నది. యుగయుగములు నన్నుఁ దృణీకరించును. ఈ తృణీకారమును నేనోర్వలేకున్నాను. నాజన్మ సందిగ్ధమైనది. ఈ సందేహము నన్ను వదలి పోవుట్లు లేదు. నా రక్తమునందు మేలుకొని కూర్చున్నది. శాంతిమూలచక్రవర్తి సామ్రాజ్యమునకు నేను నిజముగా నధికారిని గాను. ఇప్పుడు నే నొక యనికృతుఁడను. నాకీ రహస్యము విప్పి చెప్పవారెవరును లేకున్నారు. ఈ రహస్య వ్యూహమును బన్నిన దెవరో కూడఁ దెలియరాకున్నది. ఈ రహస్యపు ముడి విడినఁగాని నా ప్రాణమునకు తృప్తి లేదు. ఈ రహస్యగోపనమే నన్ను బాధపెట్టుచున్నది. అదియే నాకు భట్టిదేవివిరహముగా గనిపించుచున్నది. నేను షష్ఠియంత పరితపించితిని. అంతకన్న నెక్కువ పరితపించితిని. నీ వా పురుషుని నాకుఁ జూపించినచో నేను వెంటనే యతనిని నాథునిగా స్వీకరింతును. నా మాటలోని యాథార్థ్యము నీవే చూడగలవు. చెప్పుము, చెప్పు" మనెను. శాంతి: నేను జెప్పలేను. చెప్పగల వానిని జూపించఁ గలుగుదును. చక్రి: అతనినే చూపింపుము. శాం: నాది తప్పులేదు. తరువాత నన్ననవద్దు. నీ యొత్తిడి కాగలేక చూపించుచున్నాను. ఆయన భదంతాచార్యుఁడు. ఆయనయే నీకు నీ విరహము పోఁగించు మహానుభూతిమార్గ మును జెప్పగలఁడు.

# షష్ఠాధ్యాయము

ఇంతకును నీమనోవేదనకుఁ గారణమేమని? నీవు క్షత్రియుడవు కావనియా? నీవు క్షత్రియుఁడవు కావని దేశములో వేఁగుచుండి యనుచున్నారు. నీవెవ్వరిని బరిగణించినట్లు లేదే. నీభార్య భట్టిదేవి యనుచున్నదా? ఆమె మాటయే పరిగణింతువా? నాతో నీవు దేశములో నింతమంది మాటలు పరిగణించవే యందువు. ఆమె యొక్క మాటనే పరిగణింతువందువు ఓయీ! అంతఃపురమాటను బరిగణించుచుంటివి. ఈ పరిగణించుట నీకు లెక్కగాలేదు. ఈ సర్వనిందా స్వరూపము నీ ప్రేమస్థానమైన భట్టిదేవియందుఁ బ్రతిఫలించి యామె మాటను మాత్రమే పరిగణించుచున్నట్లు కనిపించుచున్నది. ఆమెను నీవు శిక్షించుటకు నీ కిష్టము లేదు. నీయం దిట్టి భావము కల ప్రజానీకమును శిక్షించుటకు నీ కిష్టము లేదు. ఇది యిక్ష్వాకుల మనోభావము. మీకల్పితమైన రామాయణమునందలి రాములేమిచేసెను? ఒక జఘన్యజాని మాటనొప్పున తన భార్యయైన సీతను వనములో దించెను. ఆకల్పన నట్లు చేసికొనిరి. అదియొక ధర్మముగా నిలబెట్టిరి. దాని ననుసరించి యధర్మవర్తనులైరి. నీకీ మనోభావ మిక్ష్వాకుల వంశమునందలి పెంపకము వలన వచ్చినది. మనోభావములకు జన్మ హేతువని మీ వారందురు. పెంపకమే హేతువని మేమందుము. మా వాదనకు నీవు ప్రబల సాక్ష్యము. భట్టిదేవికి నీ యందుఁ బ్రేమ లేదందువు. ప్రేమలేని స్త్రీ నీయం దిద్దరు సంతానము నెట్లు కనెను. మహారాణియొక్క చారుశీలము సర్వవిదితము. ప్రేమ లేని శీల మెచ్చటినుండి వచ్చును? నీ జన్మవిషయమైన

సంశయ మామె హృదయగ్రంథియందున్న యెడలఁ దాదృశ
మైన యువతికి నీయందట్టి ప్రేమ యేలయుండును. ఆమెకు నీ
జన్మ విషయమునందు సంశయములేదు. ఆమెకు లేని సందే
హము నీ వామెయం దారోపించుచున్నావు. మఱియొకచోటి
గుణముకదా మఱియొకచో నారోపింతుము. స్త్రీజాసమూహ
మందున్న దీ గుణము. ప్రజాపసమూహమున దీ గుణ మెందు
కున్నది? ఇది యొక మనోభావము. ఈ భావ మిట్లుండుటకుఁ
గారణ మేమి? ఈ జన్మము దేనియున్నది? అనేకజీవు లనేక
క్షేత్రములయందు జన్మించుచున్నారు. ఇది ప్రకృతి. ఇది
యథేచ్ఛముగా జరుగుచున్నది. సర్వజనులయందుఁ జైతన్య
మున్నది. క్షుత్పిపాసాదు లందఱకు సమానము దుఃఖమందఱు
ననుభవించుచున్నారు. ఇచ్చట నొకఁడు క్షత్రియుడని, ఒకడు
బ్రాహ్మణుఁడని, మఱియొక డింకొకఁడని చేసిన కల్పన స్వార్థ
హిత కల్పన. ఈ కల్పనవలన జరిగిన నష్టమేమన యథార్థమైన
సర్వసహజమైన సమానత్వముపోయి వర్ణములనుబట్టి యొక
డధికుఁడు, నొకడు నీచుఁడు నగుచున్నాడు. ఈ యధికతా
నీచతలు నీచవర్ణ ప్రతారణకు హేతుభూత మగుచున్నది.
ఈ కల్పన నంతయు నెవరు చేసిరి? ఈ కల్పనల నను
సరించి వచ్చెడి మనోభావములకు, నా మనోభావము కలి
గినవా రెంతవరకు హేతుభూతులు? కల్పన చేసినవా రెంత
వఱకు హేతుభూతులు? ఒకఁడు క్షత్రియుఁడని. మఱియొకఁడు
బ్రాహ్మణుఁడని యెచ్చట వ్రాసియున్నది? ఈ కల్పనాభేదము
మనస్సులందుఁ దగుల్కొని యెంతమంది జీవులు బాధపడు
చున్నారు? ఈ బాధ చమత్కారముగా నున్నది. ఒకఁడు
తానొక్కతక్కువకులమునందు పుట్టితినని పడు బాధ వేఱు. ఎక్కువ

ధర్మము మఱియొక యధమధర్మముచేతఁ బ్రతారింపఁబడినప్పుడు మనసున కెట్టికష్టము కలిగించునో!" ఇట్లు భదంతాచార్యు డుపన్యసించు చుండ వీరపురుషదత్తమహారాజు మౌనియై యాయన కెదురుగాఁ గృష్ణాజినముమీఁదఁ గూర్చొని యుండెను. మహారా జిట్లనెను: "ఆచార్యా! ఈ యుపన్యాసమువలన నా కేమి ప్రయోజనము? మీ మాటలు నా మనస్సున కధిక వేదనాపాదులయ్యెనే కాని వేదనానిర్మూలనకారు లగుటలేదు."

భదంతుడు: మహారాజా! నీమనోవేదన నపనయింపవలెనని ప్రారంభించితిని. నా మనోవేదన వెలికి వచ్చెను. క్షమింపుము. మహా: ఆచార్యా! క్షమింపవలసినది నేనా? సర్వలోకమును క్షమింపవలసినది మీరు. భదం: మహారాజా! ఈలోకము క్షమార్హముకాదు. మహా: ప్రభూ! ఈలోకమును క్షమింపక యేమిచేయుదురు. భదం: మహారాజా! నీ కిక్ష్వాకుల మనోభావములు పట్టుబడినవి. అవి నీయందు జీర్ణించినవి. ఇంకను నాకుఁ జిత్రముగానున్నది. ఊరక నీ మనస్సేల యింత యారాటపడుచున్నది? మహా: ఆచార్యా! మఱికొంత వివరించి చెప్పవలయును. భదం: లోకమును క్షమింపక యేమి చేయవలయు నందువు. ఇది యిక్ష్వాకుల మనోభావము. నీ కా భావము సరిపోయినది. నీవు బుద్ధికి ఇక్ష్వాకుఁడవైనావు. ఇఁక నీ జన్మను గూర్చిన సందేహము నీ కెందుకు? క్షత్రియుఁడను మాత్రమే యైతిని, బ్రాహ్మణుఁడను కాలేదన్న యాశయా? జన్మరహస్యము తెలియనందున మఱి యేతక్కువ వర్ణస్థుఁడనో యన్న దిగులా? ఈ రెండుభావములలో నేది యున్నను నీ మనస్సునకు శాంతి లేదు. వర్ణములో నేమి యున్నది. అది కల్పితము. ఒక వర్ణమునకుఁ జెందితి నన్న యూహ పెట్టుకొన్నచో నది యహంకారము.

ఇంకొక తక్కువ వర్ణములోఁ బుట్టితి నన్న దిగులు పెట్టుకొన్నచో నది దుఃఖము. ఈ వికారములన్నియు నీ వర్ణవ్యవస్థాజనితములు. దుఃఖములు. శాంతిభావ పరాస్కందులు. ఈదుఃఖము పెడద్రొక్కవలయు నన్నచో నీ వర్ణవ్యవస్థ నిరాదరింపనలయును. లేనిదానిని నిరాదరించుట సులభము. నీ మనస్సునకు శాంతి యెట్లు చేకూరవలయును? అన్యమార్గముచేతఁ జేకూరదు. మహా: ఆచార్యా! సరియైన నభ్యాసము చేతఁగాని ప్రాప్తించదు. నేను పాతికయేండ్లు మనోభావములతోఁ బెరిగితిని. మఱి యెన్ని యేండ్లయినఁగావలయునుగదా యీ భావముపశమించుటకు? ఈలోపుగా నాకు మనశ్శాంతి యెట్లు? భదం: మహారాజా! బుద్ధుని శరణు పొందుము. ధర్మమును శరణు పొందుము. మఱి నే నేమి చెప్పుదును? వలచినచో బౌద్ధధర్మ మిత్తును. మహా: ఆచార్యా! నందునివలె నాకు బలవంతపు బౌద్ధము వద్దు. ఆ ధర్మము, దానినుండి వచ్చినశాంతి, నాకుఁ బ్రధానములు కాని ముండనాదులవలన నాకుఁ బ్రయోజనము లేదు. భదం: మహారాజా! నీ మనోమార్గము మిగుల రమ్యముగా నున్నది. అట్లే యభ్యాసము చేయుము. నేను సెలవు దీసికొందును. మహా: ఆచార్యా! నన్ను వదలిపోకుము. మీ సన్నిధానమునందు నా మనస్సున కేదో శిశిరలేపము పూసి నట్లున్నది. భదం: మహారాజా! నేను లేనప్పుడు నీవు నీభార్యయైన శాంతిశ్రీ నవలంబింపుము. ఆమెయును నీకు శాంతిఁ జేకూర్పఁగలదు. ఆమెయేగదా నిన్ను నావద్దకుఁ దెచ్చినది?

మహారాజు భదంతుల బంపించుటకుఁ బ్రథమసింహద్వారమువఱకు వెంటనే నడచిపోయెను. భదంతుఁడు రాచనగరునఁ బ్రవేశించుట కిదియే మొదటిసారి. ఆచార్యుఁడు లోనికి

వచ్చినప్పు డెట్లో, మఱలఁ బోవుచున్నప్పుడు నట్లే దాసాదికు లందఱును మొగములు జూచుకొనిరి.

మహారాజు వినమితాధోముఖుఁడై యెవ్వరి నంకను జూడలేదు. ఆయన భట్టిదేవి గృహాభిముఖముగా నడచి పోయెను. మహారాజు వచ్చినాఁ డన్నంతనే వాసిష్ఠి భట్టిదేవి యెదురుగా వచ్చి భర్త కుపచారములు చేసెను. ఆమె పూర్ణ గర్భిణి, తాను నిలుచుండలేక భర్తను గూర్చుండు మనియెను. రాజు న్యగ్రీవుఁడై యిట్లనెను. 'పట్టమహిషీ! వర్ణవ్యవస్థ మిక్కిలి చెడ్డది. ఒకఁడు బ్రాహ్మణుఁడేమి? మఱియొకఁడు క్షత్రియుఁడేమి? సుఖదుఃఖములయందు సర్వజనులును సమానులు. నేను క్షత్రియుఁడను గాకపోదును. కాకపోయిన నేమి? అయిన నధిక మేమి, కాక యల్ప మేమి? ఇదియంతయు లోకము కల్పించినది. ఈ కల్పనలోఁ దగుల్కొని దుఃఖించుట యెందు లకు? నీ వీ కల్పనావ్యూహములోఁ బ్రథమ సూత్రమవు. మహారాణి: ప్రభూ! ఏమి యీవాక్యోపన్యాసము? నేనీ ప్రసక్తి తమ వద్ద నెప్పుడును దేలేదు. చక్రవర్తులు తమరు పాలించి నట్లు లోకములు నడచును. చక్రవర్తులు తమ రీ వర్ణవ్యవస్థ యుండవలె నన్నచో నుండును. పోవలయు నన్నచోఁ బోవును. మీరు నేను మహారాణినన్నచో నగుదును. కాదన్నచోఁ గాదు. లోకము మిమ్ముఁ బ్రతిఘటించలేదు. లోకమును జక్రవర్తులు యథేష్టముగాఁ జేయవలంతులు.'

మహారాజు వెంటనే వెనుదిరిగిపోయెను. పోయి శాంతిశ్రీ యింటికిఁ బోయెను. శాంతిశ్రీ శిరోజసంస్కారము చేసికొను చుండెను. ఆమె తన శిరోభారము బౌద్ధస్త్రీలు ముడుచుకొను నట్లు ముడుచుకొనుచుండెను, మోమునఁ దిలకములేదు. చీర

గూడకట్లు కట్టి కొంగు పయ్యెదగాఁ గాక కుచ్చెళ్ళలోనుండి వక్షఃస్థల మెంత వెడల్పో యంత వెడల్పుగా, పైకిఁ దీసి, యొక వైపునుండి మెడమీఁదికి లాగి మఱియొక వైపునుండి తీసి వక్షము మీఁదికిఁ గప్పి కొంగు కుచ్చెళ్ళలోఁ గుచ్చెళ్ళంత వెడల్పుగా విరియించి దూర్చెను. సిగముడి నడినెత్తిన కుదురువలెఁ బెట్టెను. ఆ కుదురులో నడుమ నొక పద్మకేసరపీఠమువలె నుండెను. ముఖము ముందరిభాగమునఁ దలమీఁద మూఁడువేళ్ళ వెడల్పంత మేఱఁ బాపటతీసి యుండెను. ఆ మాత్రపు సీమంతయు రెండుచెవులమీఁద నున్నది. ముచ్చెలిగుంటలోఁగూడ నున్నది. ముఖమునకుఁ బుప్పొడి యద్దెను. ఆమె యీ శృంగారమంతయు చేసికొన్నంతసేపు రాజచ్చటనే నిలుచుండెను. ఆమెయు నెదురుగా నున్న యద్దములో రాజును జూచుచునే యుండెను. శృంగారమంతయు నైనతరువాత నామె రాజువంకకుఁ దిరిగెను. రాజు: శాంతీ! నీవే యెక్కువ శాంతిహేతువవు. భదంతాచార్యుఁడు కాఁడు. శాంతి: అయ్యయ్యో! ఇది యేమిమాట ? రాజు: ఆయన వర్ణవ్యవస్థ కల్పన యన్నాఁడు. నాకుఁ గల్పనగాఁ గనిపించలేదు. కల్పన యగుటయుఁ గాకపోవుటయు వాదన చేతనే నిర్ధారణ మైనచో నట్లే కావచ్చును. ఆయన వాదించి చూపించెను. నా మనస్సునకీ బాధ వదలలేదు. నా హృదయములో నీ యిక్కట్టు తొలఁగలేదు. వర్ణవ్యవస్థ నిజముగా లేనిచో నా యెడంద కింత బెడఁద యెందులకు ? పట్టమహిషి యేమి చెప్పెనో తెలియునా ? వర్ణవ్యవస్థ నేనున్న దన్నచో నున్నది. లేదన్నచో లేదని. శాంతి: మహారాజా! నీ మనసు! దీనిమీఁద నింతలగ్న మేలఁ గావలయును ? మహ: శాంతీ నీ యీ వేస మేమియు బాగుగాలేదు. ఈ బౌద్ధభిక్షుకురాలి

తనము ప్రాణసుఖ హేతువై కనిపించుటలేదు. నీ సంతరించిన నేపథ్యములో మన్మథుని కండించు సౌందర్యరేఖయుఁ గనిపించదు. స్త్రీ స్త్రీమాత్రముగా నున్నచో నేమి లాభము? వేష ముద్దీపకముగా నుండవలయును. శాంతి: ప్రభూ! నీవు నన్నుఁ గామించినది లేదు. నా వేష మెట్లున్న నీ కేమి? రాజు: అది సరేకాని భట్టిదేవి యట్లనిన నేమి? ఈ వర్ణవ్యవస్థ నే నున్నదన్నచో నున్నదా? లే దన్నచో లేదా? శాంతి: ఆ సంగతి నాకన్న భట్టిదేవికే తెలియును. రాజు: శాంతీ! నేను భట్టిదేవివిరహిని. భట్టిదేవి నా చేత నేమి చేయింపునో? నా యీ యనుమానము భట్టిదేవి పోషించుచున్నది. ఆమె దీనిని సంభవింపఁజేసినది, దీని నామె తక్క మఱెవ్వరును సంహరింపలేరు. శాంతి: మహారాజా! నిన్ను నిజముగాఁ గాదన్న దెవ్వరు? నీ కీ యులుకెందుకు? నిన్నేమి బాధించుచున్నది? ఈ బాధ యెచటనుండి పుట్టినది? ఈకల్పన యంతయు నీవు చేసికొన్నది కాదా? రాజు: శాంతి! నీవుకూడ నట్లనే యనెదవా? ఇది నేను జేసికొనినదా? నేను క్షత్రియుడను గానను దుష్ప్రతీతి నేను బుట్టించితినా? నేను బుద్ధి నెఱుఁగునాటికే యీప్రతీతి వ్యాపించియున్నదే! నాతల్లి యొక్కసారి కాకపోయిన మఱియొక్కసారియైన బిలచి 'నాయనా! నీవు నాగర్భవాసమవు, ఈ దుష్ప్రతీతికిఁ గాళ్ళులేవు. చేతులు లేవు, తల లేదు అని చెప్పినదా? మీయమ్మగారైన శాంతిశ్రీదేవి యీమహాతంత్రమున కంతయు మూలమని చెప్పెదరు. ఈ నాటివఱకు నే నామె చేతిలోఁ గీలుబొమ్మను. నే నామెతో నెన్నిసారులు మాటాడినను నీ ప్రసక్తి వచ్చువఱకు గోడమీది పిల్లి వాటముగాఁ బ్రసంగించునే కాని విస్పష్టముగాఁ జెప్పదే, వెనుక

నెప్పుడో యొక్కసారి మాతండ్రి పోయినపు డొకానొక స్త్రీయు, మీ యప్సరసలు గలసి నాయొద్దకు వచ్చిరి. ఆస్త్రీ నన్ను మహారాజునుగాఁ జూడలేదు. తన కడుపునఁ బుట్టిన బిడ్డనుగాఁ జూచెను. ఆమె నాతో మాటాడలేదు. ఆమెకోసము నేను వెదకితిని. మేనత్తగారుకూడ వెదకెను. ఇంతలోఁ గనుపించలేదు. ఆమె యెవరు? నాయొద్ద కేల తీసికొనివచ్చితి వని శాంతిశ్రీ దేవిగారిని వందనపూర్వక మడిగితిని. ఆమె నిన్నుఁ జూడవలె నన్నది. ఏదోకారణముచేత నామెను నీకుఁ జూపించక తప్పదని యన్నదేకాని యాకారణమేమో చెప్పలేదు. ఆ కారణమేమో నేను జెప్పఁగలనా? ఆమె నా తల్లి. శాంతి: అయినచో మీ తండ్రి యెవరు? రాజు: ఆమె నడుగవలయును. శాంతి: మఱి యేల యడుగలేదు. రాజు: అరే! ఆమె నిలచిన దెక్కడ? ఆకాశమున హఠాత్తుగా మెఱసి వెంటనే యదృశ్యమగు నొక యప్సరస్త్రీరూపమువలెఁ బోయెను. శాంతి: మీ రామెను జూచితిరికదా? ఆమె యుత్తమకుల సంజాతవలెఁ గన్పించెనా? రాజు: శాంతీ! ఆ నాటికి నా తండ్రిగారు పోయి పదుమూఁడో పదునాల్గో దినములు. నేను మహాదుఃఖాంభోరాశిలో మునిగి యున్నాను. ఆమెవంక సరిగాఁ జూడలేదు. అయినను నుత్తమకుల సంజాతి కానిచో నొక యప్సరసవలె నేలఁ గన్పించును? శాంతి: అయినచో మీ కీ విచారమెందుకు? మీరు సత్కులమునందే పుట్టినారు. రాజు: ఓసీ! యదికాదు. నాతండ్రి యెవరు? శాంతి: మహారాజా! అప్సరసలకు, రాజర్షులకు సంబంధము. ఇవియు మీ పురాణకథలే. రాజు: శాంతీ! నీవు బౌద్ధురాలవా? మా పురాణములు నీవి కావా? నాతల్లి యనుకొను స్త్రీనిగుఱించి నీకీ యెకసక్కెములా? శాంతి: మహారాజా! క్షమిం

పుము. క్షమింపుము. నా యుద్దేశ్యమదికాదు. మీరు మాతృదేవిగర్భమున నుదయించిన శాంతిమూలమహారాజతేజము. ఈ యనుమానము మీ కేలకలిగెనో బుద్ధదేవునకుఁ దెలియవలయును. రాజు: నన్ను మఱులఁ గన్నుగప్పెదవా? శాంతి: కన్ను కప్పుట కాదు. యథార్థమైన నా విశ్వాసమునే చెప్పుచున్నాను. రాజు: నిజముగా విశ్వసించెదవా? శాంతి: నిజముగా విశ్వసించెదను. శాంతిమూల మహారాజునకును నాకును రూపమునందించుకయు భేదములేదు. నే నిట్టి పోలికనుబట్టి పితృపుత్రభావమును సంపూర్ణముగా విశ్వసించుదాన. నేనే కాదు, మఱెవ్వరైన విశ్వసింతురు.

మహారాజు మఱుమాట లేకుండ భట్టిదేవిసౌధాభిముఖముగాఁ బోయెను. భట్టిదేవి స్నానముచేసి, శుద్ధవస్త్రము ధరించి దేవీపూజ చేయుచుండెను. ఆమెప్రక్కన బాహుబలశాంతిమూలుఁడు, తనకొడుకు భాషిపెట్టువేసికొని చేతులుజోడించుకొని కూర్చొని యుండెను. మహారాజు రాకఁజూచి కొడుకు లేవఁబోయెను. తల్లి కదలవద్దన్నట్లు కనుసన్నచేసెను. బాహుబలుఁడు తల్లి సంజ్ఞ పరిగణింపక తండ్రివద్దకుఁ బోయెను. తండ్రి కొడుకునెత్తికొని యెదురుగానున్న నిలువుటద్దమువద్దకుఁ బోయి యట్లే నిలుచుండెను. భట్టిదేవి పూజానంతరము, వారిదగ్గరకుఁ బోయి నిలుచుండెను. రాజు: మహారాణీ! రాణి: ఏమి మహారాజా! రాజు: ఈ నా కొడుకునకును, నాకును రూపములో నేమైన భేదమున్నదా? రాణి: తండ్రికొడుకుల మధ్య నేల యుండును! ఏమియును లేదు. మహారాజు: అయినచో నీవు నావెంట రమ్ము అని కొడుకును జంకను దింపకయే తన సౌధమువంక నడచెను. మహారాజు కొడుకు నెత్తికొని

నడచుట, మహారాణి వెంటనే నడచి వచ్చుచుండుట- ఈ నడచుట పట్టపుమహిషి సౌధమునుండి మహారాజు సౌధమువఱకు ఇది పూర్వ మెప్పుడును జరుగలేదు. పరిచారిక లంతఃపుర వాసులు విస్మయపోయి చూచుచుండిరి. మహారాజసౌధములో ముంగలి చావడిలో శాంతిమూలచక్రవర్తి శిలావిగ్రహ ముండెను. ఆ విగ్రహమునకు శరీర వస్త్రాదివర్ణములు వేయఁ బడి యుండెను. మహారాజు శిలాప్రతిమకుఁ బ్రక్కగా నిలు చుండెను. భక్తిదేవి యామూర్తి కెదురుగానిలుచుండెను. మహా రాజిట్లడిగెను. "మహారాణీ! ఈ శాంతిమూలచక్రవర్తి ప్రతిమ యొక్క రూపమునకును, నీ కుమారుఁడైన బాహుబలశాంతి మూలుని రూపమునకును భేద మేమైనఁ గలదా?" రాణి: ప్రభూ! ఏమియును లేదు. రాజు: మేము మువ్వురము నొకరి నొకరు పోలియుందు మంటివా? రాణి: పోలికలు నిస్సందేహముగా నున్నవి. రాజు: ఆయన శాంతిమూలుఁడు. వీఁడు వీరపురుషదత్తుఁడు. ఇతఁడు బాహుబలుఁడు. బాహుబలుడు వీరపురుషదత్తునినుండి వచ్చినవాఁడు. ఈ విషయమున నీ కేమైన సందేహమున్నదా? రాణి: ప్రభూ! తమరి కేమైన సందేహమున్నదా? రాజు: నా విశ్వాసములోఁ బ్రసక్తి లేదు. ఇపుడు నీ విశ్వాసములోని ప్రసక్తి. రాణి: నాకేమియు సందే హము లేదు. నాకుఁ బరమమైన ప్రత్యక్షవిషయము. నా యను భవవిషయము. నా ప్రాణములోఁ గూడిన యాథార్థ్యవిష యము. నాకు సందేహ మెట్లుండును? ఇది నే నూహించి చెప్పునది కాదు. వీర పురుషదత్తునినుండి బాహుబలుఁ డావిర్భవించెను.

మహారాజు రెండు గడియలపాటు నిశ్శబ్దుడై నిలచి పోయెను. తుదకు దీర్ఘ నిశ్శ్వాసమును వదలెను. వదలి కనులు మూసికొని 'మహారాణీ! పద! నీ సౌధములో నిన్ను దిగవిడచి వచ్చెద' నని ముందు దారితీసెను. పట్టమహిషి వెంటనే నడచు చుండెను. మహారాజు నడచుచున్న కదలికలో ప్రతిచలన రేఖయుఁ గోపమునే సూచించుచుండెను. ఆ కోపమంతయుఁ దన మీఁద నేల చూపించలేదు. తాను జేసిన తప్పేమి? తన్నీ ప్రశ్నలేల యడుగవలయును? మఱి యా ప్రశ్న నేల యడుగలేదు. ఆ ప్రశ్న నాతఁ డడిగినచో తాను జెప్పెడు సమాధానము మహారాజునకు సర్వసంశయ విచ్ఛేదకరముగా నుండెడిదే. తనయందున్న సర్వదోషనిష్కాసన హేతువుగా నుండెడిదే!

నీరపుగనసత్తుఁడు మహారాణి గృహములయందుఁ దల్లి కొడుకులను వదలి వెనుదిరిగి పోయెను. నిండు చూలాలైన భట్టిదేవి యీ నడకకు, నీ క్లిష్ట పరిస్థితికి నోర్చుకొనలేక పోయెను. మహారాజు వెనుదిరిగి నంతనే దుఃఖభారముచే నిట్లనెను. "మహారాజా! నీమనస్సు నేమి బాధించు చున్నది? షష్ఠిశ్రీ వివాహము నాటినుండియు నేను నీకు దాసురాల నైతిని. ఈపరిస్థితి తత్పూర్వమైనచో నే నోర్చుకొనియుండెడి దానను. ఏనాటిదో నా రాజ్ఞీత్వము నీనాటి నా దాసీత్వ మును గలగలుపుచున్నారు. ఆ వదలిపెట్టిన ప్రశ్న నేల వేయ లేదు. ఈప్రశ్నకు సమాధానము నా జీవాత్మతోఁ జెప్పితిని. ఆప్రశ్నకు సమాధానము నా పరమాత్మతోఁ జెప్పియుండెడి దానను. బాహుబలుఁడు పుట్టిననాటనుండి మఱల నీపిల్ల కడుపునఁ బడుదాక నేను పట్టమహారాణిగా నుంటిని. ఈగర్భధారణారంభమునుండి నా మనస్సులో నీకు భార్యగా నుంటిని. ఈ

గర్భము నానుండి వెలికి వచ్చినతరువాత మఱలఁ దొల్లిటివలె నగుదునో! నీ తేజస్సు నాయందుండి, యా తేజోబలము చేత నామనస్సునంతను బాలించుచున్నది. ఇది యొక విచిత్రమైన పరిస్థితి. బాహుబలుఁడు నా గర్భమునం దున్నన్ని నెలలు నీవే దైవముగాఁ దోఁచితివి. మఱల నీ తొమ్మిది నెలలు నట్లే తోఁచుచుంటివి. నీ తేజస్సునకు నే నింత యనుకూలమైన క్షేత్రమును. నన్నాప్రశ్న యేల యడుగలేదు. నీ సహకారమునను నేను సమాధానము చెప్పు చున్నాను వినుము" అనుచుండగా మహారాజా గిట్టున వెనుకకు దిరిగి, "చెప్పవద్దు, నీవు చెప్పబోవు సమాధానము నాకు వలదు. నీవు చెప్పిన సమాధానములో నున్న సమాధానముకంటె నీ సమాధానము భిన్నముగా నుండవచ్చును. నీవు చెప్పిన ప్రతి మాటయు దైవము చెప్పుచున్నాఁడు. భట్టీ! నీయందు నాకుఁ గోపములేదు. నేను శాంతిని, పాపిని, షష్ఠిని, రుద్రధారను-అంబజను బరిత్యజింపఁగలను. నిన్నుఁ బరిత్యజింపలేను. నీవుమహా రాణివి. నే నీరాజ్యమునకు రాజ నెట్లో నీవు రాణి వట్లు. నిన్నుఁ గాదనుటకు నేనెవ్వరను? నాతల్లి వాశిష్ఠి యీ రాజ్యమునకుఁ దొల్లిటి మహారాణి. సర్వాధికారము శాంతిశ్రీదేవి దయ్యు వాశిష్ఠీమహారాణివలె నీవు మహారాణివి. నిన్నుఁ బ్రసన్నను జేసికొనుటకే, నీయందున్న సందేహము తొలఁగించుకొనుటకే నా బ్రతుకంతయు. నాకోపము నీమీఁదఁగాదు. ఎవరిమీఁదనో? మోసుకో?"

# సప్తమాధ్యాయము

ఆ దుఃఖభాగమున భట్టిదేవి యారాత్రికే ప్రసవించెను. ఆడశిశువు కలిగెను. వీరపురుషదత్తునకుఁ గలిగిన శిశు వాఁడ శిశువగుటతో నొకసంతోషము కలిగెను. అతని మనస్సులో నిశ్వాసవశమున మఱియుఁ దనగర్భమున నింకొక మగశిశువు కలుగుటయన్న వైముఖ్యము వ్యాపించియుండెను. తాను శాంతి మూలునిరాజ్యము ననుభవించుటకు యోగ్యుఁడు కాఁడనియుఁ దన కా రాజ్యార్హత లేదనియు, దన కుమారునకు లేదనియు నతని యంతరాంతరములో మనోదఘ్నముగాని యొక యూహ. ఆ యూహ యతని కున్నదని చెప్పుటకును వీలులేదు. లేదని చెప్పుటకును వీలులేదు. ఆ యూహ నడివేసంగిలో మిట్ట మధ్యాహ్నమున నాకాసమున మొగిలున్నదా? లేదా? యను తర్కమువంటి యూహ. ఆ మొగి లున్నదని మార్తాండునకుఁ దెలియదు. ఆకాశమునకుఁ దెలియదు. గ్రీష్మర్తువునకుఁ దెలి యదు. ఇదివఱకే బాహుబల శాంతిమూలుఁడు కలఁడు. ఈ యూహ యున్నచో నతఁ డా యూహకుఁ బ్రతిస్పర్థి. మరియొక సుతుఁడు కలిగినచో నతఁడు రాజ్యాధికారి కాలేఁడు. ఈ యూహకును మఱియొక మగశిశువునకును సంబంధము లేదు. లేకపోయినను నీ యూహకు సంబంధము లేని పురుష సంతానమునందు వీరపురుషదత్తునకు విరోధము. ఆ విరో ధము, వైముఖ్యము, స్త్రీ సంతాన మనుటతోడనే మహా రాజు పాణిము తెప్పిరిలిన తెప్పిరిలుట పరికటించెను. స్త్రీ సంతాన మనుటతోడనే మహారాజు మహానందనిమగ్నుఁ

డాయెను. శిశువును బోర్కాడించి దాదులు పొత్తిళ్ళలో నుంచిరి. స్నానమాడి శుద్ధవస్త్రధారిణియైన పట్టమహిషి తడిసిన దూదిపింజవలె, దమ్ముకొని నడిమంచమునఁ గూర్చొనెను. మహారాజు తొలుదొల్త పట్టమహిషివంకఁ జూచెను. ఓహో భట్టిదేవి! ఈ భట్టిదేవి కన్నులా నాటి సాయంకాలమునఁ దనవంకఁ జూచిన కన్నులేనా? సదీనము, ప్రార్థనామధురము, సమాధానాభిముఖము. తన మనోభావాకాంక్షామూర్తియైన యానాటి సాయంకాలమునందలి భట్టిదేవివదన మీ భట్టిదేవి వదనమేనా? ప్రేమచకితము, మధురాక్షరోచ్చారణాస్పంద జలజపత్త్రాంచల సుకుమారమైన యా భట్టిదేవి యధరమేనా యీ భట్టిదేవి యధరము? సద్యఃప్రసూతయై సద్యస్స్నాతయైన యే భార్యయొక్క కనుదమ్ములు తత్కాల భర్తృదర్శన వికసలిత మధుర లజ్జాస్నిగ్ధ రోచిష్మంతములు కావు? ఆ భట్టిదేవియు వీరపురుషుని తేజస్సును శిశువుగా దించి తాను దన భారము దీరిన యొక ప్రత్యేకస్త్రీవలె, ఋణముదీర్చిన యొక జీవుని వలెఁ, దనపై నిలిచిన నీటిబొట్టు సూర్యకిరణములచేత నాకర్షింపఁ బడఁగా మిగిలిన పద్మ పత్రియోగినివలె, నిరంజనముగాఁ గూర్చుండెను. మహారాజు భట్టిదేవిని జూచి పదినెలలైనది. ఈ భట్టిదేవి షష్ఠిశ్రీయొక్క మధుర ప్రేమకథాసమాకృష్ట హృదయయై తత్సేవాసమాదరస్నిగ్ధయై, తన మహారాజ్ఞీత్వ మును వదలి షష్ఠీద్వారమున వీరపురుషదత్తుని ప్రేయసిగాఁ బరిణమించిన యొక మాధురమూర్తివలెఁగాక తత్సాపత్న్యము వీరపురుషుఁ డెఱిఁగినదియు, నైదేండ్లుగా మహారాజ్ఞీత్వము మూటకట్టినదియు, ననభిగమ్యయై శిలాతటమున గంభీరజల తరంగములచేతఁ దాడన మాచరించు నదివోలెనైనదియునైన

భట్టిదేవివలెఁ గన్పించెను. భట్టిదేవి చెప్పనే చెప్పెను. "ఓయి మహారాజా! నీ తేజస్సు నా గర్భపరిహితమైనప్పుడు నేను నీకు భార్యగా నుంచున్నాను. నీ తేజస్సునకు నేను పగిన క్షేత్రమును. తన తేజస్సు మోయుచున్నంతవఱకుఁ దన నామె భార్య. తేజస్సు వెలువడినంతనే యామె మఱల భట్టిదేవి. ఓహో! ఇది యేమి విచిత్రస్త్రీత్వము! ఈ భట్టి పరమశీల. తనయందుఁ బరమ పతివ్రత. ఆమెకుఁ దనయందు ప్రేమయే లేదు. ప్రేమ లేకపోవుట యేమి? ఉన్నది. తన తేజస్సు నామె ధరించినప్పు డామె లీనాగ్నియైన శమీవృక్షమువలె నుండును. ఆ తేజస్సు తననుండి తొలఁగినంత మఱియొక ప్రత్యేకవ్యక్తి. తనకు నామెకు సంబంధము లేనట్లుండును. ఆ భట్టిదేవి శూన్యనేత్రాంశువులు వీర పురుషదత్తుని హృదయములో వ్యాపించి యచట నున్న, యిన్నాళ్ళు పొనుగుపడియున్న, భట్టిదేవీవిరహాగ్నీంధనము మఱల నెగసన తోచెను. గ్రామబహిర్గతుఁడైన సోమయాజి తనయగ్నికుండము నుముకతోఁ గప్పి మఱలఁ దాను తిరిగివచ్చు వఱకుఁ జల్లారకున్న పిటకములను సమకూర్చి నియమితకాల మున వచ్చునాటికిఁ బైయుముక హస్తాంగుళులఁ దొలగించి నూతనేంధనము లర్పించి చేయడ్డ మిడి యూఁది యగ్ని చేసి నట్లు భట్టిదేవి యీ తనచూపులతో రాజు నెదలో మఱల విరహాగ్ని నుద్దీపింపఁజేసెను. రాజు తాళుకొనలేకపోయెను. అతని కన్ను లప్రయత్నముగ శిశువువంక మఱలెను. అచటి దాదియు శిశువును రాజునకుఁ జూపించెను. ఆ శిశువును జూచి నంతనే రాజున కొక విచిత్రానుభూతి కలిగెను. విరహాగ్ని యంతర్దహనము మాని బహిర్జ్వాలమై బహిర్దహనప్రచార తీక్ష్ణము నున్నట్లు తోఁచెను. ఇన్నాళ్ళు భట్టిదేవీవిరహము

తన్ను దహించెను. ఆ శిశు వేమో యిట్లు చెప్పెను. "ఈయగ్నిని నిన్నిక దహింపనీయను. ఈయగ్ని చేతఁ బాలుల దహింపుము. ఈయగ్నిని నాతల్లి నియందు సంధానము చేసెను. ఆ యగ్ని నుండి పుట్టిన మఱియొక యగ్నిని నేను. తొలుతటి యగ్నికి దహనశక్తి తగ్గినది. న న్నాధారముచేసికొని నీపగ సాధింపుము. నిన్ను భట్టిదేవి నిరాదరించెను. ఆ నిరాదరము, నా తిరస్కారము నీవు న న్నాదరముచేసికొని పెడత్రొక్కుము అని చెప్పినట్లుం డెను. రాజునకు భట్టిదేవి విరహాగ్ని కొంత యుపశమించిన ట్లయ్యెను. బాహుబల శాలియగువాఁడు భట్టిదేవి గర్భము. అతఁడు శాంతింపఁ జేయలేని యీ విరహాగ్నిని యాడశిశు వెట్లు శాంతింపఁ జేయఁజాలెదు. ఈ శిశువు స్త్రీమూర్తి. పగతీర్చినను పగ పెచ్చినను స్త్రీమూర్తి ద్వారా జరుగవలయును. భట్టిదేవికిఁ తనమీది పగతీరుటకు స్త్రీ సంతాన మెంత వాడఁబలదో, పురుషసంతాన మంతకా దని తెలిసినది. ఆమె మహారాజ్ఞీ త్వము శూన్యదృక్కాంతి ప్రసాదమాత్రముగా నిలచిపోయినది. రాజునకు లోనుండి యొక యానందతరంగము వచ్చెను. అది యానందతరంగము కాదు. ప్రత్యాశాతరంగము. రాజు వెడలి పోయెను.

ఆ రేయెల్ల రాజునకు నిదురలేదు. మఱునాటి పొద్దున రాజు భదంతాచార్యునకుఁ గబురంపించెను. భదంతుఁ డరు దెంచెను. రాజాచార్యునకు సాష్టాంగనమస్కారము చేసి యిట్లనెను. "ఆచార్యా! నేను నీకు శరణాగతుఁడ నగుచున్నాను. నా యాత్మకు శాంతిలేదు. నా కీ శాంతి కుదిర్చిపెట్టు మనెను. భదంతుఁడు గడియసేపు మౌనముద్ర వహించి యిట్లనెను. 'రాజా! నీ యీ స్థితినిజూచి నా శోకవిషయము జ్ఞాపకము

వచ్చినది. మధ్యమనికాయస్థ మని యొకకథ కలదు. బుద్ధ దేవుఁడు బ్రతికియున్నపుడు బింబిసార నృపాలుఁడు కాశ్మీరదేశమునఁ గల తక్షశిలా నగరాధిపతియైన పుక్కుసాతి యను ధాత్రీశ్వరునకు బౌద్ధధర్మములను రాజగృహమునుండి యొక యాకుమీఁద వ్రాసిపంపించెను. బింబిసారుఁడును పుక్కుసాతియు మిత్రములు. ఈ తక్షశిలాపతి యా సూక్తములను జూచి రాజ్యము పరిత్యజించి రాజగృహాభిముఖుఁడై వచ్చెను. రాజగృహమున నారాత్రి బోధిసత్వుఁ డొక కుమ్మరివాని యింట బసచేసెను. ఈ రా జచ్చటికేసాయెను. తక్షశిలాపతి రాజ్యము పరిత్యజించినను, వేషమునందలి మాననీయతఁ బరిత్యజించ లేదు. బుద్ధుఁడు పరమభిక్షుక వేషమున నుండెను. తా మిద్దఱు నొకచో బసలో నుండుట రాజున కంగీకార్య మగునో కాదో యని బుద్ధదేవుఁ డిట్లనియెను. 'సోదరుఁడా! నీకిబ్బంది లేనిచో మనమిద్దఱ మీరాత్రి యిచ్చట నేబసఁజేయుద'మనియిఱువురును బద్మాసనములు వేసికొని యెదురెదురుగాఁ గూర్చుండిరి. బుద్ధదేవుఁ డిట్లనియెను: 'ఓయి, నీ మొగమునందు తైక్ష్ణ్యము గోచరించుచున్నది. నీ ధర్మమును, గురువును, రాజ్యమును నీ వేల పరిత్యజించి వచ్చితి'వని. రాజిట్లనెను. ఓయిభిక్షుకా! 'శాక్యమునియైన గౌతముని ధర్మము నన్ను కదల్చివై చినది'. బుద్ధుఁడు: ఇప్పు డా గౌతమముని యెచ్చటనున్నాఁడో తెలియునా? రాజు: ఉత్తరదేశమున శ్రావస్తిలోనున్నాఁడు. బుద్ధుఁడు: నీ వాయనను జూచితివా? నీ కిప్పు డతఁడు కన్పించినచో గుర్తించఁగలవా? రాజు: మిత్రుఁడా! నేనతనిని జూచినచో గుర్తుపట్టలేను. బుద్ధుఁడు: భిక్షుకా! నేను గౌతముని ధర్మము నుపదేశింతును, వినుము. మనుజుఁ డాఱు భూతములయొక్క సమాహారము. భూమి,

జలము, అగ్ని, వాయువు, ఆకాశము, జ్ఞానము. ఈ యాఱుభూత
ములతో మనుజుఁడు జ్ఞానేంద్రియములద్వారా సంపర్కము
కలిగియుండును. మనుజుఁడు పదునెనిమిది తోవల నీ ప్రపంచ
ముతో సంబంధము కలిగియున్నాఁడు. అతఁడు నాలుగు కాళ్ళు
గల పీఠముపై నిలుచున్నచో నతని మనోభ్రమణ మాగును.
అప్పుడతఁడు నిజమైన భిక్షుకుఁడగును. ఆ పీఠమునకు నాలుగు
కోళ్ళు. అందొకటి ఆత్మదృష్టి. దీనివలన సర్వదుఃఖములు నశిం
చును. రెండవది నిర్వాణము. మూడవది వైరాగ్యము. దీని
వలనఁ గామద్వేష, మిథ్యాజ్ఞానములు నశించును' అని యీనాలు
పీఠముల స్వరూపము నుపన్యసించెను. తక్షశిలాపతి యుద్వేగి
తుఁడై 'ఓ గురువా! నా యజ్ఞానము నశించెను. నిన్ను సోదర
భిక్షువు వలెఁ జూచిన నా యజ్ఞానము మన్నింపుము'' అని
పాదాభివందన మాచరించెను. ఓయి రాజా! నీ వింతకుముందు
నాయాత్మ యేమి కావలయునని ప్రశ్నించితివి. సరియత్తి హేతు
సత్య నిసత్త నిర్జీవితా స్వరూపమైన ధర్మమును మించి మఱి
యేదియును లేదు. సరియత్తి యనఁగా బౌద్ధసిద్ధాంతములు; బౌద్ధ
మతగ్రంథములు. హేతువు హేతువు. సత్యమనగా, ధర్మాధర్మ
ముల ఫలములయొక్క విభిన్నత్వము. అధర్మము నరక
మును బొందించును. ధర్మము స్వర్గమును బొందించును. నిసత్త
నిర్జీవితయనఁగా సనాత్మత్వము. ఇవియంతయుఁ గలసి ధర్మమనఁ
బడును. ఆత్మ యనునది యెచ్చట నున్నది? ఇది శూన్యమైనది.
ప్రపంచమంతయు శూన్యమయము. ఇందులో ఆత్మలేదు. నేను
అని లేదు. నా స్వభావ మనునది లేదు. పంచేంద్రియములయందుఁ
గాని, మనస్సునందుఁగాని, అహంత్వము లేదు. ఇది ప్రకృతి సహ
జమైనలక్షణము. ఇదియే నిసత్తనిర్జీవితాలక్షణము. ఆత్మయని, ఆత్మ

సంబంధమని యెట్లుండగలదు. ఆ లేనిది నిత్య మెట్లు కాగలదు? పరిణమయితత్వ మెట్లుకాగలదు? అదియొక మూఢసిద్ధాంతము. అసంఖ్యజీవులును బ్రతుకు చున్నారు. వికారములు పొందు చున్నారు. ఈ వికారములుపొందుచున్న యీప్రపంచముకంటె భిన్నమైనది లేదు. ఇది యనిత్యము. మారుచుండును. దుఃఖము ననుభవించు చుండును. సంయుత్తనికాయసుత్తము లిట్లు చెప్ప బడెను. అనంతమైన కాలములో దేవతలుకూడ నీ మహాయథార్థా ర్థ్యమును విస్మరింతురు. అప్పుడొక బోధిసత్వు డవతరించును. మృగరాజు మలుసంజవేళ గుహాముఖమునుండి వెలువడఁగా సర్వమృగములు భయకంపితములై దాగి యున్నట్లు సర్వదేవ మానవ పిశాచ యక్షులు నతని వాక్ఛ్రవణముచేత మూకీ భూతు లగుదురు. అప్పుడాయన ధర్మోపదేశము చేయును. సర్వ భూతములు జ్ఞానము సర్వమును ముద్దగానై నుదించుకొని మఱల నశించిపోవుచో నా మహాధర్మము నుపదేశించును. అప్పటికి దేవతలందఱకుఁ దెలియును. అరే, మన మందఱము నిత్యుల మనుకొంటిమే! మనమందఱము నశించిపోయెడువార మేనా? యని. ఈ విషయమే కథాసూత్రమునఁగూడ నున్నది. సత్యలోకపతియైన బాకనామక బ్రహ్మ యొకప్పుడు బుద్ధునకుఁ గన్పించి తాను నిరంజనుఁడ నని, సృష్టిస్థితిలయముల కర్తృఁడనని తనలోకమే ముక్తియని చెప్పెను. బుద్ధదేవుఁడే సమాధానము చెప్పెను. 'ఓయీ! నీ సత్యలోకము శాశ్వతమని, కేవల మని, యిదియే నిర్వాణమని నీయజ్ఞానముచేత నీవనుకొను చున్నావు. ఆత్మ యనునది లేదు. అది కల్పితము. ఉండుటకు వీలులేదు. ధర్మమొక్కఁడే కలదు. ధర్మాచరణముచేత నిర్వాణముపొందఁ గలవు. ధర్మమైన యూహలు ఆశ, మాట, ప్రవర్తన

బ్రతుకు, ప్రయత్నము, జ్ఞానము, శ్రద్ధ- ఈయెనిమిది విధములైన మార్గములచేతనే నిర్వాణము ప్రాప్తించును. పెడత్రోవ లేదు. ఆత్మయని యొకడు కల్పించుకొని దానిని సాధించుటకుఁ గర్మలని,యజ్ఞములని,వానిననుసరించి వర్ణములని చేసికొన్న హింసాజీవనము నిత్యనరక హేతువు. ఇది నీకుఁ జెప్పితిని. నీ వాలోచించుకొమ్ము. బౌద్ధమతము గ్రంథములలో నున్నది. చదువుము. దానిని విశ్వసింపుము. అనరింపుము. ప్రతి సమాధానము చెప్పరా దన్న మూఢమతము కాదు. తర్కముమీఁద నాధారపడిన మతము. నీవు చూడనిది చూచినట్లు చెప్పినచో, లేని దున్నట్లు చెప్పుట. అనంతకాలముగా నీసృష్టి యట్లే జరుగుచున్నది. దీని నొకఁడు సృష్టించె నని, యొకఁడు పోషించు నని యొకఁడు చంపునని నీ వెట్లు చెప్పగలవు?ఇది ప్రకృతి లక్షణము. స్త్రీ పురుష సంయోగముచేత జంతువులు పుట్టుట నిసర్గము. పెరుగుటయు, సుఖభ్రాంతియు, దుఃఖానుభూతియు, మరణమును నిసర్గములు. వెనుకకు వెనుకకుఁబోయి మొదట నిట్లుండి యుండవచ్చు నను నూహా నట్టి కల్పన. పరమ ప్రత్యక్షమైన విషయము. జీవు లున్నారు. దుఃఖ మనుభవించు చున్నారు. ఈ దుఃఖనిరాసమే నిర్వాణము. అన్యమైనది మిథ్యాకల్పము. వర్ణాదులు కితవకల్పిత వ్యూహతంతువులు”అని భదంతాచార్యుఁ డుపన్యసించి తాను గనులు మూసికొని ధ్యానమగ్నుఁ డయ్యెను. ఏరపురుషదత్తునకుఁ దన యొడలిలోని నెత్తురెల్లను బొంగులెత్తెను. అతఁడిట్లనెను. ‘ప్రభూ! పరిభూ! బుద్ధదేవుని మాటలు విని తక్షశిలాపతి యెట్లు కరఁగెనో నే నట్లు కరఁగితిని. నేను నేఁటినుండి బుద్ధదేవుని భక్తుఁడను; నీకు శిష్యుఁడను.”

పురిటి పదియవనాఁడు మహారాజు వారివెంట పసపుకుంకుమలు పంచిపెట్టఁబడలేదు. పట్టమహిషి భోగసాలచేసికొనవలెనని కబురంపెను. రాజు మాటాడలేదు. పట్టమహిషి కూఁతునకు తన తల్లి పేరు వాశిష్ఠియని పెట్టవలయు ననుకొనెను. మహారాజునకుఁ దెలియఁజేసెను. రాజు మాటాడలేదు. మహారాజు మేనత్త శాంతిశ్రీదేవి యింటికిఁబోయెను. బాలికకేమిపేరుపెట్టవలయునని యడిగెను. శాంతిశ్రీ యిట్లనెను. 'నాయనా! నీవు భదంతాచార్యుని శిష్యుఁడవైతి వంటకదా? రాజు: ఐతిని. కాని యింకను నది రహస్యముగానే యుండెను. శాంతి: రహస్యము రహస్యముగా నుంతువా? బహిర్గతము చేతువా? రాజు: చేయవలయు నన్న ప్రయత్నము నాదెస నెందులకు? దానియంతట నదియే బహిర్గత మగును. శాంతి: ఒక్క విషయము విచారించితివా? నీ బావమఱది స్కంధ విశాఖనాగుడు తీవ్ర బ్రాహ్మణపక్షపాతి. అతడు మహాసేనాపతి. నీ తోడబుట్టువు అడవి శాంతిశ్రీ సర్వనగరాధ్యక్షురాలు. ఆబిడ్డయు మగనియంత తీవ్రవాదిని: మహాపరాక్రమవంతుఁ డగు శాంతిమూలినిలో నున్న తీవ్రత యామెయందును గలదు. నీవు బౌద్ధమతము వైపునకు లాగి నచో వారు బ్రాహ్మణమతము వైపునకు లాగుదురు. రాజు: ధనకదేశమన కెచ్చట? ధాన్యకటకము కాదు. ధాన్యకటకము నందు శాతవాహనుల సంతానము సామంతులై యున్నారు. స్కంధవిశాఖనాగునకు శాంతిమూలుఁ డిచ్చిన యధికారము. అచ్చముగా నేను రాజునేకాను. అతనికి సైన్యములో నున్నంత పలుకుబడి నాకును గలదు. శాంతి: నీ కుమార్తె కేమని పేరు పెట్టవలె ననుకొంటివి? రాజు: అదియేకదా నిన్న డుగవలయు నని వచ్చినది? శాంతి: భదంతాచార్యులవారి నడుగుము. ఇది

పాయనకు గురుదక్షిణగా నుంచును. రాజు: గురుదక్షిణ యిది కాదు. దీనితో మర్యాద నడిపెద. శాంతి: నీకూఁతునకు కోడబలి యని పేరిడుము. కోడబలి యన్న నామ మొక బౌద్ధభిక్షువు దాలిది. పూర్వము నాగార్జునుఁ డిచ్చట తపస్సుచేసినప్పు డామె యాచార్యునకు సేవచేయు చుండెడిది. ఒకనాఁ డాచార్యుఁడు కృష్ణాస్నానమునకుఁ బోయెను. అప్పుడా కొండమీఁది వృక్షము లందెల్ల వానరము లుండెడి వఁట. ఒక వేటకాఁడు వానరము లన్నింటిని వలలువేసి పట్టుకొని చంపనెంచెను. అందొక పెద్ద వానర మా వలల నన్నింటిని త్రెఁగగొరికెను. నాగార్జునుఁ డా వానరమునుజూచి యది బోధిసత్త్వుని మఱియొక యవతార మని నిశ్చయించెనఁట. ఆ వేటకాఁ డా మహావానరముమీఁదఁ బగ బూని దానిని వధించుటకు నిశ్చయించుకొనినఁట. ఆ వానర మొక మహావృక్షముమీఁదఁ దానొక యిల్లుకట్టుకొని నివసించు చుండెనఁట. అర్ధరాత్రమున నెప్పుడో యొక రెండుమూఁడు గడి యలుమాత్రమే యా వానర మా చెట్టుమీఁద నుండెడిది. ఆసమయము కనుగొనుట దుర్ఘటమయ్యెడిది. చివర కా వేటకాఁ డాసమయమునుబోల్చి యొకరాత్రి వేళ దానిని వధించుటకునిశ్చ యించి మాటుపెట్టుకొని కూర్చుండెను. కోడబలి కీసంగతి తెలిసెను. ఆమె తా.నా మర్కటముతోఁ జెలిమికలిగి యుండెడిదఁట. ఆరాత్రి కోడబలి మర్కటమును మఱియొక స్థలమునకుఁ బంపించెనట. కోడబలి యెందుకుఁ బంపించుచున్నదో యామర్కటమునకుఁ దెలియదు. ఆ మర్కటమును బంపించిన తరువాత కోడబలి తా నామర్కటమువలె వేషము వేసికొని యావృక్షము మీఁద నామర్కటము ననుకరించుచుఁ గూర్చుండెను. ఆ వేటకాఁడువచ్చి యామెనే మర్కట మనుకొని బాణముతోఁ గొట్టి

గంపెను. నాఁటినుండియు కొండబలి యీ క్షేత్రపాలకు డాలుగా నాయెను. ఈ కథ బౌద్ధగ్రంథములఁ దెలియును. పూర్వము బోధిసత్త్వుఁడు తానొకజన్మలో మహాకపి యయ్యెను. ఈ కపియు నా బోధిసత్త్వుఁడే యని, కొండబలియు బోధిసత్త్వుని యవతారమనియు మే మందఱము విశ్వసింతుము. మహాకపి జాతకమునందే బోధిసత్త్వుని వర్ణనమున్నదో, యా బోధిసత్త్వుని యంశ మిచట నున్నదని యాంధ్రబౌద్ధులు చెప్పుదురు. నీవు నీ కుమారునకుఁ గొండబలి యని నామకరణము చేయుము. రాజు: ఆ మహాకపిజాతకములోని కథ నాకుఁ జెప్పుము. శాంతి: గంగాతీరమున నొక వానరయూథమున కొక మర్కటరాజు యూథపతియై యుండెను. బ్రహ్మదత్తుఁ డను కాశీరాజు వాని నన్నింటి నొకసారి రక్షించెను. ఈ వానరము లన్నియు నొక రసాలవృక్షము నాశ్రయించి యుండెను. ఆ రసాలము పలుక శాఖల సంఖ్యచే వినమ్రమై యుండెను. ఆ రాజు కోతులను పాఱద్రోలి యా ఫలముల హరింపవలయునని యా వృక్షమును సైనికులచేతఁ గదలింపించి గగ్గోలుచేసెను. ఆ కోతులను జంపుటకుఁగూడ నాజ్ఞ యిచ్చెను. కాని యూథపతియైన మర్కటరాజు బోధిసత్త్వుఁడు. ఈబోధిసత్త్వుఁడు తనశరీరము నొక వంతెనగాఁ జేసి యచటి వానరముల నన్నింటిని గంగ యద్దరికి దాటించెను. దేవదత్తుఁడుకూడ నా మూకలో నొక క్రోతిగానుండెను. ఆ దేవదత్తుఁడు బోధిసత్త్వునితోఁ బగబూని వంతెనగాఁ గట్టి యున్న బోధిసత్త్వుని వీపుమీఁద దూఁకి యతని గాయపఱచి బాధించెను. కాశీరా జదిచూచి యూథపతి దయాగుణమునకు మెచ్చుకొని వానరములను రక్షించెను. చనిపోవుచున్న బోధిసత్త్వుఁ డా రాజునకు రాజధర్మములనుగూర్చి బోధచేసి చని

పోయెను. ఇది మహాకపి జాతక కథ. బోధిసత్వుఁడే కొండబలిని పాలించుటకుగాను కృష్ణాత్రేయమున మనుజుల జన్మించెను. ఆ బ్రహ్మదత్తుఁడే కొండబలిగాఁ బుట్టెను. రాజు "బుద్ధదేవుడు దయామూర్తి" అని వెడలిపోయెను.

మఱునాఁడు భదంతాచార్యుఁడు వచ్చెను. రాజు భదంతాచార్యునిచేతఁ దన కుమారునకు కొండబలిశ్రీ యని నామకరణము చేయించెను. ఊరిలో నున్న పన్నెండుగురు బౌద్ధ భిక్షుకులకుఁ గావిగుడ్డ లిచ్చెను. ఆహారపదార్థము లిచ్చెను. ఇచ్చి రా జిట్లు చెప్పెను. 'ధర్మచక్రమునకుఁ బన్నెండాకులు. మీరు పన్నిద్దరు. నేను ధర్మచక్రము నాశ్రయించుచున్నా' నని. అడవిశాంతిశ్రీ యా సమయమున నచ్చట నుండెను. ఆమె కన్ను లగ్నిజ్వాలలవలె మండెను. ఆమె యిట్లనెను. 'నాతండ్రి శాంతిమూలుఁడు సుక్షత్రియుఁడు. ఇది బ్రాహ్మణదేశము. ఇది బ్రాహ్మణరాజ్యము. నాతండ్రి కడుపునఁ బుట్టినవాఁ డిట్లు చేయఁడు'.

వీరపురుషదత్తుని మొగమునందుఁ గోపము. కోపయు మదమును రెండును గనుపించెను. అతఁడు సోదరితో నిట్లనెను. 'నేను నీతండ్రిగర్భమున జన్మింపలేదు. నా తండ్రి యెవరో నాకుఁ దెలియదు. నేను బ్రాహ్మణద్వేషిని. క్షత్రియుఁడను గాను. ఇది బ్రాహ్మణరాజ్యము గాదు'. అడవిశాంతిశ్రీ యిట్లనెను. 'తండ్రి చనిపోవునపుడు నీతోఁ జెప్పినమాటలు నేను విన్నాను.' రాజు: నిజమే. విన్నావు. ఆయన చెప్పినదంతయు నిజము. నేను క్షత్రియుఁడనైనచో నాకీ బౌద్ధమతావేశము కలుగదు. నేను బ్రాహ్మణుఁడనై యుండవలయును. అచ్చముగా బ్రాహ్మణుఁడను గూడ నై యుండను. నేను క్షత్రియుఁడనుగాను. కానని నీభర్త

కూడ చెప్పెనటగదా! "శాంతి: ఎవరితోఁ జెప్పెను? రాజు: ఎవ్వరితోనో యొకరితోఁ జెప్పెను. అంత నడవిశాంతిశ్రీ కన్నీళ్ళ పర్యంతమై గద్గదికతో నటనుండి బిరబిర నడచిపోయెను. పోయి మాతరీదేవి గృహమున కేగెను. మాతరీదేవి చనిపోయిననాటి నుండియు నాకసౌధము మాతరీదేవిసౌధముగాఁ బ్రత్యేకింప బడియుండెను. ఆ సౌధములో మాతరీదేవి శిలాప్రతిమ యొకఁడును బంగారములోఁ జేసిన చిన్నప్రతిమ యొకఁడును నిత్యమును నడవిశాంతిశ్రీచేఁ బూజ నందుచుండెను. ఆమెయాచిన్న ప్రతిమను దనచేతిలోనికిఁ దీసికొని తల్లితో నిట్లనెను. "అమ్మా! మహారాజు తాను క్షత్త్రియుఁడు కాఁడట. శాంతిమూల మహారాజుకడుపునఁ బుట్టలేదట. తాను సుక్షత్త్రియుఁడు కాఁడట. ఇది బ్రాహ్మణరాజ్యము కాదట. తాను బ్రాహ్మణ మతమును బాలింపడఁట' యనెను. మాతరీదేవి మాఱుమాటలేక కనులందు దైన్యము తెచ్చుకొన్న ట్లుండెను. తల్లిని జేతఁబుచ్చుకొని కూతు మేనత్తయైన శాంతిశ్రీదేవి యింటికిఁబోయెను. మాతరీదేవి యాడుబిడ్డతోఁ జెప్పినట్లిట్లనెను. 'వదినే! మహారాజు తాను క్షత్త్రియుఁడు కాఁడట. శాంతిమూలమహారాజు కడుపునఁ దాను బుట్టలేదట. ఇది బ్రాహ్మణరాజ్యము కాదఁట. తాను బ్రాహ్మణ మతమును బాలింపడఁట' యనెను. ఆడుబిడ్డ మొగమునఁ గత్తి వేసిన నెత్తురు చుక్కలేదు. ఆమె యా హేమప్రతిమవంక నట్లే నిదానించి చూచి 'వదినే! నాతో నేల చెప్పవచ్చితివి? నాకుఁ దెలిసినది నీకును దెలియును. అతఁడు శాంతిమూలుని కొడుకగునో కాఁడో నీకుఁదెలియకుండ నాకుఁదెలియునా? నీకుఁగొడుకునం దెంత ప్రేమయో నాకు వీరపురు దత్తునియం దంత

యభిమానము. నేను బౌద్ధమతస్థురాలను. ఈ సంగతి శాంతిమూల మహారాజునకుఁ దెలియును. నన్నిప్పుడు నిందించి యేమి ఫలము? అని లోనికిఁ బోయెను.

# అష్టమాధ్యాయము

శ్రీపర్వతాగ్రభాగమున నొక మహాచైత్య ముండెడిది. అదియాతయు శిథిలమై నాటిరాళ్ళు గుట్టలుగా నుండెను. విజయపురమునఁ బలుతావులయందు విహారస్థలములు, చైత్యస్థలములు పలువురిచేత స్వాధీనములుగాఁ గొన్ని శివాలయములుగా మార్చఁబడి యుండెను. ఈ మహాచైత్య స్థలమున నొక బ్రాహ్మణుఁడు శివాలయమును నిర్మింపవలయు నని సంకల్పించి రాజాధికారులకుఁ దెలియఁజేసి యనుజ్ఞకోసము రెండుమూఁడు మాసములుగాఁ బ్రయత్నించు చుండెను. ఈ వ్యవహారము స్కంధవిశాఖనాగుని యనుమతినిగూడఁ బడసెను. శాంతిశ్రీదేవి యనఁగా మహారాజుసోదరి, పురాధ్యక్షురాలు. ఆమె యనుమతి నిచ్చెను. కాని సర్వానుజ్ఞలు చక్రవర్తికిఁ దెలియఁజేయవలయును. ఇది యిట్లుండఁగాఁ బట్టణములో నున్న యల్ప సంఖ్యాకులైన బౌద్ధభిక్షుకులకు నిహాగ మిక్కిలి కంటకముగా నుండెను. ఆ మహాచైత్యము పూర్వము నాగార్జునుఁడు తపస్సు చేసినచోటు. అందుచేత బౌద్ధుల కది పవిత్రక్షేత్రము. బౌద్ధభిక్షుకు లందఱుఁ బోయి మేనత్తయైన శాంతిశ్రీతో నిదివఱకే చెప్పికొనిరి. ఆమెయొక్క బౌద్ధమతము మానసికమైనది. ఆమె యెక్కువ పట్టించుకొనలేదు. పోయి భదంతాచార్యునితోఁ జెప్పుకొనిరి. భదంతుఁడు పంచీపవాసని రాజుమనస్సుమీఁద నేర్పడి

యెప్పుడని తన యాచారత్వము ఫలవంత మెంతవఱ కగునో తెలియక మంచి వేళకొఱ కెదురుచూచుచుండెను. కొండబలిశ్రీ నామకరణము జేసిన మఱుదినమునఁ జక్రవర్తి యాచార్యునకుఁ గబురంపెను. ఆచార్యుఁడు వచ్చెను. చక్రవర్తి యాచార్యుని గూర్చుండ నియమించి 'ప్రభూ! నేను నీకు శిష్యుఁడను. గురుదక్షిణగా నేమి యిమ్మందువు' వనెను. ఆచార్యుఁ డిట్లనెను. 'మహారాజా! యీ గురుదక్షిణ యన్నమాట బ్రాహ్మణుల మాట. మాదికాదు. అయినను నాకు నీ వేమి చేయవలయును? ఈ విజయపురము పూర్వము భిక్షుకుల జ్ఞానక్షేత్రము. నేడిచట బౌద్ధమతము నిర్మూలింపఁబడినట్లు మఱియొక చోట లేదు. చివరకు శ్రీపర్వతాగ్రస్థమైన ఆచార్యనాగార్జునుని పూజాస్థలమైన మహాచైత్యముకూడ శివాలయము కాఁబోవుచున్నది. బౌద్ధమతమునకీ యాపత్తు తొలగించి మఱల మహాచైత్యము నచట నిర్మించునట్లు దయచూడు' మనియెను. చక్రవర్తి యొకపరిచారకుని అడవిశాంతిశ్రీయొద్దకుఁ బంపించెను. ఆమె శివాలయనిర్మాణమునకుఁ దా ననుజ్ఞకూడ నిచ్చినట్లు తెలియఁజేసెను. చక్రవర్తి యా బ్రాహ్మణుని పిలిపించెను. ఆ బ్రాహ్మణునిపేరు నాగభట్టు. అతఁడు సాంగవేదాధ్యయనపరుఁడు. ఆయన చక్రవర్తి తన యభిమతము చెల్లింపఁ బిలిపించెననుకొనెను. ఆయన నట్టియధ్యయనపరుఁడేఁ గాని, శాస్త్రములు నుపనిషత్తులు నెఱిఁగినవాఁడుకాదు. ఆయన వచ్చినంతనే చక్రవర్తి యిట్లనెను. 'ఏమయ్యా! శ్రీపర్వతమహాచైత్యస్థలమున శివాలయనిర్మాణమును జేయనెంచితి వఁటకదా' యనెను. పూర్వము బ్రాహ్మణులతో నిక్ష్వాకు చక్రవర్తులంత నిర్మర్యాదముగా మాటాడలేదు. చక్రవర్తి మఱల

నిట్లనెను. 'దేవుఁ డెచ్చట నున్నాఁడో? శివుఁడు భగవంతుఁ డని నమ్మక మెట్లు? ప్రకృతి ప్రకృతియందుఁ గదలుచున్నది. సర్వము పరిణమించు చున్నది. కారణమునుబట్టి కార్యము జరుగు చున్నది. ఆ కారణము భగవంతుఁ డని, బ్రహ్మపదార్థ మని చెప్పుట మిథ్యాకల్పనము. బౌద్ధధర్మ మొక్కటియే నిర్వాణ మార్గము. శివుఁ డొక యపవిత్రజంతువు. శ్మశానములో నివా సము. కపాలములును, సర్పములును భూషణములు. ఈ భగ వత్కల్పనముకూడ బ్రాహ్మణుల బుద్ధివైపరీత్యమును దెల్పు చున్నది. ఇట్టి ధోరణిలో మాటలాడెను. ఇక్ష్వాకుల రాజ్య ములోనున్న బ్రాహ్మణుల నిర్భయత్వమామాత్రమే యెఱిఁగిన యా నాగభట్టు చక్రవర్తి చేసిన శివనింద నోర్చుకొనలేక పోయెను. కాని యాయనకు వాదించునంతటి నేర్పులేదు. ఆయన యిట్లనెను. 'మహారాజా! యిది మీయిక్ష్వాకుల త్రోవ కాదు. అన్నద్వేషము, బ్రాహ్మణద్వేషము పనికిరాదు' అని చక్రవర్తి యనుమాట మఱచిపోయి మాట్లాడెను. చక్రవర్తి మిక్కిలి కోపించి యా బ్రాహ్మణుని కారాగార బంధితుని జేయించెను. పట్టణమంతయుఁ గలవరపడెను. అనుజ్ఞ వచ్చినదే యనుకొని యా బ్రాహ్మణుఁడు శ్రీపర్వతాగ్ర భాగమున దేవాలయనిర్మాణము కొఱకు నిటుకలును, సున్నమును దోలించెను. బ్రాహ్మణుఁడు చెఱసాలలోఁ బదిదినము లుండెను. ఆ పదిదినములు పూర్తి యగువఱకు నచ్చట నొక్క యిటుక లేదు. ఒక చిట్టెడు సున్నము లేదు. వానిని బౌద్ధు లెత్తుకొనిపోలేదు. ఎత్తుకొని పోఁదగినంతమంది బౌద్ధు లాపట్టణమున లేరు. శివద్రవ్యమని కొంకినవాఁడు లేదు. ధర్మము రాజానుమతము. అడవిశాంతిశ్రీయు, స్కంధవిశాఖ

నాగుఁడును వచ్చి చక్రవర్తితోఁ జెప్పెను. 'మహారాజా! మీరు
శివాలయ నిర్మాణమున కంగీకరింతురు, అంగీకరింపుఁడు. ఆ
బ్రాహ్మణుని చెఱసాలయందు బంధించుట ధర్మము కాదు.'
చక్రవర్తి యిట్లనెను: 'ఆ బ్రాహ్మణునికొఱకు నాతో వచ్చి
యెవ్వరును జెప్పనక్కఱలే' దని. మేనత్తయైన శాంతిశ్రీ
కొక సవతి యుండెను. ఆమె పూగీయ మహాస్కంధుని మఱి
యొక భార్య. ఆమె పేరు కామశ్రీ. ఆమె కుమారుఁడు విష్ణుశ్రీ.
విష్ణుశ్రీ మహాసేనాపతులలో నొకఁడు. ఈ తల్లిబిడ్డలు తీవ్ర
బ్రాహ్మణమతస్థులు. కామశ్రీ బ్రాహ్మణ మతస్థురాలగు
టకుఁ దన సవతియైన శాంతిశ్రీ బౌద్ధమతస్థురాలగుట ప్రబల
కారణము. తన సవతి మహారాజునకు మేనత్త. మేనత్తకుఁ
బితృచ్ఛాయని వారనుకొనెడివారు. కామశ్రీ పూగీయ మహా
స్కంధునకుఁ బెద్దభార్య. పూగిదేశవాసిని. పూగిదేశ మనగా
ఒంగోలుమండలము. ఆనాఁడు ఒంగోలు మండలమునందుఁ
బోకచెట్లును దమలపాకుతోటలును మిక్కుటముగానుండి యీ
దేశమునకుఁ బూగదేశమని పేరు వచ్చినది. ఆ మండల వాసులు
దృఢకాయులు. యుద్ధాభిలాషులు. ఆజానుబాహులు. పట్టుదల
కలవారు. శాంతిమూలుఁడు తన చెల్లెలిని మండలేశ్వరుఁడైన
మహాస్కంధుని కిచ్చుట రాజ్యభద్రతకొఱకు. మహాస్కంధు
నకు రాజసోదరియైన శాంతిశ్రీయందుఁగన్న తన దేశస్థురాలైన
కామశ్రీయందే యెక్కువ యభిమానము. ఆమె గర్భవాసి
యైన మహాసేనాపతి విష్ణుశ్రీ మహాస్కంధునకుఁ బెద్దబిడ్డ
ప్రియమైన బిడ్డ. అందుచేత విష్ణుశ్రీ రాజ్యమున గొప్ప యధి
కారమును తీవియుఁ గలవాఁడు. అతఁడు తల్లియొక్క ప్రోత్సా
హమునఁ జక్రవర్తియొద్దకుఁబోయెను. చక్రవర్తియు విష్ణుశ్రీయు

సమవయస్కులు. అనేకయుద్ధములయందుఁ జక్రవర్తి పజ్జ నిలుచుండి యతఁడు చక్రవర్తికి సాయఁపడినవాఁడు. మహాస్కంధుని తరువాతఁ బూగీయరాష్ట్రాధిపతి కాఁదగినవాఁడు. చక్రవర్తిబల మెచ్చట నున్నది? రాష్ట్రాధిపతులం దున్నది. ఆ విష్ణుశ్రీ చక్రవర్తితో నిట్లనెను. మహారాజా! బ్రాహ్మణునకుఁ దమ క్రొత్తయైన బౌద్ధమతాభిమానము తెలియలేదు కానలయును. నీవు నీ తండ్రివలె బ్రాహ్మణమతపాలనము సేయ నిచ్ఛగించనిచో శాతవాహనులవలె నుభయమతపాలనము చేయుము. అతనిని వదలి పెట్టుట మంచిది' యనెను. చక్రవర్తి నవ్వి 'నా కన్న ద్వేషము, బ్రాహ్మణద్వేషము రెండును బుట్టెను' ననెను. విష్ణుశ్రీ యిట్లనెను. 'ఈ దేశమున నీమాట క్రొత్తదికాదు. ఏవో తెలియక యన్నాఁడు కాబోలు' ననెను. చక్రవర్తి పూర్వవాక్యము నందిపుచ్చుకొని యా మాటను గ్రొత్తమాటను జేసెదను. విష్ణూ! నీ విందులో జోక్యము గల్పించుకొనకు' మనెను. విష్ణుశ్రీ వెడలిపోయెను. కాని యాయన తన మొగమును గంటుపెట్టుకొని పోయెను.

ఇక్ష్వాకురాజుల కోశాధికారి భద్రుఁ డను నొక క్షత్రియుఁడు. వారిది ధాన్యకటకము. ఆ వంశమువా రనాదినుండియు శాతవాహనుల కోశాధ్యక్షులు, మహాధనవంతులు, వేద వేదాంగపారంగతులు. మహాధానుష్కులు. శాంతిమూల మహారాజు సామ్రాజ్యము స్థాపించినంతనే శాతవాహనుల యందు గౌరవముచేత శాతవాహనమహారాజులక్రింద నున్న చాలమంది యధికారులకుఁ దన సామ్రాజ్యమున వారి వారి యుద్యోగములనిచ్చెను. భద్రునితండ్రి శాతవాహనులకోశాధికారి తరువాతఁగొలదిదినములు శాంతిమూలమహారాజునద్దఁ గోశాధి

దారిగా నుండెను. తరువాత భద్రుఁడు వచ్చెను. భద్రునకుఁ బ్రాయశః అఱువదియేండ్లుండవచ్చును. ఆయన కొక్కతెయే కూఁతురు. ఆమెపేరు కాళింది. కాళిందియు నామె తల్లియు ధాన్యకటకమునందే యుందురు.

భద్రుఁ డొక్కఁడె విజయపురమున నుండును. విజయపురముననుండి ధాన్యకటకమునకు కృష్ణమీఁద రాదారి పడవలు నడచుచుండును. దిగువకు వచ్చుచోఁ బదిగడియలు ప్రయాణము. ఎగువ కొక రేయియో, పగలో ప్రయాణము. అతఁడు వారమునకుఁ బది దినములకు ధాన్యకటకమునకుఁ బోయి చూచి వచ్చుచుండెను. ఈ భద్రుఁడన్నచో నిక్ష్వాకు నృపాలురకు మిక్కిలి యిష్టము. అతని పొదుపరితనము మీఁద నతని జాగ్రత్తమీఁద రాజ్యకోశ మంతయు నాధారపడి యుండెను. వారు శాతవాహనులకు నమ్మిన బంటులు. నేఁ డిక్ష్వాకులకు నమ్మినబంటులు. శాతవాహనుల నాటినుండి వారి బ్రాహ్మణమతాభిమానము చెక్కుచెదరనిది. ఆతని తండ్రులు శాతవాహనులతోఁగాని యితఁ డిక్ష్వాకులతోఁగాని యెప్పుడు దేనినిగుఱించి యభ్యర్థించి యెఱుఁగరు. రాజాభిప్రాయములతో వారు జోక్యము కల్పించుకొనరు. వారు కల్పించుకొనకపోవుట చక్రవర్తులకుఁ దెలియును. ఆ భద్రుఁడు చక్రవర్తివద్దకుఁ బోయెను. చక్రవర్తి యతనిని 'తాతా' యని పిలచును. "ఏమి తాతా! నీవుగూడ వచ్చితివి? నాగభట్టును వదలుమని చెప్పుట పనా ? నీ వన్నచో మా కెంత యభిమానమో నీకుఁ దెలియునుగదా! ప్రస్తుతము నా మన స్సెట్లున్నది? ప్రేమ కోపముగాఁ బరిణమించుచున్నది. నీవు వచ్చి చెప్పితివి. నీవంశములో నెవ్వఁడును, నెప్పుడును, నే చక్రవర్తితోడను నభ్యర్థన చేసినది

లేదని ప్రతీతి. నీ కీ విషయమున నభ్యర్థన నంశయోగ్యము
కాదు. మీ వంశములో లేని యీ యభ్యర్థనాగుణము నేఁ డేల
యుదయించినది? తాతా! నిన్నుఁ జూచినప్పుడెల్ల నీకు నాకు
నేదో రక్త సంబంధ మున్నట్లు తోఁచుచున్నది. నా ప్రకృతి
యంతయు రక్తసంబంధమున కెదురు తిరుగుచున్నది. ఆ
బ్రాహ్మణుని గొన్నాళ్లు బాధించి వదలి పెట్టెడివాడనేమో!
ఇప్పుడింక వదలిపెట్టను. బ్రాహ్మణ మతమునందుఁగల యభి
మానము నీ కులమునందు నికషప్రాయ మైనది. అందుచేత
నీ యభ్యర్థనము నేను నిరాకరించుటయే గాక, నిందించుటయే
గాక, నీవసహించినచోఁ నీవపహసించినచో నానుండి యాబ్రాహ్మ
ణాభిమానము పూర్తిగాఁ దొలఁగించినట్లు లోకమునకు విదితము
చేసినవాఁడ నగుదును' అనెను. భద్రుఁడు సాత్త్విక యోద్ధగా
మహారాజుతో మాటాడి యెఱుఁగఁడు. చక్రవర్తియే యతనితో
మాటాడును. తాతా యని పిలుచును. భద్రుఁడు నవ్వి యూర
కుండును. చెప్పినపని చేయును. చక్రవర్తి భద్రునకు మునితాత
యని పేరుపెట్టెను. ఇప్పుడు భద్రుఁడు వచ్చినను నింతవఱకుఁ
జక్రవర్తితో మాటాడలేదు. ఆయన మొగమున రేఖలన్నియుఁ
గుంచించుకొని దుఃఖము మూర్తికట్టినట్లు వెనుదిరిగి పోఁబో
యెను. పోవుచు మఱలఁ జక్రవర్తి వైపునకుఁ దిరిగి దుఃఖభారము
చేత 'నాయనా' యని పిలిచెను. మహారాజా! యని పిలుచుటకు
బదులు నాయనా యని పిలుచుట యేమి? చక్రవర్తికిఁ దెలియ
లేదు. ఆ పిలుపుతోఁ జక్రవర్తికి భద్రునియందున్న ప్రేమాభి
మానములు వందరెట్లయ్యెను. దానితో నాగభట్టును శిక్షించ
వలయునన్న కోపము వందరెట్లయ్యెను. ఈ భద్రుని కొక్క
తెయే కూఁతురు. భార్యయుఁ గూఁతురును ధాన్యకటకమున

నుందురు. ఆ కూఁతురు మహాపండితురాలఁట. ఆమె నలుఁబది యేండ్లు దాటిన స్త్రీ. వివాహము చేసికొనలేదు. చేసికోదఁట. అందందుఁ జూచాయగా నొకవిపరీతమైనవదంతియుఁ గలదు. శాతవాహనులు బ్రాహ్మణులు. వారి సామ్రాజ్య మంతరించినది. అందుచేతఁ దాను వివాహమాడనన్నదఁట. వారిసామ్రాజ్య మంతరించుటకు నీమె వివాహ మాడకుండుటకు నేమి సంబంధము? కొందఱు కొందఱి నిశ్చయములలో, సిద్ధాంతములలోఁ బ్రతిపత్తి యుండదు. పోవుచున్న భద్రుని వెనుకనుండి చక్రవర్తి చూచెను. ఆయన యిదివఱకెప్పుడును భద్రుఁడు నడచిపోవుచుండఁగా వెనుక నుండి యతని నడకతీరు చూడలేదు. చూడవలసిన యవసర మే మున్నది? తన రాజ్యములో లక్షమంది యుండిరి. ఎవని నడకతీ రెట్టిదో చక్రవర్తి కేమిఁ బట్టినది? తన కొడుకు బాహుబల శాంతిమూలుఁడు షష్ఠాబ్దములవాడు ఆ కొడుకు నడువఁగాఁ దాను జూచెను. పలుమంది బాహుబలుఁడు సరిగాఁ దనవలెనే నడచు నని చెప్పుదురు. బాహుబలశాంతిమూలుఁడు సరిగా భద్రునివలె నడచును. కాదు. భద్రుఁడే బాహుబల శాంతి మూలునివలె నడచుచున్నాఁడు.

వీరపురుషదత్తుని కోపము నిష్కారణముగాఁ బెరిగి పోయెను. పెరిగిపెరిగి తాటిప్రమాణమున నిలుచుండెను. ఈకోప మిట్లెందుకు పెరుగుటయో యాయనకే తెలియదు. పొగవిరిసి చెట్టుకట్టిన ట్లతని కోపము పెరిగి మూర్తి కట్టుచుండెను. కొమ్మలు రెమ్మలు ఆకులు చివుళ్ళు పూవుల నన్నియు సిద్ధమయ్యెను. ఆ మహారాజు దానికే యాలోచించ మొదలిడెను. ఈ కోప మెవరిమీఁద నని? ఎందు కని? ఈ కోపమంతయు నెందుకు? తన కేదో యన్యాయము జరిగినది. ఆయన్యాయ మేమి?

తాను క్షత్రియుఁడై యేల పుట్టలేదు. పుట్టలేదని యెవరనిరి? లోకమనుచున్నది. లోకమెప్పుడన్నది? లోకమనలేదు. భట్టిదేవి యన్నది. ఆమె యెప్పుడన్నది? తన్ను కొట్టి కొనుట వివాహము చేసికొనిన నరుల యందుకనియేకదా? చేసికొనిన తరువాతఁ దనయుం డిద్దఱు సంతానమును గన్నదే! కనినను నన్నట్లే. నిజముగా కనలేదు గదా? ఎందు కనలేదు? అనియో యుండును. తాను క్షత్రియుఁడు గాకపోయిన నేమి? శాంతిమూలుని మహాసామ్రాజ్యము తన కరగతమైనది ఇంక నేమి? తన తరువాతఁ దన కొడుకున కీ రాజ్యమంతయు వచ్చును. ఆ కొడుకు క్షత్రియుఁడు. తాను క్షత్రియుఁడు కాఁడు. తాను గాకుండ తన కొడుకు క్షత్రియుఁ డెట్లాను? ఇది కాదు కారణము. తనను బ్రాహ్మణులందఱు నిందించుచుండిరి. తిరస్కరించుచుండిరి. ఎవరు నిందించిరి? ఎవరుతిరస్కరించిరి? అదియేమిమాట? మొన్న నాగభట్టు తిరస్కరించ లేదా? బ్రాహ్మణులను క్షత్రియులట్లు చూచిరి. వారి కా చనవు ఉండెను. ఆ చనవు ననుసరించి యతఁ డట్లు మాట్లాడెను. బ్రాహ్మణుల కా చన వెందులకు? ఎవ రిచ్చినారు? ఎవరు తీసికొనుచున్నారు. అయిన నీదేశములో బ్రాహ్మణుల కీ యాధిక్యమెందుకు? బ్రాహ్మణు లనేకులని బ్రాహ్మణులే వ్రాసిపెట్టుకొనిరి. కొందర వివేకులా వ్రాఁతలనే నమ్ముచున్నారు. ఈ బ్రాహ్మణులకు శృంగభంగము చేయవలయును. బ్రాహ్మణుల గొప్పయేమి? తక్కినవారి తక్కనయేమి? సర్వజనులు సమానులే. ఈ మిథ్యాకల్పితమైన వర్ణవ్యవస్థ యేమి? దీనిని నాశనము చేయవలయును. మూలముట్టుగాఁ బెల్లగించ వలయును. బ్రాహ్మణుల యధికత యేమి? వారికిఁ దిండిలేదే! మహారాజు తానిచ్చినచో బ్రతుక

వలయునే! తా నిచ్చినచో వారు బ్రతుకుచున్నారు గాన వా రల్పులు, తా నధికుఁడు. వారు తనకు లొంగియుండవలయును. తా నిచ్చుటచేత నధికుఁడా? వారు పుచ్చుకొనుటచేత నల్పులా? ఇచ్చినవాఁ డధికుఁడు, పుచ్చుకొన్నవాఁ డల్పుఁడు నన్న భావముమాత్రము తాను గల్పించుకొన్నది కాదా? గొప్ప తక్కువ లన్న భావము లెప్పుడును గల్పితములే. ఛీ ఛీ అట్లు గాదు. ధనము మనది. చేతులారఁ జూచుచుఁ జూచుచు దానిని బరుల కిచ్చుచున్నాము. ఈ ధనము తప్పక గొప్పదియే కావలయును. పుచ్చుకొనుట గొప్పదియెట్లగును? అది నైచ్యము. పగము చచ్చికదా పుచ్చుకొనవలయును. పుచ్చుకొనినవాడు చచ్చిన ట్లుండవలయును. వాఁడును జీవుఁడే కదా! వాఁడును బచ్చియే పుచ్చుకొనుచుండెను. చచ్చిన వాని నింకను జంపుట యెందులకు? చచ్చినవాఁడు చావక బ్రతికియున్నవాఁడు చచ్చునా? ఈ వర్ణవ్యవస్థ లేనిచో బ్రాహ్మణుని యాధిక్య మేమి? బ్రాహ్మణుడు సోమరి. అహంకారి. తాను వర్ణవ్యవస్థ కల్పించి, యందుఁ దన కగ్రతాంబూలము కల్పించుకొని లోకముచేత తాను బనులు చేయించి తాను సుఖముగాఁ గూర్చుండి తినుటకుఁ బతకము వేసినాఁడు. ఈ బ్రాహ్మణుని నాశనము చేసినఁగాని యీ లోకము బాగుపడదు. అరే! బ్రాహ్మణుఁడు వేదములను రక్షించెను. శాస్త్రములను సృష్టించెను. ఉపనిషత్తులను మననము చేసెను. ఇదియంతయు నొక మహాకార్యము. ఒకమహాసంస్కృతి. ఈ దేశమునకు నీ సంస్కృతికిని చెప్పరాని ముడి. ఒక్కొక్క దేశమునం దొక్కొక్క మహాసంస్కారవృత్తము పుట్టును. భిన్నదేశ ములయందు భిన్నసంస్కారవృత్తములు పుట్టవచ్చును. ఈ

మహావిజ్ఞానవృక్షము నాశ్రయించి తద్దేశగతజీవులు మోక్షమును గందురు. సాధనామార్గమునఁ బరిణతులగుదురు. ఆ మార్గము కొందఱకుఁ గొన్ని కాలములయందు రహస్యము కాకపోవచ్చును. ఆ విజ్ఞానశాఖ సఫలకేనందువల్లఁ బ్రయోజనమేమి? ఒక దృష్టితోఁ జూచినచో సర్వదేశములయందు సర్వకాలములయందుఁ బెరిగిన విజ్ఞానవృక్షములు కొందఱు కొందఱి యూహాలే. అవియే యథార్థము లనిగాని, వానివలననే మోక్షము వచ్చు ననిగాని యెవడు సిద్ధాంతీకరించును? ఈ దేశమునందలి యీ విజ్ఞానము బ్రాహ్మణుఁడు రక్షించెను. రక్షించుచున్నాఁడు. రక్షింపఁగలఁడు. ఆ రక్షణ యతని వశమగుటచేత నతనికి సాంఘికముగా నొక యాధిక్యము తనకుఁ దాను కల్పించుకొనెనో, యున్నదో, తెలియదు. ఆ యాధిక్యమువలన నతఁడు చక్రవర్తియైన తనతో నంత చనవుదీసికొని మాటలాడును. అతని కా యాధిక్య మేల యుండ రాదు? తాను మహారాజునని, పరాక్రమశాలినని, యధికారినని, ధనికుఁడ నని తన కాధిక్యగర్వ మున్నది. ఈయాధిక్యగర్వము చేత తాను నాగభట్టును హింసించుచున్నాఁడు. నాగభట్టు తన యాధిక్యగర్వమున నేమి చేసినాఁడు? తన్ను హింసింపలేదే! ఎందుకు హింసింపలేదు? ఎందుకు బాధపెట్టలేదు? బ్రాహ్మణుఁడు తానధికుడనని యిన్ని వేలయేండ్లుగాఁ దక్కిన వర్ణములవారిని బైకి రానీయకుండఁ జేయుట బాధపెట్టుట కాదా? హింసించుట కాదా? పైకి రానీయకపోవుట యనఁగా నేమి? విజ్ఞానమంతయుఁ దనచేతిలోఁ బెట్టుకొని కూర్చుండుట. ఆ విజ్ఞానము విజ్ఞానమే కాదుగదా! బ్రాహ్మణవిజ్ఞానము విజ్ఞానముకాదు. బౌద్ధుల విజ్ఞానమే విజ్ఞానము. సరే, కాదు. తక్కినవారిని బైకి రానీయ లేదుగదా! ధనవిషయికముగాఁ దక్కినవారందఱుఁ బైకివచ్చిరే!

ఆస్తులు వారివి, ధనము వారిది, పరాక్రమము వారిది. రాజ్యములు వారివి. అధికారములు వారివి. ఇవియన్నియు బ్రాహ్మణేతరులవైనను బ్రాహ్మణులు వీరందఱికన్న గొప్పవారనుచుండిరి కదా! అనుకోనిమ్ము. తప్పేమి? ఏమియు లేనివాఁ డనుకొనుట వలన వానికి మనశ్శాంతి. ఆ శాంతియేనా? దేశములో నంద ఱచు దాను జెప్పినట్లువినిపించుచున్నాఁడు. చేయించుచున్నాఁడు. ఒక మాయావాగురలో దేశమును దగుల్కొల్పి తా నుచ్చు త్రాళ్లు చేతిలోఁబూని తనయిష్టము వచ్చినట్లు లాగుచున్నాఁడు. వదలుచున్నాఁడు. ఈ వేటకానిని వధించినఁ గాని పక్షులకు స్వేచ్ఛ లేదు. ఒకవిధముగాఁ జూచినచో తాను మఱలఁ బక్షి. భదంతుఁడు వేటకాఁడు. ఛీ ఛీ, భదంతుఁడు వేటకాఁడు కాదు. ఆయన తన కాచార్యుఁడు. ఏమి యా యాచార్యత్వము? తన కతని సిద్ధాంతము లిష్టము వచ్చుటయేనా? కా దనియే నిత్యములు, పరమయథార్థములు. బ్రాహ్మణ మతసిద్ధాంతము లను విశ్వసించినవాఁడు తనవలెనే యవియు వట్టివే యనఁడా? వాఁడు మిథ్యాజ్ఞాని, నేను యథార్థజ్ఞానిని. ఇంతకు నా కోస మంతయు నెచ్చటినుండి వచ్చినది? నేను బుట్టినచోట పుట్టుక బాగుండదనుకొనుటవలన వచ్చినది. ఇది బ్రాహ్మణులమీఁద నారోపించుట యెందులకు? భదంతాచార్యుఁడు చెప్పినాఁడు నే నది విశ్వసించుచున్నాను. ఈ బ్రాహ్మణవధము చేసియే తీరెదను. ఈబ్రాహ్మణదేవతల నిర్మూలించెదను. మఱియొకఁడు చేయునో చేయఁడో! నేనే చేసెదను. ఇదివఱకుఁ జాలమంది చేయలేదా? చేసిరి. నేనును జేసెదను. ఇదివఱకుఁ జేసినదే మఱల నేల చేయవలయును? ఇది నా కభితృప్తి. నాకు, నేను, జేసితీరెదను."

తరువాతఁ బదిదినములు గడచెను. మరలఁ బదిమంది వచ్చి నాగభట్టు విడుదలకొరకు మహారాజుతోఁ జెప్పిరి. చక్రవర్తి నానాటికి భిగసెను. నాగభట్టు చెఱసాలలో వ్యాధిగ్రస్తుఁడయ్యెను. అతని కుటుంబమంతయు వచ్చి రాజు నభ్యర్థించిరి. 'ప్రభూ! మేము రాజద్రోహులము కాము'మని. రాజు 'బ్రాహ్మణులు సర్వేతర వర్ణద్రోహులు. రాజద్రోహులు లేరు. రాజద్రోహులే' యనెను. ప్రభూ! నాగభట్టు నురితీయింపకుమనిరి. చక్రవర్తి యురితీయింప ననెను. వదలిపెట్టు మనిరి. వదలిపెట్ట ననెను. ఈ యొక్క బ్రాహ్మణుని జంపినందువలన నీకేమి ప్రయోజన మనిరి. చక్రవర్తి, కాదు సర్వబ్రాహ్మణులను వధింతు ననెను. నాగభట్టు మనుమఁడు ఇరువదియేండ్లవాఁడు మహారాజు నెదిరించి బ్రాహ్మణులను వధించుట నీచేతఁగాదనెను. చక్రవర్తి యతనినిగూడఁ గారాగారమున వేయించెను. రెండునెలలలో తాత మనుమ లిద్దఱుఁ గారాగారముననే మరణించిరి.

భద్రుఁడు మహారాజుతో మాటాడిననాఁడు మొదలు వ్యాధిగ్రస్తుఁడయ్యెను. నెలనాళ్లు తీసికొనినతరువాత నందఱును నీ భాగ్యయు కూతురు ధాన్యకటకమున నుండిరి; అచ్చటకుఁ బొమ్మనిరి చెప్పిరి. భద్రుఁడు వినలేదు. నే విశ్వాకులను నమ్మి కొలిచితిని. వారిసనిధముననే చనిపోదునని చెప్పెను. నాగభట్టు నతని మనుమఁడు చనిపోయిననాఁడే భద్రుఁడును జనిపోయెను.

# నవమాధ్యాయము

నదీతీర భూములను వెనుకనుండి చల్లనిగాలి వచ్చినచో పైని వానలు కురిసెను. ఇదికిఁ బ్రోత్సాహము తగులునని తెలిసినట్లు నాగభట్టునవధతో పాటు బౌద్ధమతము విజయపురములోఁ బ్రబలు నని బౌద్ధులందఱకుఁ దెలిసెను. ఈ వార్త మేఘాలమీఁద సింహళ దేశమునకుఁ బోయినది. చైనాదేశమునకుఁ బైనముకట్టెను. త్రివిష్టపధాత్రిలోఁ బరవళ్లు ద్రొక్కెను. ఈ సర్వదేశములనుండి బౌద్ధభిక్షుకులు స్త్రీపురుషులాంధ్ర దేశాభిముఖముగాఁ దండోపతండములుగా రా నారంభించిరి. నెల, రెండునెలలో, విజయపురము బౌద్ధభిక్షుకులతోఁ గిక్కిరిసిపోయెను. వీరందఱకు భోజన భాజనము లెట్లు? వసతు లెట్లు? శిరోముండనము, కాషాయ వస్త్రము, కక్షపాలతోఁ గనుపించినమాత్రాన నెవ్వఁడైనను మహారాజ దర్శనము చేయవచ్చును. రాచనగరు రాచనగరువలెఁ గన్పింపలేదు. ఒక బౌద్ధవిహారమువలెఁ గన్పించెను. భదంతుఁడు వట్టి ధ్యానాచార్యుఁడు కాఁడు. వట్టి భిక్షువు కాఁడు. అతఁడు శిల్పి, వాస్తుశాస్త్రజ్ఞుఁడు. అన్యసంఘాచార్యుల సంప్రదాయము వాఁడు. ఈ అన్యసంఘాచార్యులు పశ్నగ్రామ నివాసులు. దీఘనికాయము, మధ్యమ నికాయము, పంచమాతృకలు, వారి యభిమాన గ్రంథములు. భదంతున కీ గ్రంథములు కంఠస్థములు. ఈయన యే మహాచైత్యస్థలమున నాగభట్టు శివాలయ నిర్మాణము చేయఁ బ్రయత్నించెనో యాస్థలమున మఱల మహాచైత్యనిర్మాణమును బ్రారంభించెను. ఒక్క పెట్టుగాఁ బట్టణము నకును నాగార్జునుని కొండకును నడిమిప్రదేశ మంతయు

చైత్యములు విహారములు స్తూపములు - వీని నిర్మాణ
మారంభమాయెను. ఈ మహానిర్మాణము సర్వ కార్యక్రమము
నకు ధనము ప్రజలనుండి, రాచనగరునుండి ప్రవాహముగా
వచ్చెను. ఒక్క చిత్రము. ఏ విహారమునకు, నే చైత్యము
నకు, నే స్తూపమునకుఁ జక్రవర్తి యొక్క చిల్లిగవ్వ యీయ
లేదు. చక్రవర్తి యొక్క పుత్రికయైన శాంతిశ్రీ మహాదేవి
బౌద్ధనిర్మాణములకు బంగారు నాణెములు కుంచములతోఁ
గొలుచుచుండెను. రాచనగరు నాగార్జునికొండ నడుమనున్న
యీ ప్రదేశమంతయు విహారము, స్తూపములు బయలుదేరెను.

నాగార్జునికొండ విజయపురి నానుకొని యున్న కృష్ణా
తీరమువెంట నెగువకు నొక క్రోసెడు దూరము వ్యాపించి
యుండెను. ఆపర్వత ప్రత్యంత ధాత్రియంతయు విహారములతో
నిండిపోయెను. మొట్టమొదట నొక స్తూపము. స్తూపనిర్మాణము
గుండ్రముగాఁ జేసి దాని నిటుకరాతితోఁ గట్టుదురు. ఆస్తూపము
యొక్క మధ్యభాగమున బుద్ధదేవుని శిరోజమో, దంతమో
ప్రతిష్ఠింతురు. దాని నొక భిక్షుకుడు భద్రముగాఁ దన
కమండలువులో నుంచుకొని నిత్యదీపధూప నైవేద్యము
లతోఁ దీసికొని వచ్చును. 'శిరోజము నా కొక పరమాచార్యుఁ
డొసంగెను. నే నాయనను శుశ్రూషించి పదేండ్లాయన సేవఁ
జేసి యాయన దయ సంపాదించి మధ్యమ నికాయ మాయన
వద్దఁ బాఠము చెప్పించుకొంటిని. ఆయన నా కిది దయ చేసి
నాఁడు.' 'నేను సింహళద్వీపమునఁ బదునాలు సంవత్సరములు
గురుశుశ్రూష చేసితిని. ఈబుద్ధదేవుని దంతము సింహళములో
నొక కుటుంబమునందు వందయేండ్లుగా నుండెను. వారు దీనిశ
భక్తిశ్రద్ధలతోఁ బాలించుచుండిరి. నేను వారి కుటుంబమునకు

మహోపకారము చేసితిని. వారు కృతజ్ఞతాపూర్వకముగా దీనిని నా కిచ్చిరి. ఇట్టి వనేకములు కథలు. ఒక దంతమో యొక శిరోజమో వచ్చినతోడనే యొక స్తూపనిర్మాణారంభము. ఒక యిరువదియో పాతికయో గజముల చుట్టుకొలతతో స్తూపము నొక్క నిర్మాణ మారంభమగును. రెండు నిలువుల యెత్తున జుట్టునుగోడ పెట్టిదాని యట్టడుగున నొక బంగారపు బరణిలో నీ బుద్ధదేవుని శిరోజమో, దంతమో నిక్షేపించి, యాబరణిలో కొంత ధనముంచి బరణిమూత పెట్టి యాబరణినందు స్థాపింతురు. ఈ రెండు నిలువుల యెత్తున్న గుండ్రని గోడలోపలి భాగమంతయు మట్టితో నింపుదురు. మన్ను పైభాగమునందు గుబ్బగాఁ బోసి దానిపై నొక చిన్న యాలయమువలె నిర్మించి యందులోఁ జిన్ని బుద్ధవిగ్రహ ముంతురు. ఈ గోడకు వెలుపలి భాగమున నొక నిలువెడెత్తున మన్ను పోసి చచ్చదరముగా నెత్తైన వేదికచేసి యీ వేదికయంతయు రాళ్ళతోఁ జక్కని సమప్రదేశముగాఁ జేయుదురు. స్తూపమునకు నాల్గువైపుల నీ మహావేదికనుండి యెక్కుటకు దిగుటకును సోపానములు నిర్మింతురు. ఇది స్థూలమైన స్తూపనిర్మాణము. భారతదేశము నందలి యితర స్థలములయందు స్తూపనిర్మాణము లింతటితో నిలుచును. కాని, విజయపుర సమీపదేశమైన పలనాడు పాలరాళ్ళకును, నానావర్ణములుగల మెత్తనిరాళ్ళకును బ్రసిద్ధమగు దేశమగుటవలన నా రాళ్ళతో శిల్పము, పెక్కయలంకారములు సిద్ధముచేయబడినవి. స్తూపమునకు నాల్గువైపుల నాయక స్తంభములు బయల్దేరినవి. ఈ సంప్రదాయ మమరావతిలోఁగూడఁ గలదు. నాల్గువైపుల నున్న వేదులకు ముందు నాల్గు నాల్గులు పదునాఱుకంబములు నిలువఁ బెట్టబడెను. ఈకంబములు తెల్లని

పాలరాతి కంబములు నాలుగైదు నిలువుల యెత్తుననుండి, పై భాగమునందు క్రిందిభాగమునందుఁబూజలు చెక్కఁబడి యా స్తంభములు స్తూపములకుఁ దెచ్చిన యందము వర్ణనాతీతము. ఈ శ్రీపర్వతబౌద్ధులకు శ్రీపార్వతీయులు,అంధకు లని పేర్లువచ్చెను. ఇందులో మతముల రెండు తెగలు. పూర్వశైలీయు లని, యపర శైలీయులని పిలువఁబడు చుండిరి. స్తూపమునకుఁ జుట్టు వేదికిఁ పై భాగమునకు నిలువెత్తయిన స్తూపకుడ్యము చుట్టును పాల రాతిమీఁద శిల్పములు చెక్కఁబడి తాపటము చేయఁబడు చుండెను. ఈ స్తూపములలోఁ బ్రతిస్తూపమునకు నంటుకొని విహారముండెను. స్తూపమునకు నాలుగువైపుల నాల్గు పూజా మందిరములు, దాని చుట్టును బ్రదక్షిణ మంటపము. కుడి కొండముల రెండువైపుల రెండు చైత్యగృహములు, ముందు శిలామంటపము. తక్కిన మూఁడువంకల మూఁడు చతుశ్శాలలు నిర్మింపబడి, దీని యంతకును సంఘారామ మని పేరు కలిగెను. ఎడమవైపుననున్న చైత్యమునకు డగోబాచైత్యమని కుడివైపున నున్న చైత్యమునకు బుద్ధచైత్యమనియుఁ బేర్లు. ఈస్తూపనిర్మాణము ప్రత్యేకముగా నాంధ్రశిల్పమునే సూచించు చున్నది. ఎంత బౌద్ధమత మైనను బూర్తిగాఁ దత్పూర్వ మందున్న బ్రాహ్మణ శైవమును మఱచి పోలేదు. ఆయక స్తంభముల యొక్క శిఖరముల యందుఁ ద్రిశూలములు చిత్రింపఁబడి యెను. ఈ యాయక స్తంభములయొక్క పంచసంఖ్యాత్వము బుద్ధుని జీవితములోని పంచమహాఘట్టములను సూచించునని వారి యుద్దేశము. బుద్ధుని జన్మ. బుద్ధుని రాజ్యపరిత్యాగము, అతఁడు బుద్ధుడైన స్థితి, ప్రథమోపదేశము, నిర్వాణము- ఈ పంచఘట్టములును బునఃపునః వేయిరూపములుగా శిల్పాకృతిఁ

దాల్చినవి. బోధివృక్షము, ధర్మచక్రము, స్తూపము మున్నగువాని యొక్క యాకారములు చిత్రించిన శిల్పిచేతికి విసుగు లేక పోయెను. వీనిలో శాక్యసింహుండు బుద్ధుండైన స్థితి మఱియుం బ్రాధాన్యము పొంది యాయక స్తంభముల యెనిమిటిలోని నడిమి స్తంభమునం జిత్రీకరింపంబడెను. భారతదేశమున నుదయించిన, విజృంభించిన, యేమతమైనను నాంధ్రదేశమున దాని పరిపాకదశం బొందుచుండెను. వేదమతము పాంచాలదేశమును, వింధ్యోత్తరదేశమును వదలి దక్షిణాపథమునం బ్రవేశించినంతనే ప్రవేశించుట యనినంత నార్యుల దండయాత్రావిషయము కాదు. ఆర్యులు దండెత్తివదిలేరు. అంతకు మున్నచ్చట ద్రావిడులును లేరు. ద్రావిడు లనిపించుకొన్న దైత్యులుకూడ వర్ణాశ్రమాచారసహితులు. రాక్షసులలో మహారాక్షసులు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వృషపర్వుండు క్షత్రియుండు. రావణుండు బ్రాహ్మణుండు. అనంగా దక్షిణాపథమునందు వేదమతము సుంకు దేరెను. అందులో నాంధ్రదేశమునందు వేదములను వేదమతములును బరమోచ్చస్థితి నందెను. ఆంధ్రులు మధుర వేదపాఠకులు, సర్వశాస్త్రనిష్ణాతులు. యాస్కాచార్యుం డాంధ్రుడు. ఆపస్తంభుం డాంధ్రుడు. వేదభాష్యకర్త విద్యారణ్యుం డాంధ్రుడు. ఇట్లు వేదమత మాంధ్రదేశమునందే పరమోత్కృష్టదశ నందెను. శైవమతము నిచ్చటనే యభివృద్ధి పొందెను. అప్పయ్యదీక్షితులవారు, పాల్కురికి సోమనాథుడు విద్దఱును శివాద్వైతమును వీరశైవమును బోషించినవారు. అట్లే బౌద్ధమతమును, నాంధ్రదేశమున గ్రొత్తక్రొత్త పంతరింపులు సంతరించుకొనెను. బుద్ధుడు ధర్మవాది. దైవము లేడు. కర్మలు లేవు. నీతివాదము చేసెను. ప్రతివాదము చేసెను. ఆతని మత మాంధ్రదేశ

మునకు వచ్చినయంతనే క్రొత్త క్రొత్త కల్పనలు చేసికొనెను. బుద్ధుఁడే దేవుడన్నారు. మఱియు నంధకబౌద్ధశాఖీయులు సర్వ బౌద్ధగ్రంథములకును ప్రామాణిత్వము నీయలేదు. అంధకబౌద్ధులు భదంతానందాచార్యుని సంప్రదాయము కలవారై మహాసాంఘికులైరి. వీరికి దీఘనికాయము, మజ్ఝిమనికాయము, పంచ మాతృకలు ప్రమాణగ్రంథము లాయెను. భదంతునకు దీఘ మజ్ఝిమనికాయధారి యని బిరుదువచ్చెను. ఇతరాచార్యులు ధమ్మకథికుఁడని, ధమ్మధారుఁడని, వినయధారుఁడని,మాతృకధారుఁడని బిరుదులు పెట్టుకొనిరేకాని నికాయధారుఁడని బిరుదుపెట్టుకొనలేదు. ఉభయశైలీయులైన యంధకులు పాళిశాఖీయులు కారు. తేరవాదులు. మాతృక యనగా అభిధమ్మపిటకము. ధమ్మము వేఱు. అభిధమ్మము వేఱు. బుద్ధుని ముఖమునుండి వెలువడిన సూత్రములకే ధమ్మపథమని పేరు. అభిధమ్మమనఁగా ధమ్మపథమునందలి వాక్యములం దీసికొని చేసిన యితర విషయముల చర్చ. అందుచేత అంధకబౌద్ధులు చర్చావాదులు. అభిధమ్మ మార్గస్థులు. విషయమును చర్చించి, దాని నిగ్గుతీయుట యాంధ్రుల రక్తములోని గుణము. ఏమతమైన నేమి? కాలానుసృతి నొక్కొకప్పుడొక్కొక మతము, ధర్మము వ్యామోహింపఁ జేయుచు. దానివల్ల వివాదములు రావచ్చును. ఆంధ్రజాతి లక్షణము చావదు. ప్రతిష్ఠానము నంటుకొని యున్న విహారములు, విద్యాశాలలు, ఈవిద్యాశాలలకు సర్వోత్తరభారతదేశము నుండియు సింహళ, చీనా, త్రివిష్టపదేశముల నుండియు వేలను వేలు విద్యార్థులు వచ్చుచుండిరి. వీరియొక్క విద్యావ్యాసంగానుకూలార్థము విహారములు పదులు నిరువదులు వృద్ధిపొందెను. విహారమనగా లోకకళాశాల, శిల్పశాలలతోపాటు వసతిగృహము

కూడ. మహాచైత్యమునందు మహాస్తూపమున్నది. తక్కిన ప్రతి విహారమునందు నెదురుబళ్ళుగా డగోబాచైత్యము, బుద్ధ చైత్యము విహారములోని భాగములుగా నిర్మింపఁబడుచుండెను. ఈవిహారములలోని యీచైత్యములు చిన్నచిన్న గదులు. డగోబా చైత్యమునందుఁ గొంచెము పొడుగుగా నున్న గది చివర నొకస్తూపము నిర్మింపఁబడి యుండును. ఆ స్తూపముయొక్క ముందరిభాగము వెసులుబాటుగాఁ బదిమంది నిలుచుండి ధ్యానము చేయుట కనువైన స్థలము. బుద్ధచైత్యముకూడఁ బ్రమాణమున డగోబాచైత్య మంతదై యుండును. ప్రతిబుద్ధచైత్యమునం దును గోడ కంటుకొని యెత్తైన స్థలమునందుఁ బాలరాతితోఁ జెక్కబడిన బుద్ధవిగ్రహముండును. తక్కిన విహారమంతయు వసతిగృహములు. ఒక్క విద్యార్థి యుండుటకు, ఇద్దరు విద్యార్థు లుండుటకు వీలుగా నన్నియు గదులు. ప్రతిగది లోనికిఁ జక్కఁగా గాలి రావచ్చును. చిన్న యెత్తయిన యరుగుచేసి, యా యరుగుమీద నొక నాపరాయి పఱుపఁ బడియుండును. ప్రతి విద్యార్థియు నీ గదిలోనున్న రాతిపైఁ గూర్చుండి చదువుకొనును. కృష్ణానదిలోనుండి నాగార్జునుని కొండమీఁదికి జలము యంత్రములద్వారా తోడఁబడి నిలువ చేయఁబడి యుండును. ఈ ప్రదేశమునుండి ప్రతివిహారమునకును రాతితూములద్వారా, గొట్టములద్వారా జలము సమృద్ధిగా నందింపఁబడుచుండెను. నాగార్జునుని కొండకొనవద్దఁ బెద్ద లోయగా నేర్పడి యాలోయ నంటుకొని మఱియొకకొండ యడ్డముగా వ్యాపించియుండెను. ఈలోయగుండఁ బైనుండి యొక వాఁగువచ్చి కృష్ణానదిలోఁ బడుచుండును. విజయపురమునకుఁ బడమటిభాగమునఁ గృష్ణానది ప్రవహించుచుండెను. వాయవ్య

దిక్కున నాగార్జునకొండ యుండెను. ఈ వాఁగా మహాపట్ట
ణమునకు నైశాన్యదిశయంతయు వ్యాపించియుండెను. నాఁగున
ఈశాన్యదిశయందు పట్టణము వ్యాపించని విడిబయలును క్షేత్ర
భూములును నుండెను. అచ్చట సింహళులు తాము వేఱే విహా
రములు నిర్మించుకొనిరి. ఆ విహారములోని దగోబాచైత్య
నిర్మాణముక్రొత్తగాఁ జేసిరి. స్తూపమధ్యములోపలనాగకే మన్ను
నింపక యష్టకోశపద్మాకృతిగా నిటుకలతో గోడలుపెట్టి దానిని
మట్టితో నిర్మించిరి. ప్రతిదినము నుదయముననే సర్వవిద్యార్థులు
కృష్ణాస్నానమునకుఁ బోవుదురు. సూర్యోదయ మగుటతోడనే
స్నానములు చేసి వచ్చి తమ విహారస్థదగోబాచైత్యమునకుఁ బది
మంది పదిమందిగాఁ బోయి ప్రార్థనము చేసి బుద్ధచైత్యములోని
కేగి పుష్పములుబుద్ధదేవుని పాదములయందుంచి వృక్షచ్ఛాయల
యందు సహపంక్తిచేస్తూ నికాయాదిగ్రంథబోధనము విందురు.
అచ్చటిచదువు వొక్కమతమేకాదు. శిల్పము, సంగీతము, రసాయన
శాస్త్రము, ప్రకృతిశాస్త్రము, తర్కవ్యాకరణములు, స్థపతి
శర్మ వాస్తువు రాజకీయములు, సర్వశాఖలయందును విద్య
నేర్పఁబడుచుండెను. వారమునకొకసారి సర్వవిహారగతసర్వ
విద్యార్థులు మహాచైత్యమున సమావేశమగుదురు. ఆనాఁడు
భదంతాచార్యుఁ డుపన్యసించును. ఈసర్వకళాశాలాసమష్టిరూప
మైన విశ్వవిద్యాలయమునకు భదంతాచార్యుఁ డుపాధ్యక్షుఁడు.
చక్రవర్తి మేనత్తయైన శాంతిశ్రీదేవి సర్వవిశ్వవిద్యాలయ
ములకును పోషకురాలు. చక్రవర్తి సర్వాధికారి. రాజ
ధానిలో నున్న ప్రతిదినమును చక్రవర్తి తన కూతురైన
కొడబలిశ్రీదేవితో సాయంకాలములయందు మహాచైత్యము
నకుఁ బోయి వచ్చుచుండును. మేనత్త శాంతిశ్రీదేవి యనేక చైత్య

మత మవలంబించును. అవలంబించినచో వారియాస్తులు వారికి మిగులును. వారి ప్రాణములు వారికి దక్కును. అదివఱకు జైలు సాలలోఁ బెట్టఁబడినవారు వదలిపెట్టఁబడుదురు. రాజుయొక్క కోపము తరతమభావమున ప్రజ్వరిల్లుచుండెను. బౌద్ధమతము స్వీకరింపమని చెప్పిన బ్రాహ్మణ కుటుంబముయొక్క యాస్తు లన్నియు రాజుకై వసముచేసికొనును. స్వీకరింపకపోవుటయేకాక బౌద్ధులను నిందించినచో వారిని జైలుసాలలోఁగూడ వేయును. బౌద్ధధర్మముతో, మతసిద్ధాంతములతోఁ జన్నను దిగినవారికి మరణదండన విధించును. చక్రవర్తి సేనలను దీసికొని సుప్రసిద్ధ మతాచార్యులను వెంటఁబెట్టుకొని ప్రతిగ్రామమునకుఁ బోవును. బ్రాహ్మణు లందఱను సమావేశ పఱచును. వివదించనంత బ్రాహ్మణు లందఱు బౌద్ధు లయినచో నా గ్రామములోనిశివాలయములు ధ్వంసముచేసి తిరిగి వచ్చును. లేనిచో బంధితులైన బ్రాహ్మణులను వెంటఁ దీసికొని వచ్చును. ప్రతి దినము నీ బంధితులైన బ్రాహ్మణు లందఱను బట్టమహిషీసౌధ పశ్చిమ కుడ్యగత విశాలగవాక్షమున కెదురుగ నున్న వీధివెంట సాయంకాలములయందుఁ దీసికొని పో నాజ్ఞాపించును. పట్టమహిషి గవాక్షమునుండి వారివంకఁ జూడవలయును. వారి నచ్చటనుండి తీసికొని పోవలయును. భట్టిదేవి యా బ్రాహ్మణావమానమును జూడలేక తొలుతటి దినములలోఁ దన గవాక్షమువద్దకు వచ్చెడిది కాదు. బంధితులైన బ్రాహ్మణుల నుంపట్లు బాధింపఁబడుచుండెడిది. పరిచారికలు పోయి చెప్పిరి.

భట్టిదేవి: అవునవును! నా మనస్సు మాత్రమే హింసింపఁబడుచున్నది. వారి శరీరములుగూడ హింసింపఁబడు చేలకో? అని పోయి చూచెను.

బాహుబలశాంతి మూలుఁడును, కొడబలిశ్రీదేవియును భట్టమహిషికి సంబంధము లేకుండఁ జేయఁబడిరి. వారిరువురును నిరబాధభావములతోఁ బెంచఁబడుచుండిరి. ఇట్లుండఁగా నాంధ్ర దేశమునం దంతటను బౌద్ధమతము పాతుకొని పోయెను. పెంపొందెను. చెట్లు గట్టెను. ఈ బౌద్ధమత మహావిజృంభణ మహోత్సవము చేయవలెనని చక్రవర్తి సంకల్పించెను. ఆ మహోత్సవము నచ్చి చూడవలెనని పట్టమహిషి కాజ్ఞ పంపించెను. పట్టమహిషి వత్తునని లేదు, రానని లేదు. ఒకనాఁడు చక్రవర్తి కొక యనుమానము తగిలెను. తా నింకను బట్ట మహిషిని ప్రేమించుచుంటినా? యని. ప్రేమించక పోయినచో నీయుత్సవమునకు రాకపోయినచో నిన్ను శిక్షింతు నని నోట కబురంపలేదు- యువరాజు బాహుబల శాంతిమూలుఁ డప్పటికిఁ బదునాలుగేండ్ల వాఁడు. కొడబలిశ్రీదేవి పదునొకండేండ్లది. తన సోదరియైన యడవిశాంతిశ్రీయు, బావయైన స్కంధవిశాఖ నాగుఁడును, వనగొక్క శ్రీపర్వతమునకు బెదరి బౌద్ధులైరి. అడవిశాంతిశ్రీ కొన్ని ఛాయక స్తంభములను దానముచేసెను. రాజవంశములో బౌద్ధమతము స్వీకరింపనివా రిద్దరే - విష్ణుశ్రీ తల్లి కామశ్రీదేవియును, వాశిష్ఠీభట్టిదేవియును మహారాజునకు భట్టిదేవిమీఁద ననురాగము తగ్గెనా? తగ్గలేదా? చక్రవర్తి యంతఃపురమునుండి భట్టిదేవికి సంవత్సరము కొక్కసారి కానుకలు వెళ్ళుచుండెను. పట్టమహిషి పుట్టినదినము పండుగకుఁ బ్రతిసంవత్సరము చక్రవర్తి యామెకు వేయి బంగారు నాణెములు, పట్టుచీరలు, పండ్లు పంపించుచుండెను. ఆమె నిరాకరించదు. ఎప్పటి కప్పుడు బ్రాహ్మణవధయు, శివాలయనిర్మూలనము జరిగినప్పుడెల్లఁ జక్రవర్తి యామెకు వార్త లంపించును.

మేనత్త శాంతిశ్రీదేవియే వృద్ధురాలు; కామశ్రీదేవి యంతకన్న వృద్ధురాలు. చక్రవర్తి యామెను హింసింప నెంచలేదు. పైగా విష్ణుశ్రీ తనకు మిత్రము. అతఁడు బౌద్ధుఁడు భట్టిదేవిమాత్రమే యతనికి మనశ్శల్యమై యుండెను. భట్టిదేవిని హింసపెట్టినచో రాజ్యమునం దశాంతిబయల్దేరును. బాహుబలి విశాఖస్కంధుఁడు మొదలైనవారు మనస్సులలో బ్రాహ్మణ మతాభిమానము చావనివారు. అప్పుడప్పుడు రాజునకు వినవచ్చు చుండెను. ఇక్ష్వాకులరాజ్యపు టెల్లలయందుఁ గల రాజులందఱును తనకు బంధువులైనను, తనయందు వ్యతిరేకాభిప్రాయము కలవారని. వారును రాజ్యమునందలి కొందఱు మండలేశ్వరులును, దండ నాయకులును లోలోన నీ బౌద్ధమత నిర్మూలనముకొఱకు నిక్ష్వాకురాజ్య నాశనముకొఱకు తంత్రములు పన్నుచున్నారని, యా తాంత్రికులలో విశాఖస్కంధనాగుఁ డొకఁడని రాజునకుఁ దెలియును. కాని చక్రవర్తి యేమి చేయుటకును వీలులేక పోయెను. మేనత్త శాంతిశ్రీ రాజబంధువులలో నెవరిమీఁదను నీ మతద్వేషత ప్రసరించుట కిష్టములేనిది. భదంతాచార్యుఁడు దినదినము చక్రవర్తితోఁ జెప్పుచుండును. "ఈ హింస పనికి రాదు. ఇది బౌద్ధధర్మము కాదు. మీరు క్షమించినచో — మీరు బౌద్ధులుకారు. ఇదిగాక మీ హృదయాంతరాంతరముల నున్న యొకతృప్తి బౌద్ధమతాభిమానముగాఁ బరిణమించెను. ఈ పరిణామము నా మతముయొక్క పవిత్రత్వమునంతను నపవిత్రత్వము చేసెను. ఈ హింసతోపాటు రాజబంధువుల హింసయు సాఁగెనేని, నే నీవిహారములు, స్తూపములు, చైత్యములు సర్వమును వదలివేసి పోయెదను. భట్టిదేవి పట్టమహిషి,

ఆమె మనస్సునఁ జెడిపి కష్టము నా మతమునకు శ్రేయోదాయి కాదు. ఒక ప్రాణి హింసింపఁబడెనేని, యొక మతస్థాపన జరుగుట జరుగుటకాదు" అని.

# దశమాధ్యాయము

ద్రోణకర్ణ దుర్యోధన దుశ్శాసన శకున్యశ్వత్థామాదులు పదిమందియుఁ జుట్టిముట్టి రథమునుగ్గుచేసి ధనుస్సుభగ్నపఱచగా నోటినుండి కత్తి వెడలి యభిమన్యుఁడాకసమున కెగిరెను. అచ్చటి నుండి యెవరిమీఁదికి దూఁకునో యని యా మహాయోధులలో నెవరికి వారు ప్రాణాశలు వదలుకొనిరట. ఆంధ్రదేశమునందలి మహేశ్వరలింగము లట్లు భయపడిరి. వీరపురుషదత్త చక్రవర్తి తాను చేయఁబోవు బౌద్ధమహోత్సవమునందుఁ దాను జేసిన బ్రాహ్మణ నిర్మూలనచిహ్నముగా నేదో యొక శివలింగమును బెఱికి తెచ్చి దానిశిరస్సునఁ దనపాదమును బెట్టి మట్టించునట. శ్రీ శైలమల్లికార్జున భ్రమరాంబిక వామాంగమున నేకబాహుపరిష్వంగమునఁ గనులు జొత్తులుగా నేడ్చెను. శివశివ సటీపాథోలవపవిత్ర రేఖ, హృషీకేశపాదాంబుజ వినిర్గతలహరీమాలిక వీరపురుషదత్త బాదతాడనభీతియై దిక్కులందుఁ జిందెను. తచ్ఛిరస్థకారికక చంద్రమశ్శకల మధురరేక కందిపోయెను. పార్వతీప్రథమగర్భము వినాయకుఁడు తొండమెత్తి గీపెట్టెను. ఈ విలయ మెట్లోడ్డుకొందునా యని మల్లికార్జునుఁడు కొన్న మల్లడి వెల్లడియయ్యెను. అప్పటి కైదువందల యేండ్ల క్రింద నాంధ్రవిష్ణువుచేత మన్నన లందిన శ్రీశైలస్వామి యయ్యాంధ్ర భృత్యుల భృత్యులైన యిక్ష్వాకులచేతఁ గడగండ్లుపడి మ్రగ్గ

వలసిన తనస్థితి తలంచుకొని భయముచేత మూఁడుకన్నుల
వెంటను నీరుగార్చెను. ఆహా! ఈశివుని పురాణవైభవము! కంటి
నిప్పుకణముల మిణుఁగురుల వెట్టలో సగము కాలిన మన్మథుని
మీఁద దయపుట్టి పాపములేకుండ బ్రతికించిన యా తైక్ష్ణ్య
ప్రసన్నతలు నేఁడేమైనవి? నేల యఱదమై, బంగరుకొండవిల్లయి
వెన్నుఁడమ్మై తన్మ్రుచూలి బండినాఁడై, నెలయుఁ బ్రొద్దును
బండికోఁజాలై పెద్ద మొనగానివలె మూడూరులుఁ ద్రవ్వఁగోటేరు
లెత్తిన యీపొలముకాపరి నేటికి వీరపురుషదత్తునిపేరు చెప్పిన
మాత్రాన గజగజ వణఁకెను. ఇంతకు నాయనభయము నిర్హేతు
కము. వీరపురుషదత్తుఁడు శ్రీశైలమల్లుని గదలింప నెంచలేదు.
క్రొత్తగా నేస్వామిని గదలింప నెంచలేదు, తానిదివఱకే పెల్ల
గించి తెచ్చిన వందలింగములు రుబ్బుపొత్రములవలె మొగ
సాలలోఁ బడియుండెను. అందొకటి చాలదా? మహాచైత్యము
ముందుప్రదేశమునఁ బానవట్టము కట్టి యొకశివలింగము నందు
నిక్షేపించి శివలింగమునకుఁ జుట్టుకొని శిరస్సున ఛత్రీకృత
మైన సప్తఫణామండలము సమర్చి వీరపురుషదత్తుని పాద
తాడన ప్రయోగార్హముగా నునిచిరి. ఈ మహాచైత్యపురో
భాగమున సర్వజనమును గూర్చొనుటకుఁ బ్రదేశ మేర్పాటు
చేయఁబడెను. చక్రవర్తియుఁ బట్టమహిషియు నాసీనులగుటకు
మహోన్నతవేదికపై రెండుసింహాసనములమర్పఁబడెను. ఆసింహా
సనములయొక్క పై భాగమున హేమమయవస్త్రముల వితా
నములమర్పఁబడి వానికి ముత్యాలు, గోమేధికములు వ్రేలాడఁగట్టఁ
బడెను. ఆ ప్రదేశముచుట్టును దండనాథులకు, మండలాధి
పతులకు సముచితాసనము లేర్పఱుపఁబడెను. పట్టమహిషి
కొఱ కేర్పఱుపఁబడిన సింహాసనముకెలనఁ దక్షిణ నలుఁగురు

రాణులకును గనకపీఠము లేర్పఱుపఁబడెను. ఉత్సవదర్శనాగత సర్వజనులును గూర్చుండుటకు దూరముగా నేల యంతయు జదును జేసి కలయంపిచల్లి, చాపలు వేసి, పైని రత్నకంబళములు పఱచి సర్వవిహారగతభిక్షుకవిద్యార్థులు విద్యార్థినులు సమాసీనులగుటకు మఱియొకచోట నియమింపఁబడెను. ఉత్సవము రాజసౌధముముందు బయల్దేరి పట్టణవీథులన్నియుదిరిగి చిట్టచివరకు మహాచైత్యమువద్దకు వచ్చును. ఉత్సవము బయల్దేరెను. మునుముందు దుష్టసమూహముమీఁద భేరికాఢక్కాపటహకాహళాదివాద్యములు బోరుకొనెను. ఆవెనుక యుద్ధమునకు యోగ్యములై యాహవధనంజయధూమశేఖలువోని మత్తసామజములగుంపు బంగరుహౌదాలతోఁ జెక్కిళ్ళయందు, ఫాలభాగములయందుఁ జేయఁబడిన యలంకారరంగవల్లీభక్తిచ్ఛేదములతో, మందమందగమనములతోఁ బాహ్యప్రసారితకరాగ్రవివృతసర్పముఖాభాధరవిస్ఫురణాలతో రాచవీథియొలుకఁ బోయు చూపులతో కుంభనిషణ్ణాధోరణులచే నడుమ నడుమ యందీయఁబడుచున్న భక్ష్యగ్రహణపరాయణోత్ప్రసారితకరతిరశ్చీనచలనములతో, హౌదాలక్రింద వేలాడుచున్న ఘంటికానాదలయానుసరణచిత్రస్వానములతో నేగుచుండెను. ఆ వెనుక పదివేలమంది రెండుక్రోశముల పొడుగున నిరువు రిరువురుగా బారుగా నిలుచున్న సర్వవిహారనివాసులగు భిక్షుపవిద్యార్థులు. ఇంతపొడుగునను దామరతూండ్లతోఁ బూవులతోఁ గాఁగిలి కమరనంత లావైన వెంటిగాఁ జుట్టబడిన యొక మహామాల. గజము గజ మెడముగా నిద్దరిద్దఱు భిక్షుకులు: ఈదండ యాభిక్షుకుల భుజములమీఁదనుండి వచ్చి నేలను వ్రాలును. మఱల ముందున్న యిద్దరు భిక్షుకులభుజములమీఁదికిఁ

బోవును. దీర్ఘాతిదీర్ఘమైన, శేషాహిపుచ్ఛాభిరామమైన గోకనదపుండరీకసమ్మిశ్రితమైన బహువిస కాండ మృదువైన యీ మహామాల నిట్లుగా, నింతపొడుగును, భిక్షుకులు మోయుచు నడచుచుండిరి. ఈమాల యట్లు మోయఁబడుచున్నంతమేఱయు, నిరుపార్శ్వములయందును వారాంగనలు నృత్యగీతాభిరామసుందరశరీరవదనారవిందలై పూవులతోఁ గుంకుమతో నామాల నలంకరించుచుండిరి. నడుమ నడుమ వెంటనేవచ్చు బలీవర్దశకటములమీఁద నిలుచుండి గంధర్వుల వలె, దేవతలవలె నేపథ్యరచన చేసికొన్న కొందరు సుందర పురుషు లీ మహామాలను పైనుండి గ్రహించుచుండిరి. కొన్ని వందలమంది మఱుగుజ్జువాండ్రను నానాదేశములనుండి తెచ్చిరి. వారు వికృతవేషములు వేసికొని, దండ నేలకురాలిన యెడలందు మూలకు ధూళిస్పర్శ లేకుండ భుజములమీఁద నెగచుచుండిరి. ఈ మహామాలికావహనము వెనుక ధర్మచక్రములు కొన్ని వందలు మోయుచు, బౌద్ధాచార్యులు ముండితశిరస్కులు, ఆపాదకంఠలంబమానశితకాషాయవస్త్రధారులు మధ్యాహ్నసూర్యాంశుతీక్ష్ణనేత్రరోచులు, మజ్ఝిమనికాయములలోని సూత్రముల బఠించుచుఁ బోవుచుండిరి. ఆ వెనుక శృంగారపల్యంకికలలో రాణివాసము బయలుదేరెను చక్రవర్తి రాణివాసమునకు ముందు, బౌద్ధాచార్యులకు వెనుక భదంతాచార్యులతో గూడి పట్టపుటేనుఁగుపై నమర్పఁబడిన మణులతో జేయబడినవిమానములో నాసీనుఁడై యుండెను. మేనత్త శాంతిశ్రీదేవి పరితోషరసప్లుతయయ్యు నివలితముఖరేఖ, విశాలకుంకుమతిలకాభిరామఫాలభాగ, వాడిన లవలీకిసాలయములవంటి చెక్కిళ్లతో, బౌద్ధభిక్షుకురాలివలె మఱల రాజాంగనవలె మణులతోఁ

గుట్టిన యంచుగల తెల్లని శాటి భుజాగ్రభాగముల శంతాక్కలను
సందలి పలుచని తెల్లని మొగిలిపొరవలెఁ దళతళలాడఁ పుష్పక
యానముమీఁద నెక్కి తనయల్లునకుఁ గుడివైపునఁ బోవుచుండెను.
ఆ వెనుక గుఱ్ఱములమీఁద నెక్కియుఁ బాదచారులయియు వాహిని
యంతయు నడచుచుండెను. రెండున్నర కోసముల పొడుగున
విస్తరించిన యీ యూరేగింపు బయలుదేరి చక్రవదనముగాఁ
బదికోసములు పొడుగు, పది కోసములు వెడల్పుగల యా
మహానగరమంతయు నుదయము గడియ ప్రొద్దెక్కగా బయల్దేరి
సాయంవేళ గడియ ప్రొద్దున్నప్పటికి మహాచైత్యస్థలమునకుఁ
దిరిగి వచ్చెను. ఈ జనమంతయు సర్దుకొని కూర్చుండునప్పటికి
రాత్రిలోఁ గొంతభాగము గడచెను. ఆనాఁడు కార్తిక పూర్ణిమ.
చంద్రుఁడు వెన్నెలలు విరియించుచుండెను. ఒండు విరిగిన నది
పోలె, మాయాదేవి స్వప్నమునఁ గనిపించిన తెల్లని ఱెక్కలతో
నొప్పుచున్న తెల్లని యేనుగుదాట్లవలె, బుద్ధదేవుని మనోవీధివలె,
నతఁడు నిర్మించిన మతములోని నీతిదారులవలె, తెల్లపూవు
చిదిపి పొడిపొడిగాఁ జల్లినచో రేకలులేని యా పూవు,
పుప్పొడిలేని యా పూవు, కేసరములేని యా పూవు, జల్లెడ
ప్రతినలె విరిసి కన్నులలోఁ గొట్టినట్లు అమవసనాఁటి యాకసము
లోని యుడుసంతానము దగ్గర దగ్గర కుదించుకొని ముఖము
మీఁదికి వచ్చిపడుచున్నట్లు వెన్నెలలు వెల్లివిరిసెను. భదంతా
చార్యుని చేతిలోని మణికమండలూద్గారికృష్ణాతటినీ శీతపాథోలవ
లహరీ ప్రతిస్ఫూర్తియైన యా శారదిక జ్యోత్స్నాలహరీపూరము
దిశావారము కబళించిన ట్లుండెను. హరి వజ్రాయుధమును
దిరస్కరించిన గరుడి ఱెక్కల తెల్లదన మా వెన్నెలలముందుఁ
గొందలపడెను. బ్రహ్మదేవుని వాహనమైన మరాళరాజ కరు

దంచల కనకచ్ఛవి తాను లేనన్నట్లు భయగ్రస్తమై తెల్ల మొగము వైచెను. బోధితరు కిసలయాగ్ర వ్యగ్రతమచ్ఛవి మంథరమైన యా చిక్కని వెన్నెలలు, చొక్కపు వెన్నెల వలె ముద్దులు ముద్దులుగ నేలకు దిగెను. పరమ సౌందర్యవతీ శిరోవతంసమైన షష్ఠిశ్రీదేవి కపోలభాగ విరచితమకరికా పత్రములదాఁక వచ్చిన యా వెన్నెలజిగి, తన పోవు త్రోవలో నడ్డంకి తగిలిన సరస్వతిపుష్పవలె మెలికలు తిరిగిపోయెను. ఆ మహాప్రదేశమున నమర్పఁబడిన యే పీఠము నుద్దిష్టవ్యక్తిచేత సమాశ్రితము కాకుండ నుండలేదు. అంతటి సభలో నొక్క పీఠముమాత్రమే శూన్యమై యుండెను. అది పట్టమహిషి కొఱ కేర్పడిన సింహాసనము. నిశ్శబ్దమైన యాసభలోఁ గొంతసేపటికిఁ గలవరముపుట్టెను. చక్రవర్తి బట్టమహిషిని బ్రతీక్షించుచున్నట్లు కనుపించెను. రుద్రధారాదేవి తానుబోయి పట్టమహిషి.నిబిలుచు కొని వత్తుననెను. ఎవరుపోయి పిలుచుటకును జక్రవర్తి యంగీ కరించలేదు. జనములోని కలవరము క్రమముగా వృద్ధిపొంది చెవులు పట్టరానిదయ్యెను. చివఱకు సభానిశ్శబ్దత కొఱకు రాజాజ్ఞకై మ్రోఁగిన భేరీనినాదము చేతఁగాని సద్దణఁగలేదు. చక్ర వర్తి కన్నులు పాటలిమ వహించెను. అతని ముఖమునందలి నరములన్నియు నుబ్బి ముఖము తేజోదుర్నిరీక్ష్య మయ్యెను. ఇంతలోఁ గోడబలిశ్రీ తండ్రివద్దకుఁబోయికూర్చుండవలయునన్న యూహతో బయలుదేరి తల్లి కొఱ కేర్పఱుపఁబడిన సింహాసన ముపైఁ గూర్చుండెను: కూర్చుండి తండ్రిపైఁ జేయివైచెను. ఆసింహాసనముపైఁ గూతురుకాదు, మఱియొక దేవతాస్త్రీకాదు, పట్టమహిషికాక మఱి యెవరు కూర్చున్నను శిక్షార్హులు. చక్రవర్తి, చక్రవర్తినుల కేర్పడిన యా సింహాసనము అన్య

జనా స్సరణకు దూరమైనది. దానిపైన మఱి యెవ్వరైనఁ గూర్చుండినచో శిరచ్ఛేదనమే దానికి శిక్ష. దండనాథులు మంత్రులు, రాజాధికారులు వెల వెలఁబోయిరి. చక్రవర్తి కోడబలిశ్రీనంతఁ దీక్ష్ణముగాఁ జూచి, తిరస్కారముగాఁ జూచి, యేమియు మాటాడుటకుఁ దోఁచక యూరకుండెను. కోడబలి కీ సంగతి యేమియుఁ దెలియదు. ఆమె పట్టమహిషి సింహాసనము నుండి లేచి తండ్రి యొడిలో వచ్చి కూర్చుండెను. తల్లినుండి యెడమ చేయఁబడిన యాపిల్ల తండ్రి నద్ద రాజవంశములో సహజముగానుండు దూరము లతిక్రమించిన చనవు చక్రవర్తి నద్ద గలిగి యుండెను. పిల్లనుఁ బదియేండ్లు వచ్చినను, రాజవంశ కన్యా యోగ్యమైన పరివర్తనగాని, కొన్నిటియందు విస్పష్టమైన విజ్ఞానము గాని యామె కా మెతండ్రి కలిగించలేదు. ఆమెకు నాడినది యాట. పాడినది పాటగాఁ బెంపకము జరిగెను. తండ్రికిఁ గోపము వచ్చినదని తెలిసినచోఁ బోయి యాయన యొడిలోఁ గూర్చుండుట యామె కలవాటు. అదియుఁగాక యీ సింహాసనములయొక్క పావిత్ర్యము, తదుల్లంఘనమువలన శిక్ష, సర్వజనులకుఁ దెలిసినది కాదు. రాజాధికారుల కందఱకుఁ దెలియును. రాజాంతఃపురములో నున్న పెద్దవారికిఁ దెలియును. పసిపిల్లయైన కోడబలిశ్రీకిఁ దెలియదు. అందఱు నేమి జరుగునో యని భయపడుచుండిరి. చక్రవర్తి యామెను తన యొడిలోనుండి తీసి మఱలఁ బ్రక్కనున్న సింహాసనములోఁ గూర్చుండఁ బెట్టెను. చక్రవర్తి మొగముచూడగా సగముకోపము, సగము శాంతము. ఆ కోపము పట్టమహిషి రాలేదన్న కోపముగా నందఱు గుర్తుపట్టిరి. తెలిసిన రాజాధికారులు జరిగిన సింహాసన మర్యాదాతిక్రమణము లోనలోననే గ్రుక్కిళ్ళు మ్రింగిరి. అంతటఁ జక్రవర్తి

లేచి శివలింగ సమీపమునకు విధురవేగమున నడచి, మదపు
టేనుంగు పరుగెత్తినట్లు విధురవేగమున శరీరావయవములు
విలాసదీప్తుల నీనంగాఁ బాదమంజీర మణికింకిణీ కుణుకుణు వినాద
గంభీరముగా వాయుసారమున ఫెడేలు ఫెడేలు మని శివలింగ
జటాశేఖరమును తాడనము చేసెను. బంగారముతోఁ జేసిన
పాముపడఁగ విఱిగి తొలఁగిపోయెను. యమకరస్పర్శమాత్రిచేత
మార్కండేయ రక్షణార్థము, లింగోద్భవభాగము చీలికలుగాఁ
యాద్రిశూలపాణియై యావిర్భవించిన గంగా సరిచ్ఛీతాంశుమాళి
కిర్కుడు మనకుండ లోనివాఁడు లోననే యిమిడి యుండెను.
సమావిష్టులైన సర్వజన హృదాయాంతరాళముల బుద్ధదేవుని పరి
చారకుఁడుగా భావింపబడిన పరమేశ్వరుఁడు వారి భావములనే
యనుసరించెను. శ్రీమన్నారాయణదేవుని భృగుమహర్షి పాద
తాడనము చేసెను. విష్ణు వేమిచేసెను? ఈ శివకేశవు లిద్దఱు
నొక చదువు చదివినవారే. మనవాఁడూరకొనలేదా మనము
నట్లే యూరకొందమన్నట్లు శివుఁడు తానుగూడ వట్టి శిలా
త్వమునే పొందెను. తత్కాలవినదిత భేరినినాదపటహముల
బోరుకొన్న మహారావమునకు సర్వాకాశము బీటిచ్చెను. తన్మ
హాస్వనతరంగములు కృష్ణవేణీ జలబిందుమధ్య వీథులయందుఁ
జొచ్చి కష్టాజలము పొంగెత్తెను. ఆ మహాస్వనమును గలహంస
కంఠకూజితమువలె సర్వవిహంగగర్భములు దీర్ఘీకరించెను.
అంతటఁ జక్రవర్తి సర్వభిక్షువులకుఁ గావిశాటులు, ఫలములు,
బంగరునాణెములు కానుక లిప్పించెను. విద్యార్థులలో నుత్త
మోత్తములకు బహుమానము లీయఁబడెను. బౌద్ధాచార్యులు
కొందఱు లేచి చక్రవర్తి నభినందించిరి. చక్రవర్తి సభాపూర్తి గాఁ
గాకముందే హఠాత్తుగా సభలోనుండి లేచిపోయెను. తత్ప్ర

దేశమంతయు నిర్జనమగు వేళకుఁ జంద్రుఁడు పశ్చిమాకాశమున గొంచెము మాసిన వెండి బిళ్ళవలెఁ గనుపించెను. తరువాత వారము దినములవఱకుఁ జక్రవర్తి సౌధాంతర్భాగము వదలి వెలుపలికి రాలేదు. ఎవ్వరును జక్రవర్తిని జూడలేదు. చక్రవర్తి యేమిచేయుచుండెను? ఆయనకుబట్టమహిషిమీఁదఁబట్టరానంత కోపము వచ్చెను. ఒకసారి యామె పట్టమహిషీత్వము తొలగించవలయు ననుకొనెను. ఒకసారి యామెను గారాగారమున వేయవలయు ననుకొనెను. మఱియొకసారి యామెను సామాన్య బంధితురాలివలె శిఖలవెంటఁ బిలిపి శిరశ్ఛేదనము చేయవలయుననుకొనెను. ఇక్ష్వాకు సామ్రాజ్యము కాదంబుల, కౌంతిపుల, తదితర పరిసరరాజ్య నాయకుల రక్షణమీఁద సురక్షితముగా నున్నది. భట్టిదేవికి నమర్యాద జరిగినచో నామె తలిదండ్రు లూరకుండరు. వా రిక్ష్వాకురాజ్యముపైఁకి దండెత్తి వత్తురు. ఎత్తివచ్చిన నేమి? మున్ను దాను వారి నోడించియే కదా భట్టిదేవిని తీసికొనివచ్చెను. మఱల నోడింపలేఁడా? మఱి ప్రస్తుతస్థితిలో శత్రువు లెత్తివత్తురేని, తనదండనాయకు లెందరు తన వైపుననుందురు? తన సామ్రాజ్యమున నున్న బ్రాహ్మణు లందఱుఁ బరరాజ్యములం దాశ్రయ మేర్పఱచుకొనిరి. బ్రాహ్మణులు కుత్సితులు. జితులమారులు, వా రెత్తులమీఁద నెత్తులెత్తి సామ్రాజ్యములు పడఁద్రోసినవారలు. పల్లెటూరి జీవనము మొదలు సామ్రాజ్య జీవనమువఱకు వారి నీతిచేతఁ దలక్రిందు లగుచుండును. ఈ బ్రాహ్మణు లితర రాజ్యములం దేమేమి చేయుచున్నారో! ఏది యెట్లయినను భట్టిదేవికి శిక్ష జరుగవలయును. ఆరే! భట్టిదేవి పట్టమహిషి! సామ్రాజ్యమునఁ దా నెట్టివాఁడో యామె యట్టిది. తన యిష్టముకొలఁది దాను

బౌద్ధ మతము స్వీకరించినచో, నామె యిష్టముకొలఁది యామె స్వీకరింపక యుండరాదా? తా నీ నూతన మార్గము లేల యవలంబించు చుండెను? దీనికి మొద లేమి? భట్టిదేవి ప్రేమను సంపాదించవలయు ననికదా! తాను క్షత్రియుఁడు కాఁడనుకొనుచున్న భట్టిదేవికిఁ దాను క్షత్రియుఁడ నని నిరూపించుటకేకదా! ప్రధానముగా క్షత్రియుఁడేమి? బ్రాహ్మణుఁడేమి? వర్ణవ్యవస్థ కల్పితము. ఒక పురుషుని నతని శక్తి చేత, మేధావిశేషముచేత, గుణక్రమముచేత, విద్యాసంపత్తిచేత, నెన్నవలయును కాని, వాని పుట్టుకచేత, వర్ణముచేతఁ గాదనికదా! తనకు పలువురు రాణులున్నారు. ఒక్కరాణియు రాణివలె నుండదు. భట్టిదేవి ముఖాంభోజమునందలి శోభ, యామె కన్నులలోని గాంభీర్యము, నామె చెక్కిళ్ళలోని బిగువుగల పలుచఁదనము, విశాలమైన ఫాలభాగము, చెవులనంటియున్న కనుదమ్ముల వైశాల్యము, ముంగురులు లేవో యున్నవో యన్న ట్లున్న పాపట నొకటి మర్యాదావైఖరి, యామె యున్నతమైన విగ్రహము నామె నడచెడి తీరు, నామె చూచెడి వైఖరి... సర్వము మహారాజ్ఞీత్వమునే సూచించును. ఆమె తన్నెప్పుడు నిరాకరించలేదు. తిరస్కరించలేదు. తనమాట కెదురాడలేదు! ఆమెను గుఱించి యంత యూహించు టెందులకు? ఆమె తప్పుచేసినచో శిక్షించరాదా? కొడబల్లి(శ్రీ) తప్పుచేసెను. తాను శిక్షించెనా? కొడబలి పసిపిల్ల. తెలియకచేసెను. పసిపిల్లయే యనుకొనుము. ఆపనియే మఱియొక బాలిక చేసినచోఁ దాను క్షమించునా? తన కూఁతురు గనుక, తన యల్లారుముద్దుబిడ్డ గనుక యామె తప్పును క్షమించెను. పట్టమహిషిమాత్రము తన ప్రియతమాతిప్రియతమ కాదా? ఇతర రాణులయందుఁ దనకు సంతానము

లేదు. తనకున్న నొక్క-కొడుకును యువరాజు బాహుబలుఁ డామె సంతానము. రేపు బాహుబలుఁడు పెద్దవాఁడైన తరు వాతఁ దన తల్లిని దనతండ్రి తప్పుకాని తప్పునకు శిక్షించె నని తెలిసికొన్నప్పుడేమిచేయును? ఇప్పుడే యువరాజు తనకుఁ దెలియ కుండఁ దల్లి యింటికిఁ బలుసార్లుపోయి వచ్చుచుండును. ఇంతకును, దాను భట్టిదేవిని శిక్షింపకుండుటకుఁ గారణ మేమి? తన నొక్క- సర్వప్రజలుఁ దన్నుఁగూర్చి యేమనుకొందురు? భార్యను జాలనివాఁ డనుకొందురా? బౌద్ధమతము స్వీకరింపని బ్రాహ్మణులను సంహరించునంత తెలివిగా భార్యను శిక్షించుట! ఛీఛీ! భట్టిదేవిని శిక్షించి తీరవలయును. ఆమెను చెఱసాలయందుంచుటకు తా నాజ్ఞ నీయవలయును. ఈ యాజ్ఞ నెవరు పాలింతురు? మహాదండనాయకుఁడు స్కంధవిశాఖ నాగుఁడు పాలించునా? అతఁడుపోయి తన యక్క-గారిని జెఱసాలలో నుంచునా?

చక్రవర్తి యిట్లాలోచించుచుఁ దనకుఁ దెలియకుండఁగనే రాజసౌధములయందుఁ దిరుగుచుండెను. ఆయన తన్నుఁదానెఱుఁగకయే యొకసౌధాంతరమునకుఁ బోయెనుగాఁబోలు. అచ్చట నొక శిలావిగ్రహ మున్నది. దాని కెదురుగా నెవరో కూర్చుండి యేదో యనుచున్నారు. చక్రవర్తికిఁ దనయొడలు తనకుఁ దెలిసెను. అది తన తల్లియైన మాఠరీదేవి శిలావిగ్రహము. ఎదురుగాఁ గూర్చున్నది తన సోదరియైన అడవిశాంతిశ్రీ. శాంతిశ్రీ చక్రవర్తి వంకఁ జూడలేదు. అతఁడు వచ్చెననియే యామె యెఱుఁగదు. ఆమె యిట్లనుచుండెను. 'అమ్మా! నేను బౌద్ధురాలను గాదు. చక్రవర్తికిఁ గోపమువచ్చునని బౌద్ధమతము స్వీకరించితిని. నీ యల్లుఁడును నావలెనే. అమ్మా! తమ్ముఁడు నీకడుపునఁ బుట్టలేదా? శాంతిమూలచక్రవర్తికతఁడురస్యుఁడుకాఁడా? వినచో

నతని కీ బ్రాహ్మణద్వేష మేల పుట్టెను? తాను బాదుకు కా వచ్చెను. బ్రాహ్మణులను హింసింపనేల? హింసించెబో, పరమ శివుని మౌళిపైఁ దన పాదములు పెట్టెనా? తల్లీ! ఏమతములోని సిద్ధాంతములు పరమప్రమాణము లని యెవరు చెప్పెదరు?— ఆ యీ మతస్థుల కపి శిరోగ్రాహ్యములు, పరమతము నందలి దైవతము నిట్లు పరాభవించుట పరమతస్థులను బరాభవించుటకుఁ గాని, తేజోమయములైన యీ దేవతాభావములకు ముక్కులున్నవా? చెవులున్నవా? కన్నులున్నవా? చక్రివర్తియైన నా తమ్మునకు— నీ కడుపునఁ బుట్టిన బిడ్డకుఁ గలలోనైన నీవు గన్పించి యీ సంశయమును నివారింపుము. ఈ జగద్విప్లవము నోర్వలేకున్నాము పట్టమహిషియైన భట్టిదేవి దినదిన మురికంబమున కెదురుగాఁ బోవుచున్నది. తల్లీ! చక్రవర్తికి, దన మనస్సు తనకుఁ దెలియుట లేదు. ఆమె నతఁడు హింసించి చంపినను నామెచనిపోయినను మఱునాఁడు నాతముఁడు బ్రతుకలేఁడు. చక్రవర్తి తనంతటఁ దానే చనిపోవును. మేనల్లుఁడు బాహుబలుఁడు పసివాఁడు, రాజ్యము నిర్వహించుకోలేఁడు. ఈవిపత్తును దొలగించి నీవు నీ బిడ్డలఁ బాలింపవలయును."

చక్రవర్తి యీమాటలు వినుచు వినుచుఁ దన గుండెలోని శాంతిత్వమెల్ల నీటికన్నుఁ గలుచఁ బడునట్లు భావించెను. పోయి యక్కగారి పాదములమీఁద వ్రాలి క్షమింపు మని వేడికొందమనుకొనెను. కాని శాంతిశ్రీ కనులు మూసికొని ధ్యానమగ్నయయ్యెఁ గాబోలు. తనవంకఁ జూడలేదు, కదలలేదు. చక్రవర్తి మఱల తన సౌధమునకుఁ బోయెను.

అది యర్ధరాత్రము. శాంతిమూల చక్రవర్తియు, వీరపురుషదత్తుఁడును గలసి మెచ్చటికో కాలినడకమీఁదఁ బ్రియా

ణము చేయుచుండిరి. దారిలో నొక మహానది యడ్డము
వచ్చెను. తనతండ్రి చక్రవర్తి, తాను జక్రవర్తి. ఏనుఁగులు లేవు.
గుఱ్ఱములు లేవు, పరిచారకులు లేరు. వారిరువురు నా మహానదీ
తరణము స్వయముగా దిగి నడచి చేయవలసి వచ్చెను. చివరి
కొంక గుండములో శాంతిమూల మహారాజు తనకొడుకు నెత్తు
కొని యీఁదెను. తన కాగుండ నుండలేదు. తాను దనతండ్రి
యంత యెత్తున్నాఁడు. తన కేటి కందలేదు? తనతండ్రి నడిగెను.
తండ్రి యిట్లు సమాధానము చెప్పెను. 'ఈ నదీదేవతను నేను
సమారాధించితిని. ఈమె నా కందును. నీవు నారాధింపుము.
నీకు నందును.' ఇరువురు నెచ్చటి కెచ్చటికో పోయిరి. ఆపోయిన
పోకడ సువ్యక్తముగా లేదు. చివరి కొక మహానగరమున నొక
యంగడిలో నిలుచుండఁగా నెవరో వచ్చి భట్టిదేవి మరణించె నని
చెప్పిరి. తనగుండె బ్రద్దలయ్యెను. భార్యావియోగముచేత,
నతని మనస్సు దందహ్యమాన మగుచుండెను. ఆ దుఃఖము
నతఁడు పట్టుకొనలేక పోయెను. శ్మశానధాత్రి యతని మొగ
ములో వచ్చి కూర్చున్నట్లుండెను. శాంతిమూల చక్రవర్తి
కొడుకున కాహారమై యతని నచ్చటినుండి యెచ్చటికో కొని
పోయెను. బాహుబలుఁడును, గోడబలియును నాలుగేండ్ల లోపు
పసిపిల్లలు. దుఃఖించుచున్న తనవద్ద కెవరో యా పసిపిల్లలను
దెచ్చి తనచేతి కందీయఁబోయిరి. ఆ పిల్లలు తనవద్దకు రాలేదు.
అయ్యో! నాకెక్కఁ దాను తండ్రియే కదా? ఈ దుఃఖ
మెంతటిదో, యాపడిన బాధ యెంత చిక్కనయో, గుండె పట్టు
కొనలేక వీరపురుషదత్తుఁడు తాను జచ్చిపోవుచుంటి నను
కొనెను! ఇంతలో మెలఁకువ వచ్చెను. చక్రవర్తి యేమి యా
నందపడెను. అమ్మయ్యా! భట్టి బ్రతికియే యుండెను.

# ఏ కా ద శా ధ్యా య ము

చూచి నమ్మనఁగాల్చినచ్చుట పలుమంది రాజసేవకులు బుద్ధివైషమ్యము. ఎవఁడో హనుమంతునివలె నిదిలోకోపకారక హేతువుగాని తక్కిన హనుమంతులవలె నిది దానికి విపరీతము. రాజు బ్రాహ్మణులను హింసింపు మనఁగా ననుయాయులు బ్రాహ్మణాభిమానము కల తాప్పులనుగూడ హింసింప నారంభించిరి. రాజు హింసింపు మనలేదు. అన్నట్లే యర్థముచేసికొనిరి. హింసయనిప్రారంభింపవలయునుగాని, పురుషుఁడేమి, స్త్రీయేమి, శిశువేమి, పశువేమి. ఈ హింసకు రాజముద్రవచ్చును. హింస కాదు, శిక్ష యనిపించుకొనును. దానివెనుక నున్న దౌర్మాగ్యము క్రౌర్యము. పరిపాలనాదక్షత రాజనీతివైశారద్యమనిపించు కొనును. లోకమునం దందయు నింతియ. ఏ దుష్క్రియకు సామాన్యమానవుడు శిక్షాపాత్రుఁడగునో యా దుష్క్రియకు రాజు ప్రశంసాపాత్రుఁ డగును. అస లోక ద్రుష్క్రియ యేల చేయఁబడవలయును? దుష్క్రియలు రాజు అధికారి, ధనవంతుఁడు, పేదవాఁడు, అనధికారి యందఱును జేయుదురు. అది యెప్పుడు చేయఁబడినను స్వార్థాపేక్షనేఁ జేయబడును. అల్పునియందలి స్వార్థాపేక్ష వానియందు మాత్రమే ఫలవంతమై, యన్యులకు ఫలదాయిని కాదు. అధికునియందలి యీదుష్క్రియ వానికిని స్వార్థమును సంపాదించిపెట్టును. వాని నాశ్రయించి పలుమంది యుండుటచేత యా స్వార్థఫలము పలుమంది కుపయోగపడుటలోఁ గొంత మంచిగాఁ బరిణమించవచ్చును. పాపపు పని నేతాదృక్పరిణామదృష్టితోఁ జూచి

పున్నెపుపనిగా జమకట్టుదుమా, తమకుఁ దమకు లాభించుచున్న తెఱవుఁజూచి పలుగుంది రొక యధికునిచేతలు విమర్శింప వచ్చును.

భాగ్యకటకమున నొక ధనవంతుల యిల్లు కలదు. ఆ యింటిలో నొక వృద్ధురాలయిన తల్లియు, వయసుచెల్లినయామె కూఁతురును నివసింతురు. వారు క్షత్రియులు. ఇంటిలో వేఱే మగదిక్కు లేదు. ఆ యింట నిత్యము బ్రాహ్మణసమారాధనము జరుగుచుండును. బ్రాహ్మణులు గుంపులు గుంపులుగా వచ్చి పోవుచుందురు. కాని చక్రవర్తి తీవ్రశాసనము ప్రబలిననాఁటి నుండియు బ్రాహ్మణులు విడివిడిగ నొక్కరొక్కరుగా నిద్దరిద్దరుగాఁ గొందరు ముసుఁగులు వేసికొని, కొందరు నక్కినక్కి పడపడంబడి లోపలికి వత్తురు, పోదురు. పూర్వము రాజభటులే యూరివా రా యూరనే నియమింపఁబడుచుండిరి. సామాన్యముగా నొక యుద్యోగిని పరాటమాటికిఁ బలుతావులకు మార్చుట యుండెడిది కాదు. రాజు తీవ్రశాసనము మొదలుపెట్టిననాఁటినుండియు నే యుద్యోగియు నొక్క పట్టణముననే యెక్కువకాల ముండుట లేదు. ఆ యూరివారు, నా యూరివారి నెఱిఁగినవారు నా యూరిలో నుద్యోగులుగా నుండరాదు. తొల్లి రాజభటులు, నుద్యోగులు, విద్యావంతులై, దయార్ద్రహృదయులై సాధువులై యుండెడివారు. ఇప్పుడు నిరక్షరులు, మోటువారు, నిర్దయులు, స్వార్థాభిలాషులుఁ దత్తదుద్యోగములకు నియమింపఁబడిరి. వారిలోఁ బ్రతివారును రాజదండము తన చేతిలోనికి తీసికొని, యధికముగా వినియోగించి తమ యుద్యోగమునకు నాధిక్యము తెచ్చుకోవలయు నని ప్రయత్నించువారే! అట్టియొక సామాన్యభటుఁ డీగృహమునకు

బ్రాహ్మణులయొక్క నక్కినక్కి వచ్చుటలు, పోవుటలు, పలుమార్లు పరీక్షించి, యచట బ్రాహ్మణమతము ప్రజ్వరిల్లుచున్నదని, దాని నాశ్వవలయునని సంకల్పించెను. తనపై యధికారితోఁ జెప్పెను. ఇద్దరు నొకరి నొకరు సాయపడిరి. ఒకనాఁడు పదిమంది భటులతో నా యింటిమీఁదికి దాడివెడలిరి. లోన సమావిష్టులై వేదము పఠించుచున్న బ్రాహ్మణులను హింసించిరి. ఆ తల్లికూఁతుండ్ర నిద్దఱను దీసికొనిపోయి చెఱయందుంచిరి. కాని యే బంధితుఁడును నెలదినములకుమించి యితరగ్రామముల యందుండరాదు. ఈవార్త రాజునకుఁ దెలిపిరి. రాజు వారిని రాజధానికిఁ బంపింపుమనెను. తల్లి కూఁతుండ్రిద్దఱు నాయుధపాణులైన రాజభటులచేత రక్షింపఁబడుచున్న పడవలో విజయపురముచేరిరి. విజయపురములోని రాజధానీకారాగారములోఁ బ్రవేశపెట్టఁబడిరి. సామాన్యముగా రాజధానికిఁ జేరిన తర్వాత నా బంధితులఁగూర్చిన విచారణ రాజుచేతనో, తన్నియమితాధికృతులచేతనో నెలనాళ్ల లోపుగానే జరుగవలయును. వీరియిద్దఱి విచారణయు నధికృతులచేతులలోఁబడెను. అధికృతుఁడు వారి నిట్లు ప్రశ్నించెను. ఆప్రశ్నలకుఁ గూఁతురే సమాధానము చెప్పచుండెను. 'మీ రెవరు?' 'మేము క్షత్రియులము.' 'మీదే యూరు?' ఆమె నవ్వెను. అధికృతునకుఁ గోపము వచ్చెను. మఱల గద్దించి యడిగెను. 'ఏ యూరు?' 'విజయపురము'. 'ఒడలుఁ దగ్గఱ పెట్టుకొనిసమాధానము చెప్పుము'. 'ఒడలెప్పుడు దగ్గఱనే యుండును.' అధికారి కోపమును దిగమ్రింగెను. 'నీపేరేమి?' 'కాళింది.' 'నీ తల్లి పేరు?' 'చంద్రచూడ.' 'నీ తండ్రిపేరు.' 'భద్రుఁడు' 'నీతండ్రి బ్రతికియుండెనా?' 'నాతల్లి వంకఁజూడుము.' 'నీవురాజావమానముగా మాటాడుచున్నావు.

'ఏ రాజావమానమునకు నేనే ప్రధానహేతువను'. 'ఈ సమా
ధానములచేత నీశిక్షను వృద్ధిచేసికొను చున్నావు'. 'నా శిక్ష
యిదివఱకుఁ బొందిన యాధిక్యమే వృద్ధియగుటకు వీలు లేనంత
దైనది' 'నీ తండ్రి బ్రతికి యున్నప్పుడు చేసినవృత్తి యేమి?'
'రాజసేవ.' అధికారి తటపటాయించెను. 'ఏమి యుద్యోగము
చేసెను? 'ఇప్పు డది యంతయు నెందులకు?' 'కాదు, చెప్పవల
యును.' 'అది పదియేండ్ల క్రిందటిమాట.' 'ఎప్పటిదైన నేమి?
చెప్పుము.' 'మహారాజకోశాధికారి.' అధికృతుఁ డుదీర్ఘాలోచనలో
మునిఁగెను. ఈ వ్యవహారము తనను దాటిపోయెను. మఱల
వారిని గొనిపోయి కారలో నుంచుఁ డని చెప్పి తాను బోయి
ప్రస్తుతకోశాధిపతిని నాఁటి సాయంకాలము కలసికొని భద్రుని
గుఱించి యడిగెను. అతఁ డిట్లు చెప్పెను. 'భద్రుఁడు, భద్రుని
పూర్వులు శాతవాహనరాజుల కోశాధికారులు. భద్రునితండ్రి
శాంతిమూల మహారాజువద్దకు వచ్చెను. తండ్రి కొడుకు
లిద్దఱును చక్రవర్తులకు నమ్మినబంటు' లని, భద్రునిగుఱించి
వ్రాసియున్న తాఁటియాకులు వెలికిఁదీసి యందులోఁ జివరిపంక్తు
లిట్లు చదివెను. "భద్రుఁడు చనిపోయినప్పుడు చక్రవర్తి నాల్గు
దినములు భోజనము చేయలేదు. రెండు దినములు రాజ్యవ్యవ
హారములేవియు జరుగలేదు.' ఈ మాటలు వినుచునే యధి
కృతునకు భయము వేసెను. ఆ యధికృతుని పేరు సూక
భిక్షువు. అతఁడు బౌద్ధుఁడో, కాఁడో యతనికే తెలియదు. పది
యేండ్లక్రింద నీత డెవఁడో యెవరికిని దెలియదు. ఈ పది
యేండ్లలో రాజధానిలోఁ బ్రధానాధికృతుఁ డయ్యెను. అతని
ప్రధానమైన గుణము బ్రాహ్మణు లనినతోడనే విధిగా శిక్షిం
చుట. ఆ శిక్షించుటలోఁ దీవ్రతఁ జూపుట. శిక్షాపత్రమునందు

రాజునుగూర్చి పొగడ్త, బౌద్ధమతమునుగూర్చిన ప్రశంస, బ్రాహ్మణమతమునుగూర్చిన నింద - ఇవి సమృద్ధిగా నుండుట, అతని కింతటియక్కట్టు పూర్వము రాలేదు. ఆభద్రునిభార్యయుఁ గూఁతురునా? వీనిని నఱికివేయవలయును.' పోయి రక్షకభటాధికారికిఁ జెప్పెను. రక్షకభటులపుడు, నతనిని దలలు తలలు పట్టుకొనిరి. ఒకసారి బంధింపఁబడిన వారిని రాజునకుఁ దెలియకుండ విడుదల చేయరాదు. రాజునకుఁ దెలిసినచో తమ నెత్తిమీఁది కేమి వచ్చునో! అహో రాజసేన! సాఁగినన్నాళ్ళు రాజాభయముగ సాఁగును. కొంచెము వికటించినచో వాఁడు, రాజ్యములో నానికంటె తక్కువవాడు లేనివాఁడు. నిల్లునమలి, నుక్కిక్కళ్ళు మింగి, యుక్కిరిబిక్కిరియై యెట్లో గమొక సఫకము వెంట రాజునకీ సంగతి తమయంతటఁదాము తెలియఁజేసినచోఁ బ్రాణముల మీఁదికి వచ్చునని. మొదట సేనాపతి విష్ణుశ్రీకిఁ దెలియఁజేసి యాయనద్వారా మహారాజునకీవార్త యందించిరి. ఏనాఁటి సాయంకాలమున నడవిశాంతిశ్రీ మాతరీదేవి విగ్రహమున కెదురుగాఁ గూరుచుండి చెప్పుచున్న మాటలు చక్రవర్తి వినెనో, యే నాఁటిరాత్రి చక్రవర్తికి భట్టిదేవీ మరణస్వప్నము వచ్చెనో, యేనాఁటిరాత్రి తెల్లవారు సమయకాలమునఁ జక్రవర్తి తాను బౌద్ధుఁడో కాఁడో నుఱచిపోయెనో, యాదినము తెల్లవారగా మహాత్మునిగాఁ దన పన్నగచ యంతయు నిక్షేతుకకుమ్ర్భావిలసనమని హృదయస్పృష్టికించిత్పశ్చాత్తాపస్నిగ్ధుఁ డయ్యెనో, యానాఁటి యుదయమున విష్ణుశ్రీ యీ సంగతి చక్రవర్తికి నివేదించెను. చక్రవర్తి మఱల మఱల రెండు మూఁడు మాఱులు వినెను. చక్రవర్తి యిట్లనెను. 'భద్రుని కూఁతురా? భద్రుని భార్యయా? భద్రునకు భార్యయుఁ గూఁతురు నుండిరా? ఎందుల

కుండరు?' అని చక్రవర్తి చాలసే పేదియో యాలోచించి విష్ణుశ్రీతో నిట్లనెను. "బావా"-చక్రవర్తి విష్ణుశ్రీని 'బావా' యని పిలుచుట యిన్నియేండ్లలో నాలుగైదుసార్లుజరిగినేమో! అట్లు పిలిచినవెంటనే విష్ణుశ్రీకిఁ దెలియును జక్రవర్తి మనస్సు భౌమమును దాటి దివ్యముల స్పృశించుచున్న దని- "బావా! భద్రుడు నెలనాళ్ళకుఁ జనిపోవ్ర ననఁగా నావద్దకు వచ్చెను. ఆయన నడక సరిగా యువరాజు నడకవలె నుండును. ఇది చమత్కారము కదా! భద్రుని కూతురుకదా- ఆమె పేరే మంటివి? కాళింది. కాళిందియా? ఆమెకు బాహుబల శాంతిమూలునివలె నడచునా? వారిని వెంటనే నావద్దకు దీసికొని రమ్మను. కాదు. మనమే చెఱసాలవద్దకుఁ బోవుదము" అని చక్రవర్తి బయలుదేరఁ బోవుచుండగా విష్ణుశ్రీ యిట్లు చెప్పెను. "మహారాజా! తమరచ్చటికిఁ బోవుట బాగుగానుండదు. చక్రవర్తి 'అట్లనా?' యని "సరే" వారిని సాయంకాలము తీసికొని రమ్మనెను. విష్ణుశ్రీయు సూక్తభిక్షువును దరువాత మాటామటలలో సూక్తభిక్షువు పడిన కలవరము చెప్పరాని దయ్యెను. "మహారాజుగారికి మామీఁదఁ గోపమే రాలేదా? సేనాపతీ! గండము గడచి గట్టెక్కితిమి. మమ్ములనుగుఱించి పరిశక్తియే చేయలేదా? ఈ సేవకులము మే మెంత బుద్ధిహీనులము! మాకుఁ బిట్టవొరికిన దనియే సంతోషము కాని యది బంగరు పిచ్చుకయేమో యనికూడ భ్రాంతిపోదు. అదృష్టము. బ్రతికినాము.'

ఆ సాయంకాలము చక్రవర్తికడకుఁ గాళిందియుఁ జంద్రచూడయుఁ దీసికొని రాఁబడిరి. వారివెంట సూక్తభిక్షువును, సర్వరాజ్యరక్షకభటాధికారి యైన శాక్యదాసుఁడును

వచ్చిరి. కాళింది తలవంచుకొనియే వచ్చెను. చక్రవర్తి
యెదుటఁ దల వంచుకొనియే నిలచెను.

చంద్రికూడ నిక్కిలి వృద్ధురాలు. ఆమె వచ్చుచునే
నిలువలేక చక్రవర్తియెదుటనే నేలమీఁదఁగూర్చుండఁ బోయెను.
కాళింది తల్లిని పట్టుకొనెను. చక్రవర్తి తాను లేచి యచ్చట
నున్న యొక బంగరుపీట చంద్రికూడ దగ్గఱకు జరిపెను.
సూక్ష్మభిక్షువునకును, శాక్యదాసునకును పైని ప్రాణములు
పైనిబోయెను. చక్రవర్తి కాళిందివంకఁ జూచి యేదో యాలో
చించి యిట్లనెను. "ఈమె వెనుదిరిగి నడువఁగా నేనుజూడ
వలయును" అని. ఆమెను నడువు మని యెవ రాజ్ఞాపింతురు?
ఈ యాజ్ఞ యేమి? ఈ రాజవాక్యము విని కాళింది తన
యంతటఁ దాను నడువవలయును. ఆమె నడువలేదు. ఎవ్వరికి
నేమియుఁ దోఁచలేదు. చక్రవర్తి యిట్లనెను. "నీ పే రేమి?"
కాళింది మాటాడలేదు. చక్ర: మీ కుల మేమి? కా: నా
మతము బౌద్ధమతము. సూక్ష్మభిక్షు శాక్యదాసుల కనులారి
పోవుచున్న దీపమునవలెఁ బ్రాణములేని తెల్లదనమును వెలా
ర్చెను. చక్ర: నీ పేరేమి? కా: బోధశ్రీ. చక్ర: తలయెత్తి
చూడ వేమి? కా: నిన్నుఁ జూచుటకు సిగ్గుపడు చున్నాను.'
ఆ యనినపద్ధతిలోఁ జక్రవర్తియెడల నిరాదరమా, యతని
యందుఁ బ్రేమయా, ఆ ప్రేమలో నొక నైరాశ్యమా? తిర
స్కారమా? ప్రక్కన నిలుచున్న యధికారులు భూమ్యా
కాశముల నడుమ నిరాధారులుగా వ్రేలాడు చుండిరి. చక్ర
వర్తి యిట్లనెను. 'నన్నుఁజూచి సిగ్గుపడుట యెందులకు? నేను
నీ కేమగుదును? నాయందు నీ కభిమాన మెందులకు? నీవు
భద్రుని కూఁతుర వగుటచేత నన్నుఁగూర్చి భద్రుఁ డెట్లూ

హించెనో నీ వట్లూహించుచుంటివా? భద్రుఁడు మాకు సేవకుఁడు. కాని వయోవృద్ధు. వయోవృద్ధులై యభిమానముగల సేవకులు తమకంటెఁ బిన్నలైన రాజులను మనస్సులోఁ గొంత భాగము తమ బిడ్డలుగా భావింతురు. ఆయనబిడ్డ వగుట నీకుఁగూడ నా భావనయే కలదా? నేను నీ భ్రమని మఱచి పోయినాను. నేను బౌద్ధమతస్థుఁడను. నీవును బౌద్ధురాలవు. నేను చేసిన పనులుచూచి నీవు లజ్జపడుట యెందులకు? నీవు బ్రాహ్మణివైనచో నేను బ్రాహ్మణమతమునుండి పూర్ణముగాఁ బోయితి నని నీవు నన్నాక్షేపించవచ్చును' అనెను. కాళింది యిట్లనెను. "నేను నీవు చేసిన పనులకే లజ్జించుచుండలేదు. నన్ను జూచి నేనే లజ్జించుకొనుచుంటిని. మన యిద్దఱి బౌద్ధమతములు నొక్కటియే పద్ధతివి". చక్రి: అనఁగా? కా: అనగా మిద్దఱము హృదయములలో, విశ్వాసములలో బౌద్ధులము కాము. కారణాంతరములచేత బౌద్ధులము" అని కాళింది తల యెత్తిచూచెను. ఆ చూచుటలో నొక నందజన్మాంతరములలోని చెప్పరాని యేదో ప్రేమతో నొక మహాసత్వపరిమాణమైన యధిక్షేపభావముచేతఁ గుంగిపోవుచున్న ప్రేమతోఁ జూచెను. రాజు తాను గూర్చున్నవాఁడు కూర్చున్నట్లుగాఁ దాను జక్రవర్తి నని మఱచిపోయెను. ఆ చూపు తన కన్నులలోనుండి తన హృదయములోనికి, హృదయములోనుండి సర్వరక్తప్రవాహబిందువులలోనికి, భూతములయందుఁ దద్విషయములయందు సర్వతోవ్యాప్తిగాంచి యట్లే విద్యుద్ఘాతమువలెఁ బ్రసరించెను. రాజు ముగము శూన్యమయ్యెను. చూచుచున్న విష్ణుశ్రీ సూక్తభిక్షు శాక్యదాసులు శిలాప్రతిమలవలె నయిరి.

చక్రవర్తి నోటనుండి హఠాత్తుగా నీ మాటలు వెలువడెను. "అమ్మా! నీవా? నీకోస మానాఁ డెంత వెదకించితిని. ఇట్లు కనబడి యిట్లు వెడలిపోయితివి. ఆ యప్సరస్తీర్థమువు. మఱల నెన్నాళ్ళకుఁ గనిపించితివి? అనినంతనే విష్ణుశ్రీ కదలిపోయెను. ఆయనకు నెదురుగా నిలుచుండిన కాళిందిని పరిత్యజించి సర్వేతరావకాశము నస్థితిక మయ్యెను. విష్ణుశ్రీ పరమబుద్ధిమంతుఁడు. నేత్రసంజ్ఞతో సూత్రభిక్షు శాక్యదాసులను దన వెంట రమ్మని తా నచటినుండి వెడలిపోయెను. కాళింది యిట్లనెను. "నాకోస మెందుకు వెదకించితివి? నే నూరకే నిన్ను జూడవలయు నని వచ్చితిని." చక్రవర్తి: ని న్నెందుకు వెదకించితినో నాకుఁ దెలియదు. ఇప్పుడు నీతో నిట్లెందుకు మాట్లాడుచుంటినో నాకుఁ దెలియదు. నీ వెవ్వరవో నాకుఁ దెలియదు. నిన్నుఁ జెఱసాలలో నుంచిన దెవరు? నీవు చెఱలో లేవు. నీ తల్లివి, నిన్నుఁ జెఱనుండి వదలించితి" ననెను. కాళింది: ఐనచో మేము వెడలిపోవచ్చునా? యనెను. చక్రవర్తి: ఎచ్చటకు? కాళింది యిట్లనెను. "నా తండ్రియైన భద్రునకు మిక్కిలి ధనము కలదు. ఆయనకుఁ బుత్రసంతానము లేదు. ఆ ధన మంతయుఁ జక్రవర్తి కైవసముచేసికొనిచో, నే నా ధనమును వినియోగించి యిచ్చట నొక స్తూపమును, చైత్యమును, మఱియొక విహారమును నిర్మింపఁదలఁచుకొంటిని. చక్రవర్తి: ఇదివఱకే చాల విహారము లున్నవి. ఇంక నెందులకు? కాళింది: పూర్వ మెందఱు చక్రవర్తులు లేరు? మఱల నింకొక చక్రవర్తి యెందులకు? చక్రవర్తి: ఇది యేమి ప్రశ్నమమ్మా తల్లీ! ఇది యేమి సమాధానము? కాళింది: మే మిద్దఱము కారాగారము నుండి విముక్తుల మైతిమికదా! మేము పోవుచున్నాము" అని

కాళింది తల్లిని దీసికొని నడచిపోవుచుండెను. చక్రవర్తి యామె నడక చూచి దిగ్గున లేచి యామెయొద్దకుఁ బోయి "తల్లీ! నీ వెవరు? మా బాహుబలునివలె నడచుచున్నావు? కాను. పోనిమ్ము. పొరపాటు. మాతండ్రి భద్రుఁడిట్లే నడచెడివాఁడు. నీ వాయనవలె నడచుచుంటివి" యనెను. కాళింది: తన బిడ్డలు తమ తండ్రులవలె నడచుటలో నాశ్చర్యమేమున్నది? యనెను. అని చక్రవర్తిని దొలఁగిపోవుచుండెను. చక్రవర్తి యామెతో నిట్లనెను. "తల్లీ! మరల నీవు నాకెక్కడఁ గనిపింతువు? కాళింది: ఈ పట్టణమున నీశాన్యభాగమున స్కంధవిశాఖ నాగుని సౌధమువెనుక నా తండ్రి కొంతస్థలమును సంపాదించెను. ఆ స్థలమునందు నేను చిన్న బౌద్ధవిహారమును నిర్మింతును. అది నిర్మించుటకు రెండు మూఁడు నెలలు పట్టవచ్చును. ఆ నిర్మాణము పూర్తియైన తరువాత బౌద్ధభిక్షుకురాలుగా నందే యుండి జీవితము వెళ్ళబుచ్చఁదలఁచుచుంటిని. ఎప్పుడు నీ వెప్పుడు వచ్చినను నన్నుఁ గలసికొనవచ్చును. చక్రవర్తివై యాజ్ఞాపింతువేని నేనే వచ్చెదను. చక్రవర్తి: నీకు బౌద్ధమతమునం దిష్టములేదుగదా! విహారనిర్మాణ మెందుకు చేసెదవు? కాళింది: రాజానుమతో ధర్మః. ఈ నేలఱేఁడు బౌద్ధుఁడు. నేనేను బౌద్ధురాలను. కానిచో నేమగుదును? నా ముసలితల్లికి వేఱే దిక్కులేదు. ఈవయసులో నామె చెఱలో నుంచఁబడఁగా గనులారఁ జూచితిని. ఆమె యురివేయింపఁబడఁగాఁగూడఁ జూడ మందువా?"

కత్తితో గుండెలో నిడివిగా గ్రుచ్చినచో ననుభవింప వచ్చును. మౌళినుండిపాదాంతమువఱకు శూలముతో వ్రేలఁగ త్రిదిగవేసినచో ననుభవించుటయెట్లో! మొదటిది రాజులెఱుఁగుదురు.

రెండవదిచోటులకయ్యెడి యనుభవము. చక్రవర్తి యప్పుడు తా
నొకచోరుఁ డనుకొనెను. అంతఁ గాళింది వెడలిపోయెను. చక్ర
వర్తికి నామె మాటాడిన ప్రతిమాటయు పునఃపునః మనశ్చ
ర్వణప్రాయములయ్యెను. "తమ బిడ్డలు తమ తండ్రులవలె
నడచుటలో నాశ్చర్య మేమున్న దనియా? బాహుబలుఁడు తన
బిడ్డకాఁడా? తనవలె నేల నడువఁడు? నడచునా? తానుగూడ
బాహుబలునివలెనే నడచునా అట్లని చెప్పెడు నెవ్వరు నన
లేదే" అని చక్రవర్తి యెంత యూహించుకొనుచున్నను, దన
యెదుటనున్న నిలువుటద్దములోఁ దననడక చూచి పోల్చుకొన
వలయు నన్న యూహాయే పుట్టలేదు. ఇంతలో నెవరో తన
కెదురుగా నడచుచున్న ట్లనిపించెను. చక్రవర్తి బాహుబలుఁడు
వచ్చెననుకొనెను. పరీక్షించి చూడఁగా నా యద్దములో నడచు
చున్న తన ప్రతికృతియే యని తెలిసెను. ఆహా! తన కొడుకు
తనవలెనే నడచును. భద్రునివలె నడచు నని యేల యను
కొనెను అరే! తనను గుఱించిన యొక శరీరసంబంధమైన
చిన్నవిషయము తనకుఁ దా నెఱుఁగుట యింత కష్టమైనచో,
దానిని ప్రతిబింబము చేతఁగాని తెలిసికొనలేనిచో, నా తెలిసి
కొనుట యింతకష్టమైనచో, నది నట్టి శరీరసంబంధమైన విషయ
మైకూడఁ దదనుభూతి, తత్ప్రత్యక్షీకరణము నింత కష్టముచేతఁ
గలుగునదైనచో, నీవే పరమాత్మవు, జీవాత్మ యని పొరపాటు
పడుచున్నావు, నీ వది యని తెలిసికొనుట దుర్ఘటము, తెలిసి
కొనుటయే బ్రహ్మానందానుభూతి - అన్న మహావిషయము
ప్రత్యక్షీకరించుకొనుట, యది యనుభవించుట యెంతకష్టము?
కష్టమైన దని దానిని వదలి యయథార్థమైన దానిని సులభ
ముగా నున్నదికదా యని స్వీకరించి యేమి ప్రతారించు

కానుట? ప్రతిదినము మనము చూచుచున్నదియే; యనుభవ
ములో నున్నదియే. అనుభవజ్ఞానము కలిగినగాని యనుభవ
మనుభవము కాదు. భద్రుని నడకకు బాహుబలుని నడకకు
సంబంధమేమి ! నానడక, నాకిల్లవాని నడక. నా నడక శాంతి
మూలచక్రవర్తి నడకయా? చక్రవర్తి దౌవారికునిఁ బిలచెను.
ఆ దౌవారికుఁ డెనుఁబదియేండ్ల వృద్ధు. బ్రాహ్మణుఁడు. అతనిని
బాధ్యుని కమ్మని చక్రవర్తి బలవంత పెట్టలేదు. తన యంత
నతఁడు కాలేదు. ఈ దౌవారికుఁడు మొదట నంతఃపుర
ప్రతీహారి. అతని యందుఁ జక్రవర్తి కొక మహాభిమానము.
తన చిన్నప్పు డతఁడు తన్నుఁ జేతులలోఁ బెంచె నట! అతఁ
డెప్పుడును జక్రవర్తిని మహారాజా యని పిలువఁడు.
మఱియు వలసినచో 'మీరు' అనును. చక్రవర్తితో నేదైనఁ
జెప్పవలసి వచ్చినప్పు డేదో గోడతోఁ జెప్పినట్లు చెప్పును.
చక్రవర్తి నవ్వును. ఈ ప్రతీహారి చాల చదివినవాఁడట! ధర్మ
శాస్త్రములలో నతఁడు నిష్ణాతుఁ డట. ధర్మసంశయములు
ప్రాప్తించినపుడు బ్రాహ్మణులందు అతని నడుగుదు రట. ఆ
దౌవారికుని బిలచెను. పిలిచిన గడియ కతఁడు వచ్చెను. ఆ
వృద్ధుఁడు కూర్చుండి లేవనేలేఁడు. చక్రవర్తి యిట్లనెను. 'తాతా
మా నాయనగారు, శాంతిమూలమహారాజు నడచెడితీరు:
నడచుట యనగాఁ బాదవిన్యాసవైఖరి, నీకు బాగుగా గురు
న్నదా?' యనెను. ఆయనపేరు మేధావిభట్టు. ఆయన యిట్లనెను.
'నిన్ను నీతలిదండ్రుల నెఱుఁగుదువా? యన్నట్లున్నది.' చక్రవర్తి
నవ్వి 'తలిదండ్రుల నెఱుగనిది నీవా? నేనా?' ప్రతీహారి
కొంచెము విసుగుతో 'అసలేమిటి? చక్రవర్తి నడక నే నెఱుఁగుదును'
అనెను. వీరపురుషదత్తుఁడు మఱల నవ్వుచు 'నీ యుద్దేశ్యములో

మా నాయనగారే చక్రవర్తి కాని నేను గాదన్నమాట'
యనెను. మేధావిభట్టు కోపముతో నిట్లనెను. 'నేను మీ
యిక్ష్వాకులు సామంతులుగా నున్నప్పటినుండియు మీ రాజ్య
ములోఁ గొలువు చేసినవాఁడను. నా బ్రాహ్మణ్యము వదలి
నీ ద్వారబంధమునొద్దఁ గంచుకములు తొడిగికొని సూర్యరశ్మి
బొమ్మన తాకనీయని వాఁడను. ఇక్ష్వాకురాజ్యము సామ్రా
జ్యము చేసినది మీ తండ్రి. ఆయన చక్రవర్తి యైనాఁడు.
చక్రవర్తిత్వమును సాధించినాఁడు. నీవు చక్రవర్తివి కాలేదు.
చక్రవర్తివిగాఁ బుట్టితివి. ఎవరు గొప్ప?" అనెను. వీరపురుష
దత్తుఁడు "ఎవరు గొప్ప?" అని మరలఁ బ్రశ్నించెను.
మేధావిభట్టు "ఊహూ, నే నాయన నడక నెఱుఁగుదును.
ఆ ప్రసక్తి యిప్పు డేమిటికి?" అనెను. చక్ర: ముందర యెవరు
గొప్పవారో చెప్పుము. మేధా: నీ పరిహాసమంతయు నాతో,
నా కోపికలేదు. చక్రి: అట్లనో, నీవు మనస్సులో దాచి నిజము
చెప్పుట కిష్టములేక నన్నుఁ గికురింప నెంచుచుంటివి. నీ వది
చెప్పినచో నే నిది చెప్పెదను. మేధా: నిజము చెప్పుమందువా?
అబద్ధము చెప్పుమందువా? చక్రి: ఇంకఁ జెప్పనక్కఱలేదు.
మేధా: కష్టపడిన వానికన్నఁ గష్టపడకుండ ఫలము ప్రాప్తించు
టలోఁ బూర్వజన్మసుకృతాతిశయ మున్నది. లౌకికముగాఁ గష్ట
పడి యార్జించుటలోఁ బ్రతిభయున్నది. చక్రి: తాతా? నానడ
కను, మా తండ్రి నడకను నేమైన పోలికయున్నదా? మేధా:
ఎందులోనను లేదు. చక్రి: పదియేండ్లనుండి యింత మాట
నీ వెప్పుడు ననలేదు. మేధా: నేను జచ్చిపోయినచో నా కేమి
భయము?" చక్రవర్తి యామాట వినుచు మొగము బిగించు
కొని, దీర్ఘాలోచన చేసి "తాతా! ఇంతకు ముందిద్దఱు

స్త్రీలు వెడలిపోయిరే వారిలోఁ జిన్నదానిని నడక చూచితివా? మేధా: నేను జూడకుండ నీయంతఃపురములోఁ బుసుఁ గవలదు. ఆమె మాతంగీదేవి చెల్లెలో, అప్పరసో!

# ద్వాదశాధ్యాయము

నాగార్జునికొండ పక్కనున్న లోయలోనుండి కృష్ణానదిలో పడు వాగున కీశాన్యమున నున్న సింహళీయుల విహారమునకును కృష్ణానదికిని నడుమనున్నది కాళిందీసౌధము. అది సౌధమో, విహారమో, దేవళమో చెప్పుటకు వీలులేదు. బౌద్ధులు దానిని విహారమందురు. బ్రాహ్మణులు దానిని దేవాలయ మందురు. రాజభటులు దానిసజ్జకే పోరు. చంద్రి చూడ నిత్యము బ్రాహ్మణ సంతర్పణలు చేయుచుండును. బ్రాహ్మణులు యథేచ్ఛముగా లోనికిఁ బోదురు, వత్తురు. కాళింది మహాచైత్యమువద్ద వారమున కొకపరి జరుగు మహాసభలకుఁ బోనేలేదు. బౌద్ధులైనవారు మహాచైత్యమునకుఁ బ్రతివారమును బోయితీరవలయునని రాజాజ్ఞ. కాళింది వెళ్ళకుండుట కొందటికిఁ గంటగింపు. ఆమె నేమియనుటకువీలు లేదు. చక్రవర్తి కామెయం దంతగౌరవ మేలకో యెవ్వరికిని దెలియదు. ఆమె కృష్ణాస్నానమునకుఁ బోయినను, నగరములో మఱొక్కచోటికిఁ బోయినను నామె సర్వరాజాజ్ఞాధిక్కారముగఁ బ్రవర్తించుచున్నట్లు గనబడును. నిజముగాఁ బ్రవర్తించదు. ఆమెయందుఁ బర్తనవాసుల కేలనో యొకద్వేషము కలిగెను. ఆమెయుఁ దమ వంటిదే. ఆమెయెడల నీయాధిక్య మేమి యని. రాచనగరునకు సమీపముగాఁ బోవుచు నెవ్వరును మాటాడఁ గూడదు.

మౌనముద్రావలంబులై పోసాగెను. రాజకుటుంబములో నెవరి
యెదుట శిక్షింపఁ బోవుచున్నను సర్వజనులు నిశ్చేష్టులై పోవల
యును. ఒడ్డిగిలి నిలుచుండవలయును. ఆమె రాజసౌధము
ముందుగాఁ బోవుచున్నచో మాటాడుచునే పోవును. చక్రవర్తి
యెదుట యెదురుగా వచ్చుచున్నను నామె నాపుటకు వీలులేదు.
ఒకసారి యొక రక్షకభటుఁ డామె నాపెను. ఆమె వానిని బెడ
దోసి తాను బోవుచుండెను. ఆమె స్త్రీ. తా నేమి చేయ
వలయునో యతనికిఁ దెలియుట లేదు. అయినను బోయి యామెను
బలాత్కారముగాఁ జేయిపట్టుకొనిలాగెను. చక్రవర్తి యతనిని
జూచెను. అతనికి మఱునాఁడు కారాగారశిక్ష విధింపఁబడెను.
నాఁటితోఁ గాళింది కెవరు నేమియు ననుట వీలులేకపోయినది.
ఇంతలో రాజాధికారుల కొక యనుమానము కలిగెను. ఆమె
యిల్లు రాజద్రోహులకు నెలవుగా బ్రాహ్మణుల కునికిపట్టయ్యెనని.
పోయి యామె గృహము పరిశోధనము చేయవలయు నని
పలుమంది రాజాధికారుల కభిప్రాయము కలదు. కాని ప్రతి
వానికిని భయమే! ఒకప్పు డొక బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణ
మతమును నిందించుచున్న యొక్క బౌద్ధాధికారిని తిరస్క
రించి మాటాడెను. ఆంధ్రబౌద్ధులు మాధ్యమికులు. బ్రాహ్మ
ణుఁడు బౌద్ధమతము నెల్ల తిరస్కరించెను. "మీలోఁ దక్కిన
ముగ్గురే నయము. సౌత్రాంతికులు, యోగాచారులు, వైభాషి
కులు - వీరు మీయంత చెడిపోలేదు. మాధ్యమికులు పరమ
నాస్తికులు. మీకుఁ బ్రపంచకము లేదు, ఆత్మపదార్థము లేదు.
మీరు మాత్ర మున్నారు. బుద్ధుఁడు చెప్పినవి వేఱు, మాధ్య
మిక శిష్యుఁడు విన్నది వేఱు. భారతదేశమున మఱి యేప్రాంతీ
యులు నింత బుద్ధిహీనులు కారు. ప్రత్యేకముగా నీయాంధ్ర

నుండెను. అతఁడు చూచాయగా నిజమా బ్రాహ్మణునకుఁ దెలియ
జేసెను. ఆ బ్రాహ్మణుఁడు పోయి కాళిందిమేడలోఁ దలదాచు
కొనెను. అధికారులు తలుపులు పట్టుకొనిరి. ఏమిచేయవలయునో
తెలియలేదు. కాళింది నద్దకుఁబోయి 'అమ్మా! రాజద్రోహియైన
వానికి మీ రాశ్రయ మిచ్చితిరి. అతనిని మీరు మా కప్పగింప
రేని మేము పోయి చక్రవర్తితోఁ జెప్పుకొనవలయు" ననఁగా
నామె "యాయనచేసిన రాజద్రోహ మేమి" యని యడిగెను.
వారు "చక్రవర్తిని దిట్టెను. చక్రవర్తి దుర్మార్గుఁడనెను' అని
చెప్పిరి. ఆమె "మీరాయన యట్లనె ననుట లేదే?" యనెను.
అందులో నొకఁడు తానేతన చెవులారవింటినని చెప్పెను. కాళింది
'మీరాజాధికారులకుఁ బుణ్యపాపములులేవు. నిజము, అబద్ధము
లేవు" అనెను. ఎంతయైనను నామె యా బ్రాహ్మణుని వదల
లేదు. వారు తామేమిచేయుటకుఁ దోఁచక వెడలిపోయిరి. కాని
కసితీరలేదు. చక్రవర్తి కూడ నీ సందర్భమునఁ దమకు నుపయో
గింపఁడని యనుకొని మఱియు నూహించిరి. దీని కొక్కటియే
యుపాయమున్నది. ఆ బ్రాహ్మణుఁ డనిన మాటలలోఁ జక్ర
వర్తి క్షత్రియుఁడు కాఁడని, శాంతిమూలమహారాజుకడుపుకాఁడని
యందుకనియే యిట్టి దుర్బుద్ధులు కలిగె నని యన్నట్లు కల్పించి,
యతనిపేరిఁట యజ్ఞయాగమునకై నిర్మింపఁబడిన యాకులలో
నిదికూడఁ జేర్చి యా కట్ట యంతయుఁ జక్రవర్తికిఁ బంపించిరి.
తరువాత నైదారుమాసములవఱకుగాని చక్రవర్తి యా కాగిత
ములను జూడలేదు. పైగా నా చూచినవేళ యొక విషమవేళ.
చక్రవర్తి తన బావమఱఁదియైన స్కంధవిశాఖనాగునితో
మహాచైత్యమునకు రెండాయక స్తంభములు బీటీయగా వానిని
మఱలఁ దనపేరున వేయించుమని చెప్పెను. స్కంధవిశాఖనాగు

టిట్లనెను. 'నేను బౌద్ధుఁడనుగాను. నాకు నీ యాయక స్తంభము
లతోఁ బనిలేదు. ఇదియుఁగాక సర్వచైత్యవిహారములకుఁ జేసిన
దానములు రాజనగరములోని స్త్రీలచేఁ జేయఁబడుచున్నవిగాని
పురుషులచేఁ జేయఁబడుటలేదు. వలసినచో నీ తోఁబుట్టువు శాంతి
శ్రీచేఁ జేయించుకొమ్ము" అని. చక్రవర్తి "ఆర్యా! యిదివఱ
కందఱు స్త్రీలే. ఇప్పటినుండి మనము పురుషులముకూడఁ జేయ
వలయు"నని స్కంధుఁడు: 'ఐనచో ముందు నేనే చేయవలయునా?'
చక్రవర్తి: నీవు మాయందఱిలోఁ బెద్దవాఁడవు. నీవే మొదలు
పెట్టవలయును. స్కం: నేను బ్రాహ్మణుఁడను. నేనాస్తికుఁడను.
మీరు బౌద్ధులు; మీరు నాస్తికులు. నేనే మొదలుపెట్టినచో
మీమత మింకెన్నాళ్లుండును. నాచేత నిది మొదలు పెట్టించుట
మీమతవృద్ధికి శ్రేయస్కరముకాదు. దానిమీఁద బావమఱఁదు
లిద్దరు కొంచెము ఘర్షణపడిరి. ఈ ఘర్షణలో స్కంధవిశాఖ
నాగుఁడు నాలుగురకముల బౌద్ధమార్గములలో మాధ్యమికులు
పరమనాస్తికు లనికూడ నుద్ఘాటించెను. చక్రవర్తికి మిక్కిలి
కోపమువచ్చెను. ఈ కోపములో నున్నప్పుడు చక్రవర్తి యీ
యాకులకట్ట చదివెను. తన బావగారిమీఁదనున్న కోపమంతయు
నాబ్రాహ్మణుని వైపుకు మఱలెను. చివర తననుగుఱించి, తన
జన్మనుగుఱించి యీ బ్రాహ్మణుఁ డన్నట్లున్న పంక్తులఁజదివెను.
ఒకదానికొకటి సోపానమై చక్రవర్తి వెంటనే శాక్యదాసుని బిలి
పించి తనయంగుళీయక మిచ్చి కాళిందియింటినుండి యాబ్రాహ్మ
ణుని దీసికొనిరమ్మని పంపించెను. తర్వాత శాక్యదాసుఁడు వచ్చి
రాజాంగుళీయకమును కాళింది మన్నించలేదనెను. చక్రవర్తికి
మిగులఁ గోపమువచ్చెను. ఈ కాళింది యెవరు? తనకామెయం
దొక నిర్వ్యాజాభిమానము కలిగినంత నామె యిట్లు రాజాజ్ఞఁదిర

స్మరించునా? నిజమునకు శాక్యదాసుఁడు కాళిందికడకుఁ బోనే లేదు. ఈ ముద్రికను జూపించి బ్రాహ్మణుని దీసికొని రమ్మని యా బ్రాహ్మణునిపైఁ బగబూనినయధికారికిఁ జెప్పెను. అతఁడు కాళింది యింటికిఁబోకుండఁగనే తాను బోయితిననియుఁ గాళింది రాజముద్రికనుగూడఁ బరస్కరించె ననియుఁ గల్పించి చెప్పెను. శాక్యదాసుఁ డతనిని విశ్వసించెను. రాజున కా వార్త తెలియగనే యాజ్యము పోసిన హుతవహునివలె మండి తానే బయలుదేరెను. రాజు, విష్ణుశ్రీ శాక్యదాసుఁడు. సూత్రభిక్షువు, ఆ బాధాధికారి, వందమంది సైనికులు కాళిందియింటికిఁబోయిరి. తలుపులు తెఱచుకొని ప్రవేశించిరి. కనుసన్నతోనే యా బ్రాహ్మణుఁడు కన్పించెను. చక్రవర్తి యొక్క కత్తి వేటున నతని కంఠము తుండెములుగా నఱకెను. ఆగాలిలో నేముండెనో! అంతవఱకుఁ బూవులు వికసింపగాఁ గ్రమ్మిన యొక యనిర్వచనీయమైన, సుకుమారపరిమళభరిత మధురశాంతి వ్యాపించి యుండెను నాకాశమున, వంతలో నొక ఝంఝ పెళ్ళురేగి ధూళిగ్రమ్మి సమ్మై శాంతియంతయు విఱిగిపోయినట్లు, నిముసములో మాఱిపోయిన గతి నంతవఱకుఁ గాళిందీసౌధావకాశము నిశ్చలమై, పెఱ రాజ్యపు గగ్గోలులేక శాంతమై, యోగిమనస్సువలె నిస్సంచారమై యుండెడిది యొకలిప్తలో భద్రకాళీనాట్యరంగమువలె, నొకకసాయి దుకాణమువలె, వైతరణీనదీతీరమువలె భయంకరమైన మనస్సుచేత నావరించఁబడెను. చంపఁబడిన దొక్కఁడే బ్రాహ్మణుఁడు. ఆచావులో నెన్నిచావులిమిడియుండును? ఒక్క మరణము కలిగినచోట, నొక్కవధ జరిగినచోట నందున్న పంచభూతములు నేదో వినాశాభిముఖముగ నున్నట్లు కన్పించుట యేమి? తత్రత్యులగు సర్వేతరులకు మనసుచేత నూహింప

రాని యేదో యాపద తమ్ముఁగూడ నావరించుటకు వచ్చు
చున్నట్లుగాఁ గలిగెడి యీ మనోవికార మేమి? మనస్సునకుఁ గల
సర్వతోఽభివ్యాప్తిచేత నల్పైకదేశగతవధమో, మరణమో
సర్వాకాశగతసర్వాణువ్యాప్తమైనట్లు కనిపించునా? ఇంతియై
కాఁడ నొకానొకవ్యక్తి తద్దేశగతమై యుండియును దదన్యా
పరిశీలవధబీజములు దన్నంటునట్లు తాను విడిగాఁ దన హృద
యమునుండి నిత్యము నిగుడ్చుకొనెడు నొక శాంతిస్థానము
ఛాయమునందే యుండ నేల? అప్పుడే యచటికివచ్చిన కాళింది
యటులుండెను. ఈ భయంకరసంనిధానముచేతఁ దత్రత్యసర్వ
జనముల వదనములయందలి వికార మామెమొగమునఁ గల్పించ
లేదు. పరిపుష్టమై కలగుండుపడినతద్వ్యథానుక్లిష్టముద్ర యామె
నేత్రములయందు లేదు. రా జగ్నిజ్వాలవలె మండుచుండెను.
చక్రవర్తి యెదుటనే యామెను బోఁగుపట్టుకొనుట కెవరికినిసాహ
సము లేదు. ఆయమ చక్రవర్తి వంక శాంతముగాఁ జూచెను. చక్ర
వర్తి కనులు వాలెను. ఇంతలో నీ సర్వవిలయమునకు మూల
హేతువైన యధికారి నోటినుండి శాక్యదాసుఁడు, విష్ణుశ్రీ,
చక్రవర్తి చెవులలోనికి శోకరహస్యము క్రమముగా వ్యాపిం
చెను. చక్రవర్తి కాళిందితో నిట్లనెను. 'నీవు రాజముద్రికాతిర
స్కారము చేసితివి. నీవు వధార్హవు'. అనినతోడనే కాళింది
నిముస మాలోచించి రాజుప్రక్క నున్న యధికారుల వంకఁ
దీక్ష్ణముగాఁ జూచెను. విష్ణుశ్రీ శాక్యదాసు నడిగెను. "ఆ
ముద్రిక నామెవద్ద కెవరు తీసికొనిపోయి రనిరి? శాక్యదాసుఁ
డధికారి వంకఁ జూచెను. రాజు వారిముగ్గురివంకఁ జూచెను.
అధికారి యాపాదమస్తము కంపించిపోయెను. కాళింది వికృత
ముగానవ్వి లోనికిఁబోయెను. పోవుచు నొక్కనిముసమాగి 'యిది

బ్రహ్మహత్య, దీనికిఁ బ్రతిఫలము మీరు చెప్పుచున్న ప్రకృతి యందే యుండు' ననెను. చక్రవర్తి నిలుచున్నవాఁడు నిలుచున్నట్లుగా నీరసించెను. ఆ యధికారిజీవితము చక్రవర్తి యీ నీరసస్థితిలో సమాధిపొందెను, న్యాయమేకదా! ప్రభువుల దుష్ప్రభుత్వ మధికారిబలము.

ఈ కథయైన తరువాత మనుజులలోఁ బ్రధానముగా నుండు రెండు తెగలు, రెండు విధములుగా భావించిరి. మొదటి తెగయు, నల్పసంఖ్యాకులైన వివేకులు, చక్రవర్తి మీఁదఁ గాళింది కేదో, చెప్పరాని యధికార మున్నది. ఆమె చెనకరానిది. రెండవ తెగవారు, కాళిందికిఁ బూర్వమున్న మర్యాద పోయెను. పోకయెట్లుండెను. రాజులిచ్చినచనవు నభిమానమును దుర్వినియోగము చేసినచో నెవరికిఁ గీడుకలుగదు? అనుకొనిరి. అనుకొనినచో దూరముంచవచ్చునా? వారిలో నధికారముద్ర కలవారు, మాటిమాటికిఁ గాళిందీసౌధమునొద్దకిఁ బోవుట, యచటివారలను బెదరించుట, యొకొక్కప్పుడు కొంచెము దురుసుగా మాటలాడుట జరిగినది. కాళిందికాని, యచటి మఱియెవరుగాని యీ సంగతి చక్రవర్తికిఁ జెప్పువారు లేరుకదా! మొదటి దురుసుతనములు నష్టములేకుండ జరిగినవి. అందుచేతఁ దరువాతి తరువాతి దురుసుతనములు కొంచెము కొంచెము ముదురుచు వచ్చినవి. నగరములోఁ గాళిందియెడలఁ జక్రవర్తి కేదో యభిమాన ముండె నని యనుకొని పొరఁబడితి మని యభిప్రాయము వ్యాపించినది. కాళింది చెఱసాలనుండి విడువఁబడిననాఁటికిని, కాళిందీసౌధమున బ్రాహ్మణవధ జరిగిననాఁటికిని నడుమ మూడేండ్ల వ్యవధి యుండెను. ఆవధకు మఱల నిప్పటికి మఱల మూడేండ్లుగడచెను. అప్పటికి వీరపురుషదత్తుఁడు చక్రవర్తియై పదు

నెనిమిదేండ్లపైఁగా వచ్చెను. కాళిందివయసు ప్రాయశః ఏబఁది నాలుఁగేండ్లు కావచ్చును. ఆమె యమునానదియందుపడి బోయెను. ఆ నాఁడు భద్రుని యాబ్దికము. చంద్రచూడ యొక బ్రాహ్మణుని బిలచి యతనిచేత నాబ్దికము పెట్టించుచుండెను. బ్రాహ్మణులు కాళింది యింటికి వచ్చుచుఁ బోవుచుండిరి. శాంతిమూల మహారాజు తన రాజ్యమున గృతయుగధర్మము నడపవలయు నని పట్టుదలగలవాఁడు. ఇక్ష్వాకులందుండఁ గలియుగధర్మముగా మత్స్యమాంసాదులు పరిత్యజించి బ్రాహ్మణక్షత్రియులకు సహపంక్తిభోజనముగా నేర్పాటుచేసెను. అందఱు బ్రాహ్మణులు దీనికి నొప్పుకొనలేదు. కాని కొన్ని బ్రాహ్మణవంశములు చక్రవర్తియు, దండనాయకులయు, క్షత్రియులైన యితరాధికారులయు గృహములకుఁ బోయి సహపంక్తిభోజనము లీ గడచిన యేబదియేండ్లుగాఁ జేయుచునేయుండిరి. కాళింది బౌద్ధురాలు. చంద్రచూడ క్షత్రియ. చంద్రచూడ క్షత్రియ యగునో కాదో! బ్రాహ్మణుల కీ పట్టింపు లేకపోయెను. తమ్ముఁ బిలచినదే చాలునని పోవుదురు. బౌద్ధులు దీనికి దుర్వ్యాఖ్యానములు చేసిరి— ఈ బ్రాహ్మణులు సత్రభుక్కులు, తిండి దొరకినఁజాలుఁబోవుదురని. బ్రాహ్మణులు బ్రహ్మపదార్థమునందు నిష్ఠకలవారు. సర్వజీవులును బరమార్థతః బ్రహ్మపదార్థమైనవారు. ఈభావమే జీవుని యందున్నను వారు దాని నాచరింతురు. ఉపాధిలక్షణములకుఁ దక్కువ వెలకట్టి పరమార్థమునే దైనందినచర్యలోఁ బ్రకటింతురు. ఈ భావమును బౌద్ధులు గుర్తించలేరు. బౌద్ధులు పరమభిక్షుకులైనను బ్రాహ్మణయాచ్ఞావృత్తిని నిందింతురు. బౌద్ధమతము నాఁటికి రాజమత మగుటవలన నా మతమునకు రాజసము ప్రబలెను. ప్రతిగ్రహము తప్పుగా భావింపఁ

బడెను. ఇతరునికోసము, నితరునివాసము, తాను స్వీకరించును బ్రాహ్మణుఁడు. ఇది ప్రతిగ్రహములోని రహస్యము. ఇది వ్యక్తియైన బ్రాహ్మణునకుఁ దెలియవలసిన ధర్మము ననుసరించు బ్రాహ్మణునియందలి లోకానుజిఘృక్షు. ఆ నాఁడు బ్రాహ్మణులు సన్నిద్ధను చంద్రచూడ గృహమునుండి కడుపార భోజనము చేసి సతాంబూలదక్షిణాహస్తులై పోవుచుండఁగా నలుగురు రాజాధికారులు వారినిఁ జూచి పరిహాస మాడుచుఁ బోవుచుండిరి. ఆ బ్రాహ్మణులలో నొక యువకుఁ డుండెను. అతఁడు రాజధానివాఁడు కాఁడు. అధికారులచేతఁ గొంచెపటపించుకొనుట తెలియనివాఁడు. అతఁడు వారిని మరల నేదో యనెను. అధికారులలో నొకఁడు వానివద్దకు వచ్చి చేతిలోనున్న కఱతో వానిని దాడించెను. ఆ యువకుఁడైన బ్రాహ్మణుఁ డెదురు తిరిగి యా యధికారిని దిరిగి పడి చమిరెను. తక్కిన నల్గు రధికారులు బ్రాహ్మణుల నందఱను బట్టుకొని హస్తములతో దండములతోఁ బీడించిరి. అది ప్రొద్దుక్రుంకబోవు సమయము. చక్రవర్తి యప్పటి కచ్చటికి వచ్చుట తటస్థించెను. ఆయన కాలినడకను వచ్చుచుండెను. చక్రవర్తి యట్లు వచ్చునని యెవ్వరనుకొందురు? ముందర సేవకులు లేరు. బరాబరులు సేయువారు లేరు? రథము లేదు, ఛత్రములు లేవు. చక్రవర్తి తమ్ము సమీపించువారిని నెవ్వరుఁ జూడరు. చక్రవర్తి ముందు సాఁగిపోయిన తరువాత వెనుదిరిగి చూచి విభ్రాంతిపోవువారే కాని యిట్టిస్థితిలో నతని రాక యెవరికిఁ దెలియును? ఈనలుగు రధికారులచేత నా బ్రాహ్మణులకుఁ గలుగుచున్న పీడ చక్రవర్తి కనిపించినంతనే యాగిపోయెను. చక్రవర్తి యాబ్రాహ్మణుల నెచటనుండి వచ్చుచుండిరని ప్రశ్నించి వారి నా యధికా

దులవెంటఁ గిరికొని కాళికాదేవాలయము ప్రవేశించెను. చక్రవర్తి యొకటికి వచ్చి మూఁడేండ్లాయెను. ఆయన యీ నాఁటిప్పటికి వచ్చునని కాళికాదేవి వార్త వినియుండెను? అప్పటఁ జేసి నందున జరిగిన విధానములోఁ గాళికాదేవి యాదకులు, తదితర బ్రాహ్మణులును మూఁడేండ్లుగా కాళికాదేవాలయమునందలి కార్యక్రమ విషయములఁ బత్రికాప్రకాశకులు చేసిన మార్మ్యయము లన్నియుఁ విచారణకు వచ్చెను. ఆ యంశమును జక్రవర్తి వెంటనే గొండజ్జ నభిషేకముగా నంగీకరింపఁ గొండజ్జ నితాంతభక్తులకుఁ దెల్పుట చేసెను. ఆ కొలదికి తెగవారు నవ్వుకొనిరి. ఒక్క రెండుగడియల కాలములో రాజధానియంతయుఁ గాళికాదేవి మూఁడేండ్ల క్రిందటి గౌరవస్థానము నందెను. ఇదియంతయు దైవతమువాఁడ జక్రవర్తియుఁ గాళికాదేవియు, నిద్దఱే యొకచావడిలోఁ గూర్చుండిరి. చక్రవర్తి యిట్లనెను, 'అమ్మా! నన్ను క్షమించితివా?' కాళి: దేనికి? చక్రి: ఆనాటి బ్రాహ్మణవధకు. కాళి: నాయనా! నీ బ్రహ్మహత్యాపాతకము పోవుటకు నేను మూఁడేండ్లు చేసిన దానములో, నియమములో, వ్రతములో, పడిన కష్టములో, లెక్కలేదు. ధాన్యకటకము చుట్టును గల పదియూళ్ళలోఁ బది శివాలయములు కట్టించితిని. వేయిమంది బ్రాహ్మణుల చేత మహామంత్రజపములు జపింపఁజేసి తత్ఫల మంతయు నీకు ధారవోయించితిని. నీకోసము నిరాహారోపవాసములు చేసితిని. చక్రి: తల్లీ! నామీఁద నీ కేల యంతదయ? నీకు నే నేమగుదును? నా పాపము పోవుటకు నీ కేల యంతపట్టుదల? నేను బౌద్ధుఁడను. నీవు బౌద్ధురాలవు. ఈ బ్రాహ్మణ దైవతముల, నీకు నాకు నిద్దఱకు లేని యీ విశ్వాసము, శివాలయనిర్మాణాది బ్రాహ్మణ ధర్మములు చేయుటచేత నీ బ్రహ్మహత్యాపాతకము నెట్లు తొలఁ

గును? ఇది నా కర్థమగుట లేదు. కా: తండ్రీ! నిజముగా నీవు
బౌద్ధుఁడవుకావు. నేను బౌద్ధురాలను గాను. నీవు నిజముగా
బౌద్ధుఁడవా? చెప్పుము. పై మాటలుకాదు. నీ హృదయమును
బరీక్షించుకొని చెప్పుము.'

అనఁగాఁ జక్రవర్తి కనులువాల్చి యాలోచనానిమగ్నుఁ
డయ్యెను. మౌనము వహించెను. కాళింది యిట్లనెను. "నీవు
శాంతిమూలమహారాజు కడుపునఁ బుట్టలేదని నీకొక యనుమా
నము. నీ మేనత్త శాంతిశ్రీ, యామె కూఁతురును నీ భార్యయు
నైన శాంతిశ్రీ, వారిద్దరు నీ యీ యనుమానము నాధారము
చేసికొని నిన్ను బౌద్ధునిగాఁ జేసిరి. నీ జన్మనుగూర్చిన రహస్యము
నీకుఁ దెలియక పోవుటచేత నిన్నది పెనుభూతముగాఁ బట్టి
పాలార్చుచుండెను. కారణము గాని కారణముగా నది నీ కొక
బ్రాహ్మణ మతద్వేషమును గల్పించెను. బ్రాహ్మణులయందలి
సుగుణములు, బ్రాహ్మణ మతమునందలి యౌత్కృష్ట్యము
సర్వము విపరీతముగాఁ గన్పించెను. ఒకవిషయమునందలి మన
యనురాగమును, మఱియొక విషయమునందలి ద్వేషమును
తద్విషయాశ్రితములా? తద్విషయత గుణదోషాశ్రయములా?
గుణదోషములు, సర్వవిషయములం దుండును. మన భావనచేత
నవియే యొకప్పుడు గుణములుగా, మఱి యొకప్పుడు దోష
ములుగాఁ గనుపించును. ఏదో యనుమానము, నెవరో చెప్పిన
మాట, యెందుకో మన హృదయ మొకచోటనుండి తొలఁగి
మఱియొకయెడ కొరుగును. నీ యనుమానముచేత నీవు బౌద్ధుఁడ
వైతివి. శాంతిమూలచక్రవర్తి రక్తమునందు బ్రాహ్మణ
మత ద్వేషములేదు. నీ రక్తములో బ్రాహ్మణ మతద్వేషము
పుట్టించు రక్తములేదు. మఱి నీ కీ ద్వేష మెట్లువచ్చెను? పట్టి

యనుమానము. చక్రి: సరే నే నిట్లు బాధపడ నైతిని. నీ వెట్లు బాధరా లైతివి? కా: నీ పాలనములో నందఱు బాధపడు చుండిరి. నా కొడుకు బాధపడ్డాడు. నేను బాధరాల నైతిని. చక్రి: నీకుఁ గొడుకా? ఎవ రతఁడు? కా: నా కొడుకు చనిపోయెను. అతనిని ప్రేమించుటకే నే నీ బౌద్ధమతమునవలంబించినది.

# త్రయోదశాధ్యాయము

నీంపుసవదత్తునకుఁ బ్రసన్నతాప్రసన్నతలు, కోపశాంతతులు నుండియుండి ఘట్టములుఘట్టములుగా బయలుదేరును. ప్రతి రోజులువరుసగాఁ గాళిందీసౌధమునకుఁ బోవుచు నప్పుడప్పుడు నతఁడు చాల శాంతించును. ఆయన కొకయూహ తోఁచెను. భట్టిదేవి కాళిందీదర్శనము చేసినచో భట్టిదేవికిఁ గూడఁ దనకువలె సుఖము కలుగునని తాను భట్టిదేవికిఁ గల్గించెను. ఆమె సమాధాన మిప్పింప లేదు. తా నామెతో మాట్లాడియే పదునేను పదునాఱేండ్లకుఁ దక్కువకాలేదు. కొడబలి పెరిగి పెద్దదై నవయౌవనవతి యయ్యెను. ఆమె మూఁడుమూర్తులఁ జెల్లెలిబోలియుండును. కొడబలిగాని బాహుబలుఁడుగాని తల్లి యంతఃపురమునకుఁ బోరు. వారికిఁ దండ్రివద్దనే చనవు. అప్పటివఱకుఁ జక్రవర్తి కొడబలికి వివాహప్రయత్నములు చేయలేదు. భట్టిదేవి తనకు ప్రతిసమాధానము పంపించని వెంటనే చక్రవర్తికి మఱలఁ గోపమువచ్చెను. ఆసమయమున కొడబలి తండ్రితో మాట్లాడుటకు వచ్చెను. ఆ సమాధానము రాకపోవుట, కొడబలి వచ్చుట చక్రవర్తి హృదయములో పరస్పర సంబంధకములుగాఁ గన్పిం

చెను. చక్రవర్తి బయలుదేరెను. కొడబలి "ఎక్కడికి నాన్న గారూ" అనియడుగఁగాఁ జక్రవర్తి "మీ యమ్మగారిదగ్గరకు" ననెను. ఈ మాటలు పరిచారికలు, పరిచారకులు ముప్పదు నలుగురు వినిరి. రాజసౌధమంతయు నాశ్చర్యపోయెను. చక్రవర్తి పాదచారియై పట్టమహిషి సౌధమునకుఁ బోవుచుండెను. అంతఃపుర జనము తొలఁగి తొలఁగి, తొంగి వెనుకనుండి వెనుకనుండి చూచుచుండెను. చక్రవర్తి వచ్చునని పట్టమహిషి కేమి తెలియును? ఆమె యీ పదునాఱేండ్ల నుండి యెట్లుండెనో యట్లేయుండెను. ఒక తెల్లని సామాన్యపుచీరఁ దాల్చి నిరాభరణ సుందరియై నెల కొకసారి సంస్కరించుకొనుచున్న శిరోజ భారముతోఁ గృశించి, తిలకమాత్రపరిహాసిత ముఖారవింద సౌందర్యయై యేవో గ్రంథములు చదువుకొనుచుండెను. భర్త వచ్చినంతనే యామె లేచి నిలుచుండి యొక యాసనము చూపించెను. తాను వచ్చెనని యామె పొందిన యాశ్చర్యము లేదు, సంతోషము లేదు, తొందరపాటు లేదు. ఆమె సౌధమునఁ బరిచారికలు లేరు. చక్రవర్తి వచ్చుచుండెనని యామెకు ముందుగాఁ దెలియుటకుఁగూడ వీలులేదు. చక్రవర్తి రెండు విఘడియలు మౌనియై కూర్చుండినతరువాత భట్టిదేవి యిట్లనెను. "మహారాజులకు నేనేమి చేయుదును? తమరియాజ్ఞ యేదియో తెలిసినచో నాచరించుటకు సిద్ధముగా నున్నాను." చక్ర: ఉన్నారు. ఉన్నారు. అయ్యో! చాల సిద్ధముగ నున్నారు. భట్టి: మహారాజులకుఁ గోప మేలవచ్చెనో నాకుఁ దెలియదు. తమరియాజ్ఞ నేను జేయనిదెప్పుడు? పదునాఱేండ్లనుండి తమరు గీసినగీత దాటుట లేదు. కడుపునఁ బుట్టిన బిడ్డలనుగూడ, తమ యాజ్ఞోల్లంఘనముచేసి చూచుటలేదు. చక్ర: అదియట్లుండుఁడు.

కెంతు విషయములలోఁ బ్రధానముగ నా యాజ్ఞోల్లంఘనము
చేసితిరి. భట్టి: నాకు జ్ఞాపకములేదు. నాకుఁ దెలియదు. చక్ర:
ఏమి తెలియదు? మహాచైత్రోత్సవము జరిగిననాఁడు పట్టమహిషి
గారికోస మొకరు మూఁచి మూఁచి సర్వజనులలోఁ జక్రవర్తికిఁ
వలవంపైనది. దాని నోర్చుకొన్న చక్రవర్తి మఱి దేనికోర్చుకో
లేఁడు కాని నేఁటి విరసన మోర్చుకోలేకపోయినాఁడు. కాళింది
దర్శనము చేయుటకుఁ గబురంపితిని. నాకు సామ్రాజ్యము
కంటె, బౌద్ధమతముకంటెఁ గాళిందీదేవి శాంతిప్రసాదిని.
ఆమెను మీతోఁగలసి వర్తింపవలె ననుకొంటిని. భట్టి: ప్రభూ!
మీకు నలుఁబదియేండ్లువచ్చినవి. నాకు నలుఁబదేండ్లు వచ్చినవి.
పురుషులకు నలుఁబదేండ్లు నడిమి యౌవనము కావచ్చును. స్త్రీలకు
గాదు. షష్టిశ్రీ పసిపిల్ల. ఆమె లోకోత్తరసౌందర్యవతి. ఈపట్ట
మహిషీత్వ మామెకిచ్చి, యామెతోఁ గలసి యిచ్చటికిఁ
బోరాదా? చక్ర: భర్తీ, జరిగినదియు, నాజ్ఞానుసరణమును
బ్రతీక్షింతునుగాని యాజ్ఞాస్వీకరణమునకు రారు. భట్టి: ప్రభూ!
అట్లయినచో నేను వత్తును పదండి. సాయంతనమా? ఇప్పు
డేనా? చక్ర: మీరు రానక్కఱలేదు. భట్టి: క్షమించవల
యును. తమకుఁ గోప మేలవచ్చెనో నాకుఁ దెలియకున్నది.
చక్రవర్తి తనకిందుకు వచ్చెనని చెప్పలేదు. ఇంతకుముందు నేను
గబురు పంపితిని. నీ వేల రాలేదని యడలేదు. నిజ మేమనఁగాఁ
జక్రవర్తి కబురు వచ్చినపుడు భట్టిదేవి ధ్యానములో నుండెను.
ఆమెకు ధ్యానసమయమం దామెయొడ లామెకుఁ దెలియదు.
చెప్పిన దాసి, వినయములో సన్నవిస్వరముతోఁ జెప్పెను.
ఆమెకుఁ జక్రవర్తి వద్దనుండి కబురు వచ్చినదనియే తెలియదు.
చక్రవర్తి మఱలఁ బ్రత్యగ్రదశనందిన యిరువదియేండ్ల కోపము

మనసులోఁ బెట్టుకొని బయల్దేరెను. పోవుచుఁ బోవుచు గడపలో
నాగి యిట్లనెను. "నీవు సుక్షత్రియకుటుంబమున జనించితివి.
నా జన్మ నాకే తెలియదు. నిన్ను రాక్షసవివాహము చేసికొని
తెచ్చితిని. తప్పంతయు నాదిగాని నీదిగాదు. వీరపురుషదత్తుఁడు
నట్టి దురదృష్టవంతుఁడు. అతనికి భట్టిదేవిమీఁదఁ బ్రేమకలదు.
భట్టిదేవి సుక్షత్రియ. ఇట్లతని ప్రేమ వ్యర్థమయ్యెను. వీరపురు
షుఁడు సత్పురుషుఁడుగాఁడు. పగతీర్చుకొనువాఁడు. పదునాల్గేండ్లు
తీర్చుకొనెను. ఇంకను దీర్చును. ఇదివఱకుఁ దీర్చినది తీర్చినట్లే
కాదు. ఇప్పుడు తీర్చఁబోవునదియే నిజముగాఁదీర్చుట. వీరపురుష
నకు క్షత్త్రియులమీఁద, బ్రాహ్మణులమీఁద నెందు కింత
కోపము? ఈ కోపమునకుఁ గారణ మెవరు? భట్టిదేవి. ఈ
రాజ్యమంతయు బౌద్ధమయముగాఁ జేసిన దెవరు? భట్టిదేవి.
వీరపురుషుని జీవితములో విష మొలికించిన దెవరు? భట్టిదేవి.
వీరపురుషుని జీవితమంతయు నొక విరహావస్థాఘట్టము జేసిన
దెవరు? భట్టిదేవి. భట్టిదేవికి క్షత్త్రియత్వ మన్న నంతయభిమాన
మెందులకు? బ్రాహ్మణు లన్న నంత గౌరవ మెందులకు? ఆ
బ్రాహ్మణ్యమునకుఁ బ్రతిక్రియగా వీరపురుషుఁ డెంతచేసినాఁడు.
అంత క్షత్త్రియులకుఁ జేయలేదు. ఇపుడు క్షత్త్రియులకుఁ జేయును
అనుచుండఁగా, భట్టిదేవి కోపమును, శోకమును రెండును
గలుగఁగాఁ జక్రవర్తినిఁ గోపముతోఁ జూచుచుఁ, గనుల
వెంట నీరుగార్చుచుండెను. చక్రవర్తి యామె యెట్టిస్థితిలో
నున్నదో విచారించనే లేదు. ఒక విధురధూననముతో నచటి
నుండి వెడలిపోయెను. ఆయన తన సౌధమునకుఁ జేరినంతనే
కోడబలి యచ్చటనే కనుపించెను. ఆయన కోడబలిని జూచి
యిట్లనెను, "అమ్మా! నేను నీకుఁ దండ్రినిగదా? కోడ: అవును.

చక్ర: లోకములోఁ దండ్రికన్న నధికులుందురా? కొండ: ఉండరు.
చక్ర: నీకును వివాహమైనదో, నీభర్త నాకంటె నధికుడుగా
గన్పించునా? కొండ: నేను వివాహమే చేసికోను. చక్రవర్తి:
అదియేమి? కొండ: నేను బౌద్ధభిక్షుకురాల నగుదును. చక్ర:
ఊరకే వివాహము చేసికొనుము. తరువాత భిక్షుకురాలవు
గావచ్చును. కొండ: అట్లే. కొండబలి గర్భములో భర్తృనిరాక
రణహేతువున నైనను, గర్భవిష్ట సహజపరిపాకవశముచేత నైనను,
భర్త నెడబాసి యుండఁగలిగిన గుణము సహజముగా నుండెను.
రెండవది సంప్రదాయేతరముగఁ బ్రవర్తించుటకుఁ దండ్రి
పెంపక ముండెను. కొండబలికి వివాహము, భర్త, సంసారము
ఈ మొదలైన భావములేమియుఁ దెలియవు. ఆమెకు తన
తండ్రి భగవంతుఁడు, తనయన్న కాబోవుచక్రవర్తి. భదంతుడు
మొదలైన బౌద్ధమతాచార్యులు సృష్టిలోని సర్వసంభావములు
విజయపురము బోధిసత్త్వుని రాజధాని. మఱి యేదియుఁ దెలి
యదు. ఎంత తెలియనిపిల్ల కాకపోయిన, మహాచైత్యోత్సవ
ములోఁ బోయి పట్టమహిషీనిర్ణీత సింహాసనముపైఁ గూర్చుం
డును? ఆమె పుట్టిననాఁటనుండియు, స్త్రీలలోఁ బెంపఁబడలేదు.
తండ్రి కనుమఱఁగి బ్రతికిన నిముసము లేదు. ఆమెకు సృష్టియం
తయుఁ బురుషమయము. స్త్రీపురుష సంయోగముచేత సృష్టి
జరుగుచున్నదన్న జ్ఞానమే యామెకు లేదు. యౌవనోదయముతో
జంతువునకు లింగజ్ఞానోదయము కలుగు నని కొందఱు చెప్ప
వచ్చును. ఆమె కదియు లేదు. బాహిరములైన కారణములు
తద్జ్ఞానమునకుఁ బరిపోషకములేమో! ఆ బాహిరములైన కార
ణములు కొండబలికి సమకూడుటకే వీలు కాలేదు. ఇంక నామె

స్త్రీ కాదు. పురుషుఁడు కాదు. భట్టిదేవిమీఁద జక్రవర్తి పగ తీర్చుటకు నుపయోగపడు నాయుధమువలె నిలఁబడెను.

చక్రవర్తియొక్క పగతోడ్పాన భట్టిదేవి పుట్టినింటి యందుండెను. భట్టిదేవి కదంబుల యాఁడుబిడ్డ. భట్టిదేవి యన్నగారు రాజు. ఆయన కిద్దఱుకుమారులు. పెద్దవాఁడు యువ రాజు. అతనికి వివాహమయ్యెను. రెండవవానికి వివాహము కావలయును. కోడలిబాలికిఁ దగిన సంబంధము. వీరపురుష దత్తుఁడు తన చెల్లెలి నెట్లు చూచునో కదంబవనవాసులకుఁ దెలియని విషయముకాదు. కాని పట్టమహిషి యామెయే యగుట, యామె మర్యాద కెప్పుడు భంగము కలుగకుండుట కాదంబులకు భట్టిదేవివిషయమునఁ గోపము గలుగనియలేదు. ఇప్పుడు వీరపురుషదత్తునివద్దనుండి వార్త వచ్చెను. తన రెండవ కుమారునకుఁ గోడలిని నిత్తుమని. భట్టిదేవి సోదరుఁడు చాల సంతసించెను. తన రెండవకొడుకు రాజుకాఁడు. చక్రవర్తి కొక్కతెయే కూఁతురు. మూర్ధాభిషిక్తుఁడు కానేరని తనకొడుకు నకుఁ జక్రవర్తి కూఁతు నిచ్చుట యతనికి భట్టిదేవియందుఁగల గౌరవము, తనయందుఁగల గౌరవము. చక్రవర్తి బౌద్ధుఁడు. అయినను క్షత్రియుఁడైన తమతో సంబంధము వదలుకొనుట కిష్టములేనివాఁడని వచ్చిన బ్రాహ్మణులును, మంత్రులును జెప్పిరి. వారి నదియే చెప్పిరి. చక్రవర్తి మనస్సు బౌద్ధమతము నెడల విముఖమయ్యెనని, మరలఁ దాను క్షత్రియుఁడుగా నుండ వలెనని వాంఛించుచున్నాఁడని. కదంబరాజు మిక్కిలి సంతో షించెను. సంబంధ మంగీకరించెను. కదంబులు వనవాసము నుండి విజయపురికిఁ దరలివచ్చిరి. చైత్రోత్సవ మెంతవైభవ ముగా జరిగెనో, వివాహమంత వైభవముగా జరిగెను. వివాహ

వెళ్ళినచో నీమగఁ డేమికావలయు ననెను?" కొండబలి యతనిని
గూడ నమ్మను మనెను. అదివఱకే పండ్లు పులిసిన పెండ్లికొడు
కీ సమాధానము వినిన తరువాతఁ బండ్లనొప్పి మొదలుపెట్టి
పండ్లకుఁ గప్పువేయవలసినంత స్థితిపట్టెను. కాని సర్వము నింత
వ్యతిరేకముగా నున్నను, పెండ్లికుమారున కొకయాస కలదు.
చక్రవర్తి కూఁతునన్న వ్యామోహము. కొతకొద్ది గుప్తము,
తమ యూరునకుఁ బోయినతరువాత నామెను కక్ష్యములోనికిఁ
దీసికొని రావచ్చునని యూహ. ఇట్లు వివాహ మెల్ల రసాభాస
మయ్యెను. నాల్గవదినమున మగపెండ్లివారు బయల్దేరిరి. పెండ్లి
కూఁతును బంపించు మనిరి. కదంబరాజు తన తోఁబుట్టువుతో
భట్టిదేవితో మాటాడెను. భట్టిదేవి పెండ్లి మూన్నాళ్ళు
దూరదూరముగ నుండెను. నగలు ధరించీ ధరింపక, మొగము
చూపీ చూపక, యొదిగి యొదిగి యుండెను. తన యన్న
గారితో భట్టిదేవి యిట్లనెను. "ఈ వివాహము నన్నడిగి చేసి
కొనిరా? కొండబలి నా కూఁతురుకాదు. ఆమె క్షత్రియ కాదు.
అసలాడపిల్ల కాదు. చక్రవర్తి నామీఁద బగతీర్చుకొను నాయు
ధము. నే నాయనను క్షత్రియుఁడు కాఁడని యన్నదిలేదు. ఆయన
క్షత్రియుఁడు కాఁడన్న యూహ నేనుగా మూర్తికట్టితి నని
యాయన యూహ. ఇది యాయనయే కల్పించుకొని యాయ
నయే దోహదముచేసి యామెను బ్రతీకారాస్త్రముగా సిద్ధపఱ
చెను. మీరు తెలియక యీ వ్యూహములోఁ బడిరి. కొండబలి
కానురాదు. సంసారమును జేయదు. ఎట్లు చేయును? ఆమె
స్త్రీ ప్రకృతి బాహిరురాలు" కదంబరా జాలోచించెను.
బంధుత్వములో నమ్మకములో నింత ద్రోహము చేయునా?
ఇక్ష్వాకు సామ్రాజ్యము తాము పడమటి దిక్కున, తూర్పు

యింపఁబడెను. తక్కిన రాచపెండ్లి వారందఱు వెడలిపోయిరి. పరిమిత పరివారముతోఁ బెండ్లికుమారుఁడు మాత్రము దిగఁబడెను. రెండు మూఁడు దినములు గడిచెను. వారము గడచెను. రెండు వారములు గడచెను. మాసము గడచెను. రెండు మూఁడు మాసములు గడచెను. పెండ్లికొడుకు పేరు విజయవర్మ. విజయపురములో నతనిపే రెవ్వరికిని దెలియదు. పెండ్లికూఁతునకుఁ దెలియదు. అతని నల్లుఁ డనికూడ వ్యవహరింపరు. పెండ్లికొడు కని మాత్ర మందురు. పెండ్లికొడుకు నేడనుండి ప్రతి సాయంకాలము పరిచారిక కొడబలిని దీసికొని వచ్చుటకుఁ బోవును. కొడబలి బౌద్ధవిహారములలోఁ దిరిగి తిరిగి రేయి రెండుజాములు దాఁటిన తరువాత వచ్చును. మూఁడు జాములు దాఁటిన తరువాత వచ్చును. ఒకప్పుడు రానేరాదు. ఉదయకాలములయందే స్తూపప్రాంత శిలావేదిక పైననో పండుకొని నిద్రించుచుండును. తల ముడుచుటయు నాకంఠముగఁ దాల్చిన శితకంథయు నామె బౌద్ధ భిక్షుకురాలితనము తెల్పును. విజయవర్మ పరిచారకు లెవ్వరైన బోయి 'అమ్మా! మీ భర్త తమకొఱ కెదురు చూచుచున్నా' రని చెప్పినచో నామె తీక్ష్ణముగాఁ జూచి "నాకు భర్త యెవరు? నేనే యతనికి భర్త నని చెప్పుఁ" డనును. మొదటి దినములలో దాఁచఁబడిన యీ మాట పోనుపోను విజయవర్మకుఁ బ్రకాశితమయ్యెను. విజయవర్మ విజయపురమున నాల్గునెలలు కాపురము చేసెను. అతనికిఁ బోను పో నొక భయము కల్గెను. తాను దన దేశము పోనెంచినచో పోనిత్తురా? తన్నిచ్చట బంధితుని జేయుదురా? ఒకనాఁ డతఁడు చక్రవర్తివద్దకుఁ బోయి. 'మహారాజా! నేను మా యూరు పోదలఁచుకొన్నా' నని చెప్పెను. ఆ చెప్పుట

కాళిందీదేవివద్ద జరిగెను. కాళింది యిట్లనెను. 'అది యేమయ్యా! భార్య యిచ్చట నుండగా, నీ వచ్చటి కేల పోవుదువు? భార్యను దీసికొనిపోవుదువా?' యనెను. విజయవర్మకుఁ జక్రవర్తి యెదుట సమాత్రము మాటాడినవా రిదివఱకుఁ గనిపించలేదు. అతని రాచనెత్తురు మాటవిఱుపు సహించి హృదయములోని కోపమునే వెలిపుచ్చెను. "అమ్మా! నీ వెవరు? చక్రవర్తి యెదుట నింతమాత్రము మాటాడుటకు సాహసించితివి! ఈయన నా మేనత్తభర్త. ఈయన కూఁతురు నాకు మేనత్త కూఁతురు. ఆమె చక్రవర్తి కూఁతురు. నేను వట్టి రాజకుమారుఁడను. ఆమె బౌద్ధురాలు. నేను క్షత్రియుఁడను. మా మేనత్త క్షత్రియ. చక్రవర్తి బౌద్ధుఁడు. ఐమూలలుగా మా దాంపత్యమును జూడుము. ఇరువదియేండ్ల నుండి మా మేనత్త యెట్లుండెనదో నేనట్లు కాబోవుచున్నాను. ఈ బౌద్ధమత మను నిర్వికారమైన నాగార్జునకొండనుఁ గొట్టుకొని మా క్షత్రియత్వ మను కృష్ణానదీప్రవాహము తరగలంచులఁ బ్రిదిలిపోవుచున్నది. మహర్షుల కూఁతురైన యీ నాహిని బౌద్ధుల భిక్షాపాత్రల నింపుటకు బుట్టినది. రాజదుహిత యొకపగసాధనము. ఆ పగకు మొదలి తుదళ్ళు తెలియవు. నా క్షత్రియత్వమును జక్రవర్తి నాశనము చేయుటకుఁ దలపెట్టినాఁడు. నేను నాక్షత్రియత్వమునునాశనము గానీయను. నా శరీరమును జక్రవర్తికి నీ మాటలతో నిచ్చుచుంటివి. చక్రవర్తి బ్రాహ్మణులను గత్తితో నఱకినాఁడట. బ్రాహ్మణులను నఱకవచ్చును, బ్రాహ్మణులు నాయుధులా? వారి యాయుధము క్షత్రియులు. నన్ను నఱుకుము' మని విజయవర్మ తలవంచి నిలుచుండెను. కాళిందియుఁ జక్రవర్తియు నిశ్చేష్టులై నిలచిపోయిరి. కొంతసేపుండి విజయవర్మ మఱల

నిట్లనెను. 'నేను రాజద్రోహము చేసితిని. ఈ రాజ్యములో నిది రాజద్రోహము. మా రాజ్యములో నీ మాటలు రాజద్రోహములు కావు. అనఁగా నా రాజున కధికార మున్నంత మేఱ యిది రాజద్రోహము. ఆహా! యేమి రాజాధికారము! ఈ రాజాధికారమునకు సన్నమువలె సర్వత్రా వ్యాప్తిలేదు. తన చుట్టు గిరిగీసికొని యునికినే సర్వావకాశ మనుట.

ఆనాఁడు సాయంకాలము విజయనగ్ర తనదేశమునకు ప్రయాణముకట్టెను. ప్రతిపదము రాజాధికారులు తన్నడ్డగింతు రనియే యాయన యనుకొనెను. సర్వాధికారులు తమున్ముఖులుగా నుండిరి. ఒక్క యాజ్ఞయైనలేదు. వాని గుఱ్ఱములు రథములు విజయపురగ్రామోత్తరదిశామహాద్వారమునుండి వెలువడెను.

ఆయన వెడలిపోయెను. వెడలిపోయినంతనే దక్షిణాపథ మంతయు విజయనగ్ర దుఃఖాశ్రుమూర్తి, వర్షరుతువు ప్రారంభించెను. మలుసంజలు ప్రతీకార రక్తచ్ఛవు లయ్యెను. కృతనిశ్చయక్షత్రియమహోళీబద్ధ సీమంతకేశబంధములవలె మొగిళ్ళాకసమున నల్లగా ముసురుపడెను. క్షత్రియహేతిచ్ఛటలవలె సౌదామినులు పియదంచలము లయ్యెను. వనవాసప్రాంత పశ్చిమగిర్యగ్రభాగములఁ గురిసిన వానలకొలఁది కొండలపై నుండి క్రిందపడను కొండచిలువలవలె సెలయేళ్ళు ప్రవహింప నారంభించెను. ఇచట మహాపర్వతములు; ఇచట లోయలు. ఈ లోయలలో మేఘములు పట్టును. గిరిమేఖలాభాగములు నిర్మేఘములుగా నుండెను. కదంబదేశమంతయు, మేఘాచ్ఛాదిత మయ్యెను. నిర్ఝరస్ఫురితమయ్యెను. గిరిదరీఝరీపరిపూర్ణ మయ్యెను. క్షేత్రపుల నేలమీఁదఁగూడ నీ మొలుళ్ళగాలి సోకెను. సత్రవజటాధారాసమారబ్ధసమోదావళులు హేతి

సద్వృత్తివిద్యాత్త్వ బద్ధతను వెలయించెను. ఇతరములైన చిన్న చిన్న రాజ్యములలోఁగూడఁ గత్తులతోపాటు మోజపులు మెం సెను. క్షత్రియుల కన్నిట్ళతోపాటు ... కుదిరెను. వారి ప్రతిజ్ఞావాక్యములతోపాటు ... మున్ను పచ్చతో భద్రమైన యిక్ష్వాకురాజ్యము నేఁడు నాల్గుదెసల విన్యా సంక్షోభరముల ... త్రిశిరేత సంక్షోభాంకితమైన ట్లుండెను. కృష్ణానది తన కేళీయుఁ బట్టనట్లు, నాగార్జునునికొండ కెలనఁ బ్రవహించుచుండెను. ఆమె తన తరంగములతోఁ గొండను కుద్దాలించవలయు నని కాఁబోలు! నాగార్జునునికొండయొక్క ప్రత్యంతధాత్రీమాత్రము తన శిలాఘట్టనవల్ల విసరి విసరి ముసరిన తరంగములఁ జిన్నపలుగాఁ జేయుచుండెను.

# చతుర్దశాధ్యాయము

చైత్ర మేఘములు ముసరినకాలఁది వీరపురుషదత్తుఁడు తనలోఁ దాను ముసుచుకొనఁజొచ్చెను. భట్టిదేవిని గెలుచుకొని వచ్చుటకుఁగరవాలసాసుడై బయలుదేరిన వీరపురుషదత్తుడేనా యీయన! వార్ధక్యములోఁగూడఁ బరాత్రమము వెలయించుట యిక్ష్వాకులలో శాంతిమూలచక్రవర్తితో నేపోయెనా? తన కొడుకు బాహుబలశాంతిమూలుఁడు పందొమ్మిదేండ్లవాఁడు. ఆయన యువరాజై యుండెను. రాజ్యభారమంతయు నతనిమీఁదఁ బెట్టి మాతరీపుత్రుఁడు రూపముచేతఁగూడ బౌద్ధసన్యాసియై యుదయసాయంకాలములయందు కాళిందీసాధమునకుఁ బోవుటయు, వచ్చుటయు నతని హృదయములో బౌద్ధమతము సంపూర్ణమైన దశనందిన ట్లుండెను. బౌద్ధసిద్ధాంతము లన్నియు

భదంతాచార్యులు చెప్పిరి. అవి తెచ్చెదు శాంతియంతయు కాళింది తెచ్చెను. ఇన్నినాళ్లనుండి కాళిందీదేవి భదంతాచార్యుని దర్శించలేదు. ఆమె తనవిహారము వదలి పెదవిహారమునకే పోదాయెను. మాతాపితృులును తన సుపుత్రులైన యీ యిద్దఱిని సమావేశపఱచి వారి వాదనల సారాంశమును జూచికొనవలయునని తలంచెను. కాళింది యిల్లు కదలదు. భదంతునే యచ్చటికిఁదీసికొనిపోవలయును. ఆచార్యునితోఁబదిసమకొకండు సార్లుచెప్పి చివర కొకప్పుడు భదంతాచార్యుని గాళింది యింటికిఁ దీసికొనివచ్చెను. వారు ముగ్గురు నొకచోటనే కూర్చుండిరి. సమాచారములు నడచినతరువాత చక్రవర్తి యిట్లనెను. "ఈమె నాకుఁదల్లి. మీ రాచార్యులు. మీ రిరువురును బౌద్ధమతరహస్యములు చర్చించినచో వినవలయునని నాకున్నదనెను. భదంతాచార్యుఁ డిట్లనెను. "విచారించుట కేమున్నది? "ఏకం హింసచ్చం, నదుతీయమత్థి యస్మిం పజానో వివదేప జానం" అని బుద్ధదేవుఁడు ధమ్మపథములో చెప్పెను. సత్యమొక్కటియే. ఇది తెలిసినవాఁడు వివాదముచేయఁడు. కాళింది: గురూ! తెలిసినవాఁడుకదా వివాదము చేయనిది. తెలిసికొనవలయునుగదా!

భదంత: 'సోకరోహి దీపమత్తనో, కిప్పం వాయను పండితో భవ, బద్ధంత్ర అనంగనో, దిబ్బం అరియభూమి నేహిసి"

నీవే ఆత్మకు దీపము చేసికో, దుర్గుణములు వదలి దోషములు లేకుండ దివ్యమైన పరమపదమును సమీపించుము.

కాళింది: స్వామీ! ఇచ్చట ఆత్మయన్న శబ్దము 'స్వ' యన్న మాత్రమేనా? ఆత్మ యన్న పదార్థమా?

భదంతుడు: ఆత్మయన్న పదార్థముగన నెుప్పుకొనము. కాని బౌద్ధులలో రెండు సిద్ధాంతములున్నవి. ఒకసిద్ధాంతము వారు బాహ్య ప్రపంచమును, అంతః ప్రపంచమును కలదందురు. ఇవి రెండును గలసి విశ్వమగును. ఈ విశ్వ మణువులయొక్క సముదాయముచేత జరుగుచున్నది. ఇవి నాల్గువిధములు. పృథివ్యణువులు. జలాణువులు. అగ్న్యణువులు, వాయ్వణువులు. ఈ నాల్గింటిచేతను బాహ్య ప్రపంచ మేర్పడు చున్నది. ఇక అంతః ప్రపంచము ఐదు పంచస్కంధములచేత నేర్పడు చున్నది. మొదటిది రూపస్కంధము. దీనియందు పంచేంద్రియ ములు, తద్విషయములు కల్గుచున్నవి. రెండవది జ్ఞానస్కంధము. ఇది అహంప్రత్యయకారి. మూడవది వేదనాస్కంధము. ఇది సుఖదుఃఖముల హేతువు. నాల్గవది సంజ్ఞాస్కంధము. దీనివలన నీ సృష్టిలోని వస్తువులు. వాని నామములు. దీనివలన చున్నవి. ఐదవది సంస్కార స్కంధము. దీనివలన మోహము, వైరాగ్యము, ధర్మాధర్మములు— ఇవి ఏర్పడుచున్నవి. కాళింది: ప్రభూ! నాకుం బలుదినములనుండి సందేహములు కలవు. వానిని దమవంటి పెద్దలు తీర్చిపెట్టవలయును. భదంతుడు: అడుగవచ్చును. కాళింది: ఈయణువులను బౌద్ధులుకొత్తగాఁగల్పించినదికాదు. ఇదివఱకే యున్నది. ఈ విశ్వ మణువుల సముదాయముచే జరుగుచున్నచో, వాయణువుల సముదాయమెవరిచేఁ జేయఁబడు చున్నది! ఆ సముదాయము జరుగుట చూడఁబడిన విషయమేని మనుష్యజన్మ జరిగినతరువాత నది జరుగవలయును. మనము దానిని జూచితి మనఁగా నదియొక ప్రత్యేకమో, యిదివఱకే జరిగియుండెనఁగాఁజూచుటమెట్లో జరిగియుండవలెను. సృష్టికి బూర్వ మిది జరిగినచో, నప్పటికి శరీరము లేదు; మనస్సు లేదు. దీనికి

కారణము చూడరాని దొక యదృష్ట మందుము. అది యాత్మలో నున్నదా? అణువులలో నున్నదా? ఈ యదృష్టము చేతనమా, యచేతనమా? అది యచేతనమైనచోఁ బంచస్కంధ ములకతీతమైన యొక సర్వమాత్మ కావలయును. ఈ క్రియాశక్తి యణువులయం దున్నచో లయము జరుగదు. సర్వసృష్టి నిత్యముగా నుండవలయును. అణువులు సచేతనము లైనచో, మఱియొక సచేతనమైన యదృష్టముతోఁ గలియవు. అణువు లచేతనము లైనచో, సచేతనమైన యదృష్టముకంటె భిన్నమైనవి కావలసివచ్చును." భదంతుఁడు: అణువులు మొదటద్వ్యణుకము. అణువులు భిన్నములు; ఇటు ద్వ్యణుకము లసంఖ్యాకములు చేసి సృష్టియేర్పడుచున్నది. కాళింది: రెండణువులు కలియుటకు గలి పెడునది వేఱై యుండవలయును. ఇట్లే ద్వ్యణుకములను గలుపుటకుచు, వేఱు వేఱు సమవాయ శక్తులు కావలసియుండును. ఈ సమవాయశక్తి లేకుండ నవి కలసికొనలేవు. అప్పుడు సృష్టియే లేదు. ఈ యణువులకు వర్ణాదులు లేవు. ఈ సృష్టిలోనున్న వైచిత్ర్య మెట్లుకల్గెను. భదంతుడు: అణువులకు రూపాది మత్త్వము కలదు. కాళింది: ఐనచో నవి యణువులు కావు. స్థిరములు కావు. అవి దృష్టములు; పృథివీ పదార్థములు. పరమ సూక్ష్మములు కావు. అందుచే నవి నశింపవు. సృష్టి కవి హేతువులును గారాదు. మఱియు నింకొక యిబ్బంది కలుగుచున్నది. పృథివ్యణువులకు స్పర్శము, రుచి, వాసన, రంగు, ఈనాల్గుగుణము లున్నవి. జలమునకు మొదటి మూఁడుగుణము లున్నవి. అగ్నికి మొదటి రెండు గుణములున్నవి. వాయువునకు మొదటి యొకగుణమే కలదు. అప్పుడు నాల్గుగుణములు కల పృథివ్యణు వేక గుణముకల వాయ్వణువుకన్న పెద్దది కావల

లేకుండ నిట్లు జరుగదుకదా! అందుచేత సమవాయము జరుగు చున్న దని మనము తెలిసికొనవలయును. కాళింది: అది సరే! వీనిలో నొకదాని కొకటి కారణము. ఈ యన్నింటికిం గారణ మైనది లేదుకదా? అప్పుడు కారణాభావ మేర్పడు చున్నది. ఈ శరీర మాత్మ యొక్క సుఖదుఃఖముల కొరకు నేర్పడుచున్నది. ఇది క్షణికము. అందుచేత ననుభవితకాదు. ఈక్షణికమైనదానికి విముక్తి యేమి? బంధ మేమి? బంధ విముక్తులు లేనప్పు డీ సమవాయము జరుగుట యెందులకు? ఈ యణువులు వాని యంతట నవి యట్లు పెనగొనుచున్న వన్నచో నవి యట్లేల పెనగొనవలయునో తెలియరాదు. భిన్నము కాని కుండ, భిన్న మైన కుండ-పూర్వము, పరమునకు హేతువు. పూర్వమున కేమి హేతువు? కుమ్మరివాఁడు, చక్రము, మన్ను-ఇవి యన్నియు నుండవలయును - మన్ను దానియంతట నది కుండ కాలేదు. చక్రము దానియంతట నది పరిభ్రమణకారి కాలేదు. ఈ కార్య యిత్వశక్తి మఱియొకక ర్తయం దుండవలయును. భదంతుడు: నీవు వేదాంతివి. బౌద్ధమతస్థురాలవు. కావు. కాళింది: స్వామీ! సందేహములు తీర్చి పెట్టుచుంటివి: నా వేషము బౌద్ధము. నేను బౌద్ధురాల నేలగాను! ఇంకను గొన్ని సందేహము లున్నవి. క్షమించినచో నడిగెదను. భదం: కానిమ్ము. కా: మఱి మీ లయసిద్ధాంతములను జూచుడు. లయము రెండు విధములుగా జరుగుచున్నది. జ్ఞాతము, అజ్ఞాతము. మనుష్యుఁడు తెలిసి చేయు నది జ్ఞాతము. రెండవది దానియంతట నది జరుగునది. మీ క్షణిక వాదమువలన లయము నిత్యము జరుగుచునే యున్నది. అది యాపరాదు. క్షణములో జరుగు నీ లయముకంటెఁ బూర్వ మప్పటి కీ స్థితిలో నున్నది. కారణముగాఁ గార్యమైన సృష్టి

జరుగవలయును. అప్పుడు సృష్టి నిత్యము. కార్యములేకుండఁ గారణమైన స్థితి వ్యర్థము. పలువురు మీ సిద్ధాంతప్రకారము సత్తయనగాఁ గారణత్వము. ఈ చివరిక్షణికస్థితి కార్యరహితమైనచోఁ దత్పూర్వపూర్వములు నస్థితికములు. మఱియు శరీరులయం దీ సృష్టిలయములు కన్పించుటలేదు. ప్రతిక్షణము నెవ్వఁడు చచ్చుటలేదు. పైనేదియు నశించుటలేదు. ఒక జలబిందువు సూర్యాతపమువలన నింకిపోయినచో నది నాశమైనట్లు కనిపించుచున్నది. ద్రవ్యము నశింపదు. ఇక మీ మోక్షసిద్ధాంతమునకు నభ్యంతరము. జ్ఞాతృత్వమైన నాత్మ లేనపుడు జ్ఞానమ యొక్క ప్రయోజన మేమి? ప్రకృతియు క్షణికమైనపుడు జ్ఞానాజ్ఞానములు, ధర్మాధర్మములు క్షణికములు. నిర్వాణము స్వరూప మేమి? దేనినుండి నిర్వాణము? కనుక నిత్యమైన దేదియో యుండవలెను. భదం: ఏదియు నిత్యముకాదు. నిత్యమైన దానినుండి వికారము సంభవింపదు. సంభవించినచో దానికి నిత్యత్వము లేదు. అందుచేతఁ గార్యము పుట్టకముందు కారణము నశించుచున్నది. విత్తు నశించిపోవుచున్నది. దానినుండి మొక్క వచ్చుచున్నది. కాళింది: అనఁగా నాశనములో నుండి సృష్టి జరుగుచున్నది. ఐనచోఁ గొన్ని ప్రత్యేకలక్షణములుగల నాశనమునుండి తత్ప్రత్యేకలక్షణవిశిష్టమైన సృష్టి జరుగుచున్నదని చెప్పుట యెందులకు? మామిడివిత్తు నశించగా నారింజమొక్క మొలవవచ్చును. దానిని మీ రొప్పుకొనరు గదా! అనఁగా విశిష్టలక్షణములకుఁ బ్రాధాన్యమా? కారణనాశనమునకుఁ బ్రాధాన్యమా? కారణమునకుఁ బ్రాధాన్యమైనచో దానినుండి సముద్భూతమగు కార్యమునకుఁ దత్పూర్వకార్యనాశన మవసరము లేదు. భదంతుడు: ఇదియంతయు నేనియు

లేదు. నిష్క్రియమైన యీ జగత్తునందు క్రియాభాస. కాళింది: ఐనచో నిష్క్రియత్వమునుండి యేదియు సముద్భవించదు. కారణములేదు. వ్యాపారములేదు. కార్యములేదు. మీ నిర్వాణమప్రయత్నముగ సిద్ధించును. మీరు వాస్తవ్యమికులు. మీ వాదము యోగాచారుల ననుసరించక సౌత్రాంతికుల ననుసరించును. ఆ ప్రకారము దృశ్యరూపమైన ప్రపంచకమే లేదు. ఆంతర ప్రపంచకమే యున్నది. ఇప్పుడు తమరు చెప్పిన దదియే కదా! భదంతుడు: అవును. సర్వము భావస్థిరము. కాళింది: అయినచో నీ ప్రపంచకము కుందేటికొమ్మువంటిదా? స్వప్నము వంటిదా ? కుందేటి కొమ్మువంటి దైనచో దీనినుండి సుఖదుఃఖములు మన మనుభవించుట యనుభూతిదూరము కావలయును. ఈ ప్రపంచకము సర్వథా లేదనుటకు లేదు. భదంతుడు: మీ వేదాంతులు నట్లేయందురు కదా ! కాళింది: మేము మిథ్యయందుము. మిథ్యయనగా నేమియు లేదనికాదు. జ్ఞానదృష్టికి లేనిదని తాత్పర్యము. దానివలన మోహము పొందరాని దని. భదంతుడు: ఈ బాహ్యప్రపంచము స్వప్నము వంటి దందుము. స్వప్నములోc జూచుచున్న వస్తువులు లేవు. అవి కనిపించుచుండునే కాని, మనోభావములు ద్వైధీభావము నందును. చూచువాcడు చూడcబడునవి—అట్లే యీ ప్రపంచము లేనిదున్నట్లు కనిపించుచున్నది. కాళింది: జాగ్రదవస్థకు స్వప్నావస్థకు భేదమున్నది. మేల్కొన్నంతనే స్వప్నగతమైన విషయ మయథార్థ మని తెలియుచున్నది. మేల్కొన్నప్పుడు. చూచినవిషయముల యయథార్థత యెప్పుడు తెలియుచున్నది? పైగా జ్ఞానమనగానేమి? అనుభవమేకదా! అప్పు డనుభూతమైన విషయము యథార్థముగా నేల గ్రహించరాదు? భదంతుడు: మీ

వేదాంతులు నంతియేకదా! కాళింది: మేము వేదమును విశ్వసింతుము. మీరు విశ్వసింపరుగదా! మాది మిథ్య. మీకు యయథార్థము. రెంటికిని భేదమున్నది. వస్తువులు లేకుండ తత్ జ్ఞాన మెట్లు కలుగును? భదంతుడు: అది జ్ఞానముకాదు. స్మృతి. స్వప్నములోని విషయములు జాగ్రదవస్థలో స్మృతి నంటుకొని యున్నట్లు పూర్వానుభూతవిషయములు స్మృతిపథమునందు ప్రేలాడి భావములుగా భాసించును. కాళింది: అప్పుడైనను మొట్టమొదట నెప్పుడో కలిగిన యీ యనుభవమునకు నీ దోషము పట్టును. భదంతుడు: అక్కరలేదు. ఆలయవిజ్ఞాన మని యొకటున్నది. దానినుండి సర్వస్మృతియు గల్గుచున్నది. కాళింది: అప్పుడా యాలయవిజ్ఞానమునకు నిత్యత్వము కలిగి యుండవలయును. అది మీ క్షణికవాదమునకు వ్యతిరేకము. స్వప్నములో వస్తువులు లేకుండ వస్తువులను జూచితిమి. అది జాగ్రదవస్థలోఁ జూచిన వస్తువుల స్మృతి. జాగ్రదవస్థలోనిది యనుభవము. స్వప్నావస్థలోనిది స్మృతి. మీసిద్ధాంతప్రకా రము సర్వము స్మృతి. అనుభవ మాలయవిజ్ఞానసంబంధి. ఆ యాలయవిజ్ఞానమున కనుభవ మెచ్చటిది? ఆ యనుభవము స్వరూపమెట్టిది? అట్టి క్షణికమైన యనుభవమున కీ యాలయత్వ మెట్లుపట్టెను? భదంతుడు: మేము మాధ్యమికులము. మాకీ వాదమే లేదు. నీతో నూరకే వాదించితిని. మాకాత్మయు లేదు. దేహము లేదు. ఏమియును లేదు. కాళింది: మీకు శ్రుతిలేదు, స్మృతిలేదు, ప్రమాణములేదు, అనుమానము లేదు, పక్షము లేదు. యథార్థజ్ఞానము లేదు. ధర్మాధర్మము లెచ్చటినుండి వచ్చినవి? బుద్ధుఁడు లేఁడు. బౌద్ధ మెచ్చట నుండివచ్చినది? భదంతుఁడు: నీవు వేదాంతివి. వేద

మతానుయాయినివి. బౌద్ధమతపు పైతొడుగు తొడుగుకొని లోకమును బ్రతారించుచున్నావు. చక్రవర్తిని మోసము చేయుచున్నావు. మా మతముయొక్క ప్రాశస్త్యము నీతి యందుగలదు. మంచినడతయందుగలదు. కాళింది: ఏమతము చెడ్డనడత నడువు మని చెప్పును? నీతితోపాటు వేదాంతము. జ్ఞానము పరమార్థవిషయము, మా మతము బోధించును. దానినిగుఱించి నేనియుఁ దెలియని కొలఁదిభిక్షువులుగల నీ మతము సామాన్యమానవులకుఁ దెలిసిన సామాన్యవాదములు చేసి జనసామాన్యము నాకట్టుచున్నది. కాలక్రమాంతరములచేత మీవైపునకు మఱలిన చక్రవర్తులు మీమతము మతమని తెలిసికొనరు! ఒక్కొక్కని కొక్కొక్క కారణము. భదంతుఁడు: ఈ చక్రవర్తి కేమికారణము? కాళింది: ఆచార్యా! దొంగదారులు తీయకుము. ఆ ప్రశ్నతోఁ జక్రవర్తికి నామీఁదఁగోపము కల్పించవలయుననియా? ఆకారణము చక్రవర్తికిఁ దెలియును. నాకుఁ దెలియును? నాకే తెలియును. చక్రవర్తి కేమి తెలియును? తెలిసిన యింకొక వ్యక్తి యీ మహాసామ్రాజ్యములో మఱియొక్కతెయే కలదు. ఆమె సమక్షమున నేను జక్రవర్తి కా రహస్యమును జెప్పఁ బోవుచున్నాను. భదంతుఁడు: నేను కష్టపడి నిర్మించిన యీ బౌద్ధ సామ్రాజ్యమును నీవు నాశనముచేయఁ జూచుచుంటివా? కాళింది: నీ సామ్రాజ్యముతో నా కేమి యవసరము. నా సామ్రాజ్యము పోనే పోయినది. ఏ సామ్రాజ్యసుస్థితికిఁ గారణమనుకొని నేను బౌద్ధభిక్షుకురాల నగుట కంగీకరించితినో, యీ కారణమే విపరీతఫలదాయిని యయ్యెను. నీ సామ్రాజ్యమున కేమియు భయములేదు. బాహుబలశాంతిమూలుఁ డున్నాఁడు.

గ్రామసౌఖ్యజనితశాంతిభార మడ్డువచ్చి నట్లుండెను. చక్రవర్తి యిట్లనెను. 'భట్టీ! కాళిందీదేవిని నీవు చూచుటకు వచ్చితివి కావు. అసలీ నాఁడామెను జూడవలసినది. ఆమె భదంతాచార్యునితో వాదించెను. బౌద్ధమతమును ముక్కచెక్కలగా విమర్శించెను. ఆచార్యునకుఁ బెదవి కదలినదికాదు. ఆమె దేమి పాండిత్యము! నాకు మున్నే బౌద్ధమతమునందు విశ్వాసము లేదు. ఇప్పటి కసలే లేదు. బౌద్ధమతము మత మేమిటి? ఒక నీతిమార్గము. అమ్మ యన్నదికదా! 'నీతి కేమున్నది? ప్రతి మతమునీతిని బోధించును' అని. నీవందఱకు నాతండ్రి శాంతిమూల మహారాజుగారికన్న నెక్కువ తెలియునా? ఆయన కృతయుగపురుషుఁడు. నీ నిప్పుడే కాళిందీదేవి దగ్గరకుఁ దీసికొని పోదును గాని, నవ్వుచున్నావు. నీవు రాకపోయినచోఁ జేయిపట్టుకొని లాగికొని తీసికొని పోదును. ఆమె మాఘపూర్ణిమనాఁడుగాని మనలనిద్దరను రావద్దన్నది. ఇఱువదియేండ్ల విరహిణి, నా కామె నొక్కదినములో విరహతాపమంతయుఁ దీసివైచినది. కాని యింత నిర్మించిన బౌద్ధమతమును నేను మఱల నెట్లు వెల్లగింతును? అయినను నీ రాజ్యము, నీ మతము బాహుబలునివి. నా కేమి యవసరము?' అనెను. భట్టిదేవి 'యిట్లనెను. అవును. మన కేమి యవసరము. ఈ పదునాలు దినములు మనమును బౌద్ధులమే. చక్రవర్తి: ఓసీ భట్టీ! సరిగాఁ కాళిందీదేవి యాలోచించినట్లే యాలోచించు చుంటివి. నీ వెవ్వరవు? భట్టి: నేను క్షత్రియను. చక్రి: కాళింది భద్రుని కూఁతురు. ఆమెయు క్షత్రియయే. మీ క్షత్రియ స్త్రీల భావనా బలము; అమ్మో!

రాజ్యమంతయు వారి సంయోగము గన్గొనెన వార్త యయ్యెను. చక్రవర్తి భట్టిదేవి సాంగమునఁ బరమమైన శాంతి సౌఖ్యములనుభవించుచుండెను. బాహుబలుఁడు రాజ్యము నెలుపల శత్రువులు చేయు దాడుల నెదుర్కొనుటకు సైన్యసన్నాహములతో మిక్కిలి కలత పొందుచుండెను. వీరపురుషదత్తుఁడు విజయపురమున భిక్షువువలె సంచరించుచుండెను. బాహుబలుఁడు సామ్రాజ్య వీథులలోఁ బట్టపు టేనుఁగులమీఁద సంచరించుచుండెను. భట్టిదేవి చక్రవర్తికి బతివ్రతచేయు పరిచర్య చేయుచుండెను. కొండబలి తన భర్తమీఁదికి దండెత్తఁబోవు వన్నగారి కెలన యుద్ధాశ్వముపైఁ గత్తిదూసి సంచరించుచుండెను. భట్టిదేవిపేర వీరపురుషదత్తుఁడు మహాచైత్యమునకు నాయక స్తంభములు నిర్మించెను. కొండబలి యన్నగారిచేత యుద్ధవీథులలో జయస్తంభములు నిర్మించుచుండెను. చక్రవర్తికి మఱలిపోయిన శృంగారరసము పొరలివచ్చినదై రాగరసముతో వియ్యమందుచుండెను. బాహుబలునకుఁ బుట్టుకతో వచ్చిన భిక్షుకత్వము రాజ్యముతో వచ్చిన రౌద్రరసముతో వియ్యమందుచుండెను.

# పంచదశాధ్యాయము

తెల్లని పాలరాతి మహాచైత్యపు టాయక స్తంభముల మీఁద మాఘపూర్ణిమా శిశిరజ్యోత్స్నలు తారాడు యూర్ధ్వపుండ్రములమీఁదఁ దిర్యక్పుండ్రములు తీర్చినట్లుండెను. బుద్ధదేవుని సమాధివలె వెన్నెల లాకాశమున నొంతమేఱ వ్యాపించి పైని లేనట్లుండెను. దూరము, దగ్గరయుఁగాని విజయపురీ పర్వ

తాగ్రదుర్గకుడ్యములకు వేసిన వెల్ల వెన్నెల కెరటముల నెల్ల, చల్లచల్లగాఁ దెల్లతెల్లగాఁ దాకెను. ఆ సమయమున గాళిందీసౌధోపరిభాగమునఁ బఱచిన నెల్లకంబళముపై నలువురు వ్యక్తులు కూర్చుండిరి. అందు మువ్వురు స్త్రీలు; నాలవ వాఁడు వీరపురుషరత్నము. మూఁడవ స్త్రీ చక్రవర్తి. మేనయత్త శాంతిశ్రీ మహాదేవి. ఆమె తలమీఁద తెల్లని శిరోజములు తెల్లని పిల్లవెన్నెలలు కాయుచున్నట్లుండెను. చక్రవర్తి కాళిందిని చెప్పబోవు కథకు శాంతిశ్రీ సాక్ష్యమని గ్రహించెను. ‘శాంతిమూలచక్రవర్తికి సంతానము లేదు. శాతవాహనుల సామ్రాజ్యము శాంతిమూలుని వశమైనందులకుఁ దైన్సర్గికమైన హృదయము మిక్కిలి సంతసించెను. ఆయనకు సంతానము లేనందుకు దుఃఖించెను. అదియొక కథ శాతవాహన సామ్రాజ్యము సంగతమైనంతనే ధాన్యకటకమున యజ్ఞశ్రీ శాతకర్ణుని కుమారుని కుమారుఁడు గోముఖశాతకర్ణి యిఱువది యేండ్లవాఁడు భృతిపై బ్రతుకుచుండెను. ఆ వంశములో సామ్రాజ్యము పోయెనుగాని, సామ్రాజ్యభావన పోలేదు. ఆ యిఱువది యేండ్ల శాతవాహనునకుఁ దనకు సామ్రాజ్యము లేదని పట్టలేదు. శాంతిమూలునకు సంతానము లేదని పట్టెను. ఆ వంశపుచేవ యెట్టిదో! సామ్రాజ్యములేని తమ వంశపరంపర సాగుటెంతులకని, తాను నవివాహితుఁడుగా జనిపోవలయునని. ఆత్మ యొకటి భావించినపుడు మనస్సు వేఱొకటి భావించును. ఆతని హృదయ మొక రాచకన్నియయందుఁ దగుల్పడెను. శాతవాహనులు బ్రాహ్మణులు. ఆ రాచకన్నియ తండ్రి తన కూఁతు నా చక్రవర్తిత్వములేని చక్రవర్తి కిచ్చుట కంగీకరించలేదు. ఆమెయు నా శాతవాహనునియందు బద్ధమనస్క

యయ్యెను. పరస్పర దర్శనమాత్రమున వారిరువురు పులకిత బాహ్యపథములఁ బోయిరి. తెల్లపావురాల తుదిపుష్పాపలతో జప్పటలుచేయు వెన్నెల పిల్లలు వారి చిరునవ్వుల చున్నాలు సారించిరి. వారి పరస్పరాలోకన దీర్ఘమాత్రములు సూర్యకిరణములంత దవ్వుండెను. వారి ప్రేమకు విరహవైషమ్యము లేదు. శిశిర దీర్ఘయామినులు జ్యేష్ఠ దినాంతములవలె క్షణికములయ్యెను. ఇది సంయోగ సౌఖ్యాన్నము కాదు. విరహ భావనా సౌఖ్యఫలము. వారిరువురు నొకరి కొకరు తెలుసుగనే తెలుసుగదు. కన్నులు మాత్రమే కలసిన యా యువతీయువకుల సంయోగ వాంఛ శరీరాతిశాయి కావలయును. ఆత్మసంబంధి కావలయును. వారు వియోగదుఃఖ మనుభవింపలేదు. ఇట్లుండగా, నీ శాంతిశ్రీదేవి యారాచకన్యకు తండ్రివద్ద కొకరాయబారము తెచ్చెను. చక్రవర్తికి సంతానములేదు. క్షత్రియశిశువు కావలయును. ఆ శిశువు నెట్లో యొకట్లు రాజాంతఃపురము లోనికిఁ గొనిపోదుము. తాము కన్నశిశువు నెవరైన నిత్తురా?'' యని. కన్నబిడ్డ నెవరిత్తురు ? ఈమె వెడలిపోయెను. ఈ వార్త యా కుటుంబములో నొక విచిత్రమైన యాలోచన పుట్టించెను. చక్రవర్తి కాఁబోవుబిడ్డ క్షత్రియ మాతృగర్భ మైనచో సామ్రాజ్యభార వహనదక్షము కాదు. ఏమిచేయవలయు నేమి చేయవలయునని. అంత వారి కూతు రిట్లనెను. 'గోముఖ శాతకర్ణి చక్రవర్తుల యంశ కలవాఁడు. అతనికిఁ బుట్టిన సంతానము నట్లు చేయవచ్చునని. ఆ రాచకుమార్తె యిట్లు చెప్పిన త్రపారహితవాక్యము తల్లిదండ్రులకుఁ గోపము కలిగించెను. తండ్రి కోపించెను. తల్లి యిట్లనెను. "ఇది సమంజసమే. శర్మిష్ఠాది పూర్వ రాజకన్యలు చక్రవర్తులు కాదగిన సంతానము కొఱకు,

సామాన్య కోపభావమైన లజ్జాపరిత్యాగము చేయక పోలేదు."
దినములు గడువగా తండ్రి యంగీకరించెను. కాని గోముఖ
శాతకర్ణి యంగీకరించలేదు. తన వంశాంకుర మీరీతిగాఁ జక్రి
వర్తిత్వమును బొందుట యాయన సహించుకొనెను. ఆయన
యిట్లు సమాధానపఱచెను. 'కాలము చెడ్డది. అది మనుజుల
చే నాఁపను రాదు. శాతవాహనులు ధారణి సుమారు వందల
యేండ్లు ధర్మరక్ష సలిపిరి. ఆ రక్త మీవలన విరహితమైనను
ధర్మరక్ష సాగవలయునుగదా? శాంతిమూలునకు సంతానము
లేనిచో సాగుచున్న ధర్మవాహిని యింకిపోవును. ఆయన యొక
వేళ దత్తపుత్రు నొకని దెచ్చును. వానియందు సామ్రాజ్య
భారవహనశక్తియును నుండకపోవచ్చును. ధర్మాసక్తిశీలత్వ
ముండక పోవచ్చు' నని. గోముఖశాతకర్ణి యిట్లనెను. 'చక్ర
వర్తిత్వము మాలోనుండి పోయి చాల దినములైనది. ఇప్పటి
నా సంతానముకూడ సామ్రాజ్య వహనసహము కాక
పోవచ్చును' అనఁగాఁ గాదని చెప్పిరి. కాలమువలన సామ్రాజ్యము
వానికి దూరముగాఁ బోయెనుగాని వాని రక్తమునందలి శక్తి
యెచ్చటకుఁ బోవునని యొప్పించిరి. అప్పటివఱకు గోముఖునకుఁ
దన్నా రాచకూతురువలన సంతానము కల్పించుమని చెప్పువా
రని యతఁడనుకొనలేదు. తన బంధువులలో నొక బాలిక నిచ్చి
వివాహము చేయుదు రనిమాత్రమే యూహించెను. ఆ రాచ
కూతురి తండ్రి పోయి గోముఖునితో నిట్లు చెప్పెను. 'చక్రవర్తీ!
మీరు శాంతిమూలుని సంతతి సాంతత్వము కలిగించుట
యంగీకరించి నందులకు మీకుఁ గృతజ్ఞుడను. కాని, మీరు
బ్రాహ్మణులు. ఇక్ష్వాకులది క్షత్రియ సామ్రాజ్యము. అందు
చేత క్షత్రియ స్త్రీయందే తమరికిఁ గలిగిన సంతానము శాంతి

మూలుపకుఁ జెందవలయును. తమరు నా కూఁతును జేప్రియింప
తిరి. ఆమెయుఁ దమమొదల బద్ధానురాగయైయుండెను. నే నివ్వా
హమంగీకరింపలేను. మీ వివాహమున కిష్టపడు నంగీకరింపను.
మీరు వివాహ మాడరాదు. ఈ ధర్మరక్షకొఱకు, ఆంధ్ర
సామ్రాజ్య ధర్మపాలనకొఱకు మీ రామెయందు సంతానము
గనవలయును. పురుషశిశువు కలిగినతరువాత మీకును నాకును
సంబంధము లేదు. కట్టి ధర్మరక్షాభిలాషతోఁ దమరు దీని
కియ్యకొందురేని లోకోపకారము చేసినవా రగుదురు' అనెను.
గోముఖ శాతకర్ణి తా నిట్లనెను. 'నాకు సంతానమునం దాస
లేదు. నాతో శాతవాహన వంశ మంతరించవలెనని నా యుద్దే
శము కదుక న న్నేల బలవంతపెట్టవలయును?' అప్పు డామె
తండ్రి యిట్లనెను. "ఆ సంతానము మీ సంతానముకాదు. మీ
వంశముయొక్క పారంపరియుఁగాదు. కట్టి ధర్మరక్షు" యనెను.
ఎట్లయిననేమి? శాతవాహనుఁ డందు కంగీకరించెను. వారిరు
వురకు రహస్యసమాగమ మేర్పడెను. ఆ వీరపురుషుఁడు తన యీ
ప్రియాసమాగమున మానస్నిక్షిప్తసరిస్థితికి మిక్కిలి దుఃఖించెను.
ఆ రాచకూఁతురు కానందమునందు లోపము లేకుండెను.
ఆయన కానందమే లేకుండెను. ఆ యమ్మకుఁ దన కొడుకు
చక్రవర్తి యగునని సంతోషము. ఆతనికిఁ గలుగఁబోవు సంతా
నము తనకు సంతానమే కాదని. వారిరువురు పరస్పర లగ్నచిత్తు
లైనను యీ విచిత్ర సంఘటనచేత నది శృంగారరసమే కాక
పోయెను. మాధవీలత మాకందతరుశాఖపై పొత్తిగిల్లిన ట్లామె
యతనిపై నొత్తిగిల్లును. ఆ మాకందతరువు పశ్చిమవాయువు
చేత వెనుకకు లాగఁబడిన చివురాకు హాస్యములుగాఁ బెడ
మొగము పెట్టును. లోకమునందుఁ దేనటీఁగ పోయి పువ్వుము

నందుఁ బరిభ్రమించుట కలదు. అప్పటఁ బరిభ్రమింపక నిలచి
యున్న తేనెటీఁగపైఁ బుష్పమే పరిభ్రమించెను. తాంబూలము
సేవించి నవ్వినట్లున్న, పండి పగిలిన దాడిమీ ఫలములతో
సంభోగశృంగారలక్ష్మి సామ్రాజ్యధురంధరుఁడైన వసంతుఁడా
శాతవాహనుని మొగములోఁ గనిపించలేదు. ఆ రాచకూఁతురు
మాత్రము హేమంత హిమపాతమున స్నానమాడెను. వన
లక్ష్మివలె నతనియందు వాంఛాదృగంచల యయ్యెను. వారిరు
వురి ప్రేమయు దృగంత ప్రసారమాత్ర పరిపూర్ణమైనదికదా?
అందుచే శోభాయాచనములయందు విధురచాలనము లేకపోయి
నది. ఒక్కొక్కప్పుడు ముందు రాబోవు పరిస్థితులు వెనుకటి
మాటలలో స్ఫురించును. ఆమె యొకనాఁడన్నది. 'స్వామీ! నీ
యీ వైముఖ్యమువలన నేమి విపరీతశిశువు జనించునో? చక్ర
వర్తుల క్రమము నా నాడులలోఁ బ్రవహించుచున్నది. అందుచేత
బుట్టెడు బిడ్డ చక్రవర్తి కాకతప్పదు గాని నీ యీ వైముఖ్యము
వలన వాఁడు సన్యాసి యగునేమో? నా యీ సంతాన భిక్షాభి
లాషచేత వాఁడు భిక్షువగు నేమో?' యని. అప్పుడు చక్రవర్తి
యిట్లనెను. 'అది కాదమ్మా! మన సంయోగము ధర్మమైనది
కాదు, అధర్మమైనదికాదు. ధర్మాధర్మములుకాని యొక విచిత్ర
ధర్మపరిపోషమైన బుద్ధితో నాశిశువు జనించు ననుకొందును.
నిజముగా మనము చేయునది జారత్వము. ఇది తల్లిదండ్రుల
యంగీకారముతోఁ జేయుచుంటిమి. తనతండ్రి యెవరో తెలియని
సంతానము. తన తల్లి రహస్యముగఁ గన్న సంతాన మెన్ని
పోకిళ్ళుపోఁ బోవును. సర్వధర్మవిచ్ఛేదకారి యగును. సంప్ర
దాయ విధ్వంసనహేతు వగును. తల్లిదండ్రుల రహస్యకామ
మంతయు వానియందొక విచిత్రమైన మనోవ్యాకులత్వ మేర్ప

జూచి, యీ వ్యాకులత యెవరిమీఁదనో, యెందుకో తీర్పరాని
దగనాఁ బరిణమించును. అతనివలన శోక మెంతయైనను నిక్షే
భము పొందును. ఇట్టిసంతానమును గనుట శోకమునకే కల పియ
వలయును?" ఈమాటల నా చాకోనాపు నెంతదిగులుసనెనో
నెనను చెప్పఁగలను? కాని శాంతిశ్రీదేవికి వ్యాధ్యావస్థయైనది. ఆమె
యెంతటి సమస్యగోపన మెట్లు చేయునో యదియు నాక్యాశ్చ
ర్యముగా నుండెను. ఆ యాశ్చర్యములో నా సంపత్తులు తన
కాముతో నుఱువిపోవుచు వచ్చెను."

అంత శాంతిశ్రీ యిట్లనెను. "అప్పటికే నా యన్నగారికి
వార్ధక్యము పొడచూపుచుండెను. మాశకీదేవియు గుణశాలినము
గడచిన స్త్రీ. ఆరాచకుమారుని తల్లిదండ్రులకుఁ బట్టిన భయమే
మాకునుబట్టెను. నా యాలోచన చక్రవర్తికిఁ దెలిసినచో సంగీక
రింపఁడు. ఆ పన్నాగ మంతయు నేనే పన్నితిని. నాకిద్దరే సాయ
పడిరి. మాశకీదేవియు నాపరిచారిక యొకతెయు. మాశకీదేవి
కాపురమునకు వచ్చినప్పటినుండియు నాయందు మిక్కిలి
గౌరవము కలది. ఆమెకు నాయందెంతవిశ్వాస మనగా నేను
దలచినపని, చేసినపని సర్వథా నిశ్శ్రేయసములని. నా రాజనీతి
వేత్తృత్వము, నావివేకము, నామెను నాయెడల భక్తురాలుగాఁ
జేసెను. ఆమె మా యన్నగారియందుఁ బరమభక్తురాలు-
మనసా, వాచా, కర్మణా. ఆమె యాయన నెప్పుడుఁ బరిత్యా
రించలేదు. ఈ యొక్కవిషయములోఁ బ్రతారణము జరిగెను.
దీనివలన నేదైన పాపమున్నచో నాపాపమంతయు నేను దీసి
కొందునని యామెను దులసివద్ద నిలుచుండఁబెట్టి మాశకీబృంద
ముగఁబ్రదక్షిణముచేసి ప్రమాణముచేసితిని. తరువాతఁజక్రవర్తికి
ముఖ్యసంతానము కలుగునని కార్తాంతికులచేతఁబదేపదే చెప్పించి

తిని. చక్రవర్తికిఁ జివర చివరకు విశ్వాసము కలిగెను. ఇంతలో ధాన్యకటమునుండి యొక రాచకూఁతురు గర్భవతి యని వార్త వచ్చెను. నాటినుండి నే నాడిన దొక నాటకమా? మాంత్రికీదేవికి సీమంతోత్సవము చేయించితిని. పట్టణమంతయుఁ బండ్లు గంపలు పంచిపెట్టించితిని. మూఁడునెలలు దాటినతరువాతఁ జక్రవర్తి నాయొద్దిక లెన్నియోనిపడెను. ఇది యిట్లుండగా రాజ్యములో నెట్లు పుట్టెనో యొక కింవదంతి పుట్టెను. మాతరీదేవిగర్భము లేదు, గిర్భములేదు. ఇదియొక నాటక మాడుచున్నారని. అట్టి వదంతి పుట్టినచోట నెల్ల గలుపేరించితిని. ఆఱు నెలలు గడచు నఱకు నా తలప్రాణము తోకకు వచ్చెను. అది వర్షర్తువు. నాఁడెల్ల వాన కురియుచునే యుండెను. సాయంకాలమునకు శిశూదయము జరుగునని, జరిగిన తరువాతఁ బది గడియలలోఁ బురుషశిశువైనచోఁ బడవమీఁదఁ దెచ్చి యందిత్తునని యు, వార్త వచ్చెను. భగవంతుఁడు నాప్రయత్నముల కనుకూలించెను. వేసిన చినుకేగాని తీసిన చినుకే లేదు. రాత్రి రెండు జాములు దాటినతరువాత క్రొంచెము తెఱపియిచ్చెను. అంతఃపురములో వేన్నీళ్ళు, గంగాళములు నా యదుపులోనున్న యొక మంత్రసానిని, సర్వము సిద్ధముగా నుంచితిని. ప్రతిపదము మగశిశువు కలుగలేదేమో యన్న భయము. ఆ నాఁ డెంతమంది హాక్కుల బంగరుసంచులతో బంధించితినో భగవంతున కెఱుక. చివర కన్నియు సరిగా నడచెను. నే నొక బుద్ధిహీనురాలను. ఆ రాచకూఁతురు ధనమున కాశించి తన శిశువు నిచ్చుచున్న దని తలచితిని. ఈ నలుఁబదియేండ్లు నా కా విషయమున యథార్థ జ్ఞానము కలుగలేదు. ఈనాడు బోధశ్రీ చెప్పిన మాటలవలనఁ దెలిసినది. అహో! ఆ దంపతులు మనుష్యులా? దేవతలా?

వారి ధర్మచింతన నెట్టిది? మఱి శిశువు ప్రాప్తించినన్న సంతోష
ములో నే నామె కొసంగవలె నని తీసికొనిపోయిన ధనమే
యొసగలేదు. నాకు జ్ఞాపకమున్నది చూచితిని. అప్పటి కప్పుడే
నామె తన పుట్టినపడవలోనే పోయి కూర్చుండెను.”

కాళింది మఱల నిట్లనెను. “గోముఖశాతకర్ణికి వీర
పురుషుడని నామాంతరము. అందుచేత నీ తల్లి వీరపురుష
దత్తుడని పేరుపెట్టెను”

శాంతిశ్రీ యిట్లనెను. ‘అవును. నా పేరు నా కన్నతల్లి
పెట్టినదే. ఇచటకువచ్చిన మాతృమునకదా నీ హస్తములో నొక తాటి
యాకుమీద నెఱ్ఱని యక్షరములతో వీరపురుషదత్తుడని
వ్రాయబడియుండెను.

కాళింది యిట్లనెను. “ఈ నామకరణము గోముఖ
శాతకర్ణియే చేసెను. ఆయన తన నక్షత్రమును గత్తితో గీరి
యా రక్తములో నొక సన్నని కుంచెపుల్లకొని యా తాటి
యాకుమీద వ్రాసెను. అంతవఱకు వీరపురుషునకు లేని మమ
కార మా నిమేషమున వేయిమడుంగులై కలిగెను. తనకొడు
కును దాను వదల ననెను. మీ సామ్రాజ్య మేమైన నా కేమి?
ఈ శిశువు నాగన్యము. నాకు తెలియక యక్కఱలేదనుకొన్న
సంతానము, ఇది యాంధ్రవిష్ణువు తేజము. ఈ తేజమును నా
వంశములోనుండి వెలికిబోనీయనని. అప్పుడే బోధకాడించిన
యా శిశువును వదలలేదు. ఆ రాజమాత్యుడును, నామె తల్లి
తండ్రులును దీనవదనులై ప్రార్థించిరి. ఆ శిశువుతల్లి చివరకు
మెత్తని బలవంతముచేసి తన్ను వివాహము చేసికొందు నని
వాగ్దానమిచ్చి బతిమాలిలాగుకొనెను. వీరపురుషుడు నిజముగా
నా రాచకన్నె తన్ను వివాహమాడు ననుకొనెను. ఆమెయు

దల్లిదండ్రుల నొప్పించవచ్చు ననుకొనెను. కాని యామె తలిదండ్రు
లంగీకరించుటకు మిగుల ప్రయాసయయ్యెను. రెండేండ్లు
గడచెను. వా రంగీకరించిన తరువాత వీరపురుషుఁడు తాను
పెండ్లి చేసికొన ననెను. ఆయన నిరాకరించుటచేత నామె తల్లి
దండ్రులకుఁ గోపమువచ్చెను. ఆ వివాహము జరుగునో జరుగదో
తేలుటకు పదునాఱేండ్లు పట్టెను. అప్పటికి గోముఖశాతకర్ణి
విరాగియై వెడలిపోయెను. ఎచ్చటికిఁ బోయెనో యెవ్వరికిని తెలి
యదు. ఆరాజకుమారి నాటికి ముప్పదియేండ్లుదాటిన యువతి.
భర్త దేశాంతరముపోగాఁ దానేమిచేయును? బౌద్ధసన్యాసినివలె
వేషము వేసికొనెను. శాంతిశ్రీతోఁ బ్రతిసంవత్సరము వచ్చితన
బిడ్డను చూచిపోవుచున్న యామె తనబిడ్డకుఁ బదునెనిమిదేండ్లు
వచ్చు. శాంతిమూలచక్రవర్తియు, మాతరీదేవియుఁ జనిపోయిన
పదమూఁడవ దినమునఁ దల్లి చనిపోయిన దని దుఃఖించుచున్న
వీరపురుషదత్తునకుఁ జనిపోలేదు. బ్రతికియేయున్నానని చెప్పు
టకుఁ బోయిచూచెను. ఆ మాతృదుఃఖపరిశుష్కితాస్యుని, తన
కన్నకొడుకును జూచి యామె యేమనుకొనెనో! అతని చచ్చి
పోయిన తల్లి మఱల నేల బ్రతుకవలయుననియే వెడలిపోయెను.
ఆతల్లికి నా బిడ్డనిగాని మమకారమెట్టిదో! ఆమె తాను దనబిడ్డ
బౌద్ధుఁడని బాధురాలయ్యెను. తనబిడ్డ బౌద్ధుఁడైనందుల కామె
యెంత దుఃఖించెనో తెలియదు. తానేమో ధర్మరక్షణకై
యంతజేసెను. తనకొడుకు తనయూహించిన ధర్మమునకు
వ్యతిరేకముగా నడచెను. తానేమి చేయఁగలదు. తానతని
తల్లినని చెప్పికొనుట... కవకాశములేదు. తనకుఁ దనబిడ్డను
బిడ్డా యని పిలిచికొను యోగ్యత లేదు. ఆమె మనస్సున
కొక విచారము పట్టెను. వీరపురుషుఁడు తన కుమారుఁడు డిల్లయ్యె

యని విన్నచో నేమగును? తానే తన చేతులారఁ జెఱచుకొన్నచో నిట్లు కానిచ్చునా? ఆ రాచకొడుకు మనస్సులో గోముఖ శాతకర్ణికిఁ దనవలన జరిగిన మహాపరాధము శల్యమువలె బాధింపఁ జొచ్చెను. ఆమె చిన్నప్పటినుండియుఁ బండితులైన గురువులయొద్ద వేదమతము నంతయు నేర్చికొనెను. ఆ కొడుకు నెమ్ము బౌద్ధమతాచార్యులతో నారంభించి వారిమతము తన కొడుకుచేతఁ గాదనిపించవలయునని ఘనాశ పొందిన యామెకు మితిలేదు. ఆమెకు తన కొడుకునం దెంతవిశ్వాసము. అతని రక్తములో శుద్ధమైన బ్రాహ్మణమతాభిమానము గల గుణము లున్నవి. వాదించినచో నతని ప్రకృతి సహజముగా నే వాదన కభిముఖమగును. బ్రాహ్మణుఁడు కానివానికి బ్రాహ్మణమతము లోని మర్మము లెట్లు తెలియును? జన్మచేత దానియం దభిమానము లేనివాని కదెట్లు రుచించును? ఏ మతములోఁ బుట్టిన వాని కా మతసిద్ధాంతములు సమంజసములు, సహజ యథార్థములుగాఁ గనిపించును. ఒకవిషయము సిద్ధాంతముగా యాథార్థ్యముగా భాసించుటకు మనుష్యునిరక్తము, వాని పెంపకము, వాని పరిచయము మూఁడును హేతువులు. దీనిలోఁ బూర్వాపూర్వము బలీయము. అందుచేత నామెకుఁ దనకొడుకు తన వాదము నంగీకరించు నని ప్రబల విశ్వాసము. కాని యామె తనకొడుకు నొక్కనినే మార్చుకొనఁగలదు. కాని రాజ్యమునంతయు మార్పు జేయఁగలదా! గోముఖశాతకర్ణి యేమనెనో! నాకు సామ్రాజ్యము పోయినదనెను. ఆయన యనఁగా నెవరు? వేద ధర్మము. ఆ వేదధర్మమునకు సామ్రాజ్యము పోయినది. కాని యా వీరపురుషుని శరీరములోఁ గల రక్తమునందు వేదధర్మ మెట్లు నశించినది? అందుచేత నాయన ప్రేగునుండి పుట్టిన ప్రేగు,

వీరపురుషదత్తుని రక్తములో వేదధర్మము నశించదు. ఇది యామె విశ్వాసము. ఆమె తన కడుపునుండి పుట్టిన బిడ్డయొక్క వేదధర్మ పునరుద్ధారణకొఱకు మాతృత్వము బలిచేసియుండి తన కన్నతల్లి యొక్క భాగము మేఱ చంపివేసెను. వీరపురుషదత్తుడు శాంతిమూలమహారాజు కొడుకు. మాఠరీదేవి కొడుకు. శరీరము చేత సామ్రాజ్యముచేత వాసిష్ఠీకుమారుడు. ధర్మముచేత గోముఖ శాతకర్ణి కుమారుడు. శరీరముచేత గోముఖ శాతకర్ణి కుమారుడు. ధర్మముచేత శాంతిమూల మహారాజు కుమారుడు. శరీర దృష్ట్యా మాఠరీదేవి కొడుకు. ధర్మదృష్ట్యా యా రాజకూఁతురు కొడుకు. కాదోయి తండ్రీ! శరీరముచేత నా రాజకూఁతురు కొడుకు. ధర్మముచేత మాఠరీదేవి కొడుకు. అటునిటు ధర్మము చెడలేదు. ధర్మముచేత నతని మాతాపితలు నిష్కళంకలఁ జెడ లేదు. శరీరములచేత వారలు చనిపోయిరి. ఆ రాజకూఁతురు తన కుమారుని కెంత చేయవలయు ననుకొన్నదో యంతయుఁ జేసినది. బౌద్ధాచార్యులతో కొడుకు నెదుట వాదించినది. అతని వాదము పరాస్తము చేసినది. కొడుకును వేదధర్మమందు రక్షించినది. వీరపురుషుని ఋణము తీర్చినది. నడుమ వచ్చిన కొంచెము దోషమును దొలఁగించినది. నీవు క్షత్రియ స్త్రీకిని బ్రాహ్మణునకును జన్మించినావు. నీది నీచజన్మము కాదు. నీ భార్య భట్టిదేవి జన్మకన్న నీజన్మ యుత్తమమైనది. నీకు సందేహము తీరినదా?" యనెను.

అంత భట్టిదేవి యిట్లు సంబోధించెను. 'అత్తా' అని. కాళింది తన ముక్కుపై వ్రేలుంచుకొనెను. భట్టిదేవి గుక్కత్రిప్పుకొని యిట్లనెను. "తల్లీ! సందేహ మెవరికి? ఆయనకు లేదు. నాకు లేదు. నా కున్న దని యాయన యను

కొనుచుండెడివాఁడు. ఇదియంతయు నొక కపటనాటకముగా జరిగెను. మహాపురుషుఁడైన వీరపురుషుఁ డేతావన్మాత్ర పరిణామము చెప్పనే చెప్పెనుగదా! అట్లే జరిగినది. శాతాంబలుఁడు పెద్దవాఁడయ్యెను. రేపతనిఁ పట్టాభిషేకము జరుగును. అతని వేదధర్మముగూర్చి నీకేమి? నాకేమి? అతఁడు బౌద్ధుఁడై పుట్టెను. బౌద్ధుఁడై పెరిగెను." వీరపురుషదత్తుఁ డిట్లనెను; "నిజమే. అతఁడు బౌద్ధుఁడై పుట్టెను. బౌద్ధుఁడై పెరిగెను. నాకేమి? నీకేమి? భట్టీ! అతనికి రేపే పట్టాభిషేకము చేసి నా దారి నేను బోయెదను. ఎచ్చటికిఁ బోదునో యెవరికిఁ దెలియును? బౌద్ధభిక్షువను బ్రాహ్మణ సన్యాసి నగుదును. నీవు అ—కాదు. కాళిందీదేవి సౌధమున నీ జీవితమును వెళ్లఁబుచ్చుము. శాంతిమూలమహాశ్రీ దేవులు లేని రాజాంతఃపురములో మన కేమి పని?"

సమాప్తి.